




ఉషాకిరణ్ మూవీస్

# ఓ భార్య కథ

రామోజీరావు · మౌళి

అట్లూరి రామారావు

అనూరాధా రమణన్ · ఆకెళ్ల · యస్.పి.బాలసుబ్రహ్మణ్యం · యం.వి.ర

# కృతయుగంలో చంద్రమతి, త్రేతాయుగంలో సీత, ద్వాపరయుగంలో ద్రౌపది, కలియుగంలో 'ఇందుమతి'




అలనాటినుంచి ఉన్నదే ఇదీ. అనాదిగా ఆడదానికి అన్యాయం జరుగుతూనే ఉంది. ఒక రాముడు తన భార్యను అగ్నిప్రవేశం చేయించాడు. ఒక హరిశ్చంద్రుడు తన భార్యను నడిబజారులో వేలంవేశాడు. ఒక నలుడు తన భార్యను నట్టడవిలో వదిలేశాడు. అయినా కొందరు ''అవన్నీ పాతకాలం కథలు. ఇపుడా అన్యాయాలు లేవు'' అంటూవుంటారు. అలా అనేవారికి నేటి వాస్తవికతను వివరించేందుకు వస్తోంది ఉషాకిరణ్ మూవీస్ ''ఓ భార్య కథ''.

ఇదీ ఓ భార్యకథే... ఆ భార్యపేరు ఇందుమతి. చదువుకున్నది. ఆదర్శాలు వల్లెవెయ్యడుగానీ- ఆదర్శవంతంగా బ్రతుకుతోంది. ముచ్చటయిన ముగ్గురు పిల్లలతో- భర్తతో- ఒడిదుడుకులు లేకుండా హాయిగా సంసారం నడుపుకుంటోందామె.

ఇంతలో ఏ ఇల్లాలికి ఎదురవ్వగూడని సందిగ్ధ పరిస్థితి ఎదురయ్యిందామెకు. ఆ పరిస్థితి కల్పించిందీ కట్టుకున్నవాడే. పరాయి

ఇంటికి వెళ్లమని ఒత్తిడిచేశాడు. ఆడది గడప దాటితే అగచాట్లేనని ఆమె భర్తకి నచ్చచెప్పినా అది చెవిటివాడిముందు శంఖం ఊదటమే అయింది.

మంచిమనసుతో భర్తమాటప్రకారం ఇతరులకు ఉపకారం చేసి వెనుకకు మరలుదామనే ఆశతో పరాయిఇంటిలో కాలుపెట్టింది. అయితే కాలం ఆమెని కాటేసింది.... ఫలితం ఎన్నో నిందలు. అపవాదులు. అవమానాలు ఎదుర్కొంది. ప్రాణప్రదమయిన పిల్లలకి దూరమయింది.

చివరకు- పట్టుబట్టి ఆ ఇంటికి పంపిన భర్తే- నీస్థానం... పడకగది వరకు వెళ్లిందా..? అని అడిగేడు. అది ఏ భార్యకు ఎదురవ్వగూడని స్థితి. కడుపున పుట్టిన బిడ్డలకోసమైనా గుండె గట్టిచేసుకుందామనుకుందా మాతృహృదయం. అయితే ఆబిడ్డ... బ్రతికుండగానే తల్లికి పిండం పెడుతున్నాడు.

ఊహించని వైధవ్యం... ఇలా జీవితం వెంటాడి వేధిస్తుంటే- అబల అబలగానే మిగిలింది. సబలై- తన జీవితాన్ని చక్కదిద్దుకుందా? సమాజంలో సాటిస్త్రీలకు అన్యాయం జరుగుతుంటే- సాటిస్త్రీగా తనేం చేసింది....





"ఓ భార్యకథ" అన్నాక ఆ భార్యకో భర్త ఉంటాడుగదా!

ఆ భర్తపేరు శివరాం. జీవితంలో ఎలాగయినా పైకివెళ్లాలనేదే అతని ఆరాటం... అతనికి మార్గాలు ముఖ్యంకాదు... లక్ష్యమే ప్రధానం. ఆ లక్ష్యసాధనకు అతను ఎన్నుకున్న మార్గం ఏ భర్తా సాహసించనిది- ఏ భార్యా హర్షించలేనిది....

భార్యమాటలు పెడచెవినపెట్టాడు. కన్నతల్లి నుంచి బిడ్డల్ని దూరంచేశాడు. ఫలితంగా అనుకోని అపవాదుల్నీ- అవమానాలని ఎదుర్కొన్నాడు.... అయితే ఆశించిన ఫలితాలు మాత్రం అందినవి. ఫ్యాక్టరీలు కట్టాడు. రాజకీ



యాల్లో పైకొచ్చాడు.... వచ్చునోట్లు పోగేశాడు. బజారులో కొనగలిగేవన్నీ కొన్నాడు.... మన శ్శాంతి మాత్రం ఏ బజారులో దొరుకుతుందో తెలియలేదు. కాలంకన్నా వేగంగా జీవితాన్ని పరుగెత్తించిన శివరాం ఆత్మవంచన- ఎంతవరకు వెళ్ళింది? అతని కుటుంబం ఎన్ని బాధలకు గురయ్యింది...???

ఈ చిత్రంలో మరో మంచి పాత్ర సుభాష్‌పటేల్‌ది. విధివంచితుడు. దుఃఖమే అతని తోడు- నీడ. అతని నీడకి వచ్చిన ఇందుమతి అపవాదులపాలయ్యింది. అవమానాలు ఎదుర్కొంది. అందుకతను విలవిలలాడేడు. అయితే ఇందుమతి కుటుంబాన్ని ఆదుకోవటానికి అతను అందించిన డబ్బు ఇందుమతితో అతన్ని శాశ్వతంగా బంధించేసింది. ఆ బంధం తెంపుకోవాలని అతను ప్రయత్నించినకొద్దీ ఆ ముడి బిగుసుకుంది. అది ఇందుమతి జీవితాన్ని ఊహించని మలుపులు తిప్పింది. ఆ బంధాన్ని తెంపటానికి అతనేం చేశాడు??? శివరాం స్నేహితుడు మాణిక్యంది మరో మంచిపాత్ర.



అంతరాత్మ నోరుముయ్యగలంకానీ- ఆత్మీయ మిత్రుడి నోరు ముయ్యలేం.. మంచి మిత్రుడే నిజమైన మనస్సాక్షి. శివరాంచేసే ప్రతిపనికీ స్పందించి- వ్యాఖ్యానించి ప్రేక్షకుల మనసులో మెదిలే మనోభావాలకి తెరమీద అద్దంపడతాడీ మాణిక్యం.. ఇదో చిత్రమైన పాత్ర. తెలుగుతెరమీద విలక్షణమయిన పాత్ర..

తన తల్లి మరొకరితో లేచిపోయిందనే ఆగ్రహంతో కన్నతల్లినే కారుకూతలు కూసి చంపాలనుకునే కృష్ణ పాత్ర- దూరమయిన తల్లిమనసులో- తమస్థానం ఏమిటో తెల్సుకోవాలని ప్రయత్నించే శంకరం- నీరజలు.

అవనిందలు- అవమానాలు ఎదుర్కొంటున్న తమ్ముడికి అండగానిలవాలని- బ్రతికున్న మరదలికి శ్రాద్ధకర్మలు చేయించే అక్క కాంతం...

ఇలా అన్ని పాత్రలు- నిత్యం మనకి కనిపించే అనేక మనస్తత్వాలకి సజీవ చిత్రణే....

సన్నివేశాలు- సంఘర్షణలు- మెదడులో ఎన్నో ప్రశ్నలు లేవనెత్తుతాయి. చిత్రం చివరివరకు చూస్తేకానీ నిలువనీయని ఆసక్తిని పుట్టిస్తాయ్.

**ఉషాకిరణ్** మూవీస్‌వారి "ఓ భార్య కథ" చిత్రం చిత్రమనస్తత్వాల బహుపాత్రల సమ్మేళనం. ఇందుమతిగా జయసుధ నటన ఆమె నటజీవితంలో ఓ ఉన్నతశిఖరం. శివరాంగా చంద్రమోహన్, సుభాష్‌పటేల్‌గా శరత్‌బాబు, మాణిక్యంగా సుత్తివేలు నటించిన ఈ చిత్రంలో **గొల్లపూడి** మారుతీరావు, కోట శ్రీనివాసరావు, సుచిరాజ్, దీపక్, అరవింద్, సూర్యకాంతం, వై. విజయ, ఊర్మిళ, సుప్రియ, హరి, సితార... ప్రభృతులు నటించారు.

అనూరాధా రమణన్ కథ, ఆకెళ్ల మాటలు, వేటూరి గీతరచన, యస్.పి. బాలసుబ్రహ్మణ్యం సంగీతం, యం.వి. రఘు కెమేరా, గౌతమ్‌రాజు కూర్పు, భాస్కరరాజు కళ.

అట్లూరి రామారావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్.
నిర్మాత రామోజీరావు...
స్క్రీన్‌ప్లే, దర్శకత్వం.. మౌళి.
ఈ చిత్రం మయూరి విడుదల...
















# ఓ భార్య కథ

రామోజీరావు మౌళి అట్లూరి రామారావు

అనూరాధా రమణన్ · ఆకెళ్ల · యస్.పి.బాలసుబ్రహ్మణ్యం · యం.వి.రఘు · గౌతంరాజు · భాస్కరరాజు

ఈ దేశంలో కోడళ్ళు అంటించే స్టవ్‌లే పేలిపోతున్నాయి
అత్తలు అంటించేవి అంటుకోనంటున్నాయి.
అది మాన్యుఫాక్చరింగ్ డిఫెక్టా! లేక అత్తల టార్చరింగ్
ఎఫెక్టా !




# ఆడదే ఆధారం



ఆకెళ్ళ · సీతారామశాస్త్రి

శంకర్-గణేష్ · బాలకృష్ణ

కథ · స్క్రీన్‌ప్లే - దర్శకత్వం
విసు

నిర్మాత
ఎ.పూర్ణచంద్రరావు

# వేగుచుక్కపై సమీక్షలు

**ఆగస్ట్ నెల 'చతుర'లో ప్రచురితమైన కాకాని చక్రపాణి, వి. నాగరత్నకుమారిల నవల 'వేగుచుక్క' పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.**

## మార్గదర్శకం

**(ప్రథమబహుమతి రూ.100/- పొందిన సమీక్ష)**

**ఈ**రోజుల్లో స్త్రీకి జరుగుతున్న అన్యాయాలను దృష్టిలోపెట్టుకునే సీత పాత్ర చిత్రీకరణ జరిగింది. అయితే మన చుట్టూ జరుగుతున్న అన్యాయాలకు బలియై ఆత్మహత్యలకు పాల్పడుతున్న లేదా హత్యచేయబడుతున్నవారిలాగా కాకుండా సీత ఆత్మవిశ్వాసంతో నిలబడి ధైర్యంగా బతకటం చాలా చక్కని పరిష్కారం. ఇలాంటి కొన్నిసంఘటనలు చదివైనా నేటి యువతి ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించుకుంటే ఇన్ని ఆత్మహత్యలు జరగవేమో. కేశవమూర్తి ''పాపా... ఇది నీకు చివరిపాఠం. మనుమల్ని వక్రించిచూడకు. జీవితంతో రాజీపడవద్దని చెప్పడంలేదు, అయితే మన స్వాతంత్ర్యానికి, ఆత్మగౌరవానికీ భంగంకలిగించే రాజీపడకు. తననితాను గౌరవించుకోలేని మానవుడిని ఇతర్లు గౌరవించరు. ఏబంధాలైనా మనం కల్పించుకునేవే! స్వేచ్ఛగా, మనసుకు ఆనందంకలిగేవిధంగా బతకాలి'' అని సీత కాపురానికి వెడుతున్నప్పుడు చెప్పినమాటలు పెళ్ళయి కాపురానికివెడుతున్న ప్రతి ఆడపిల్లా ఆచరించాల్సిన మాటలు. ఇలా చిన్నప్పటి నుండీ సీతకి కేశవమూర్తి మంచి శిక్షణఇచ్చారు కనుకనే సీత అంత ధైర్యంగా భర్తనివదిలి ఇవతలకు రాగలిగింది; తన కాళ్ళమీద తాను నిలబడగలిగింది. భర్త ఎంత హింసిస్తున్నా నిస్సహాయంగా పడివుండే చాలామంది ఆడవాళ్ళకు సీతపాత్ర చక్కని మార్గం చూపిస్తుందనటంలో సందేహంలేదు.

అయితే సంప్రదాయాలకు విలువనిచ్చే సీత భర్త కోటేశ్వరరావు పెళ్ళయినాక ఒక్క పండుగకన్నా అత్తవారింటికి వెళ్ళకపోవడం అసహజంగాఉంది! పైగా సీత పురిటిక్కూడా అక్కడగ్గరకు వెళ్ళదు. పోనీ సీత ప్రసవసమయంలోనయినా అక్కడగ్గరుండడు. అసలు సీత పెళ్ళయి కాపురానికి వెళ్ళినప్పటినుంచీ, మళ్ళీ విడిగా కాపురంపెట్టేవరకు ఒక్కసారయినా పుట్టింటికి రాదు. అట్లావచ్చినట్లయితే సీత పరిస్థితి కేశవమూర్తికి తెలిసేది. ఇంకా ముందుగానే సీతకి విముక్తికలిగేది. ఇటువంటి చిన్నలోపాలు వదిలేస్తే 'వేగుచుక్క' నవల నేటి సమాజజీవితానికి దర్పణంపట్టి సమస్యలను చూపడమేగాక ఆ సమస్యలకి మంచి పరిష్కారంకూడా చూపింది.

**—యమ్.యల్.సత్యమణి**, మద్రాసు

## సమంజసంగాలేదు

**(ద్వితీయ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)**

**నే**టి పురుషాధిక్య సమాజంలో పురుముల నిరంకుశత్వానికి బలియైపోతున్న ఎందరో




అబలలకు కొత్తదారిని చూపిస్తోంది ఈ 'వేగుచుక్క'. స్వతంత్రంగా, ఆత్మగౌరవంతో బతకమని వెన్నుతట్టి, పరిస్థితులను ఎదిరించినిలిచే ధైర్యాన్ని, స్ఫూర్తిని ఇచ్చే కేశవమూర్తి పాత్రను ఎంతో హృద్యంగా చిత్రించారు. నవల మొత్తం సీత పాత్ర చుట్టూతిరుగుతున్నా సీత పాత్రని శ్రీహరి ప్రేమనుకూడా గుర్తించలేనంత అమాయకురాలిగా, 'బావను తను ప్రేమిస్తున్నాను' అనుకునేంత బేలగా చిత్రించడం బాగాలేదు. ఆ పాత్రను మరింతగా అవగాహన ఉన్నట్టుగా సృష్టించి ఉంటే బాగుండేది. చివరికి కోటేశ్వరరావు లాంటి శాడిస్టుకి శిక్షలేకపోవడం పాఠకులకు అసంతృప్తిని కలిగిస్తుంది. అతన్ని అలా వదిలేస్తే మరో అమాయకురాల్ని తన నిరంకుశత్వానికి బలిచేయడని నమ్మకమేమిటి? చివర్లో సీత, శ్రీహరి పెళ్ళిచేసుకోవడం పాఠకులు కోరుకునే ముగింపు. ఊపిరిబిగించి చదువుతున్న పాఠకులకు సీత, శ్రీహరిల భావకవితాఝరి ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. ఏదియేమైనా ఈ నవలద్వారా పాఠకులకు ఓ మంచి సందేశాన్ని ఇచ్చిన కాకాని చక్రపాణి, వి.నాగరత్నకు మారి అభినందనీయులు.

—ఎ.రాధాశ్రీనివాస్, కోదాడ

## సహజంగా ఉంది

**(తృతీయ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)**

**జీ**వితం గురించి ఏ అవగాహనలేనివారు, తమ జీవితాన్ని సరిదిద్దుకోలేకపోయారంటే అర్థముంది కానీ, జీవితంపట్ల నిర్దిష్టమైన అభిప్రాయాలున్నవారు, జీవితంపట్ల పరిపూర్ణ అవగాహనఉన్నవారూ కూడా తమ జీవితాన్ని చక్కదిద్దుకోలేకపోవడం అర్థరహితం. 'వేగుచుక్క' ప్రథమార్థం (సీత వివాహానికిముందు) ఎంత గొప్పగాఉందో, ద్వితీయార్థం (వివాహం తర్వాత) అంత చప్పగాఉంది. ఉపాధ్యాయుడైన బావదగ్గర జీవితపు పాఠాలు నేర్చుకున్న సీత, తన ఆత్మగౌరవానికి భంగంకలిగించిన భర్తతో మూడేళ్ళపాటు కాపురంచెయ్యడం, స్త్రీ ఓర్పుకీ, సహనగుణానికీ ప్రతీకకావచ్చునేమో, కానీ కథాపరంగా అది చాలా అసమంజసం. ఎందుకంటే నవల చదువుతున్నంతసేపూ సీతపాత్రలో స్త్రీ స్వాతంత్ర్యాన్ని కోరుకునే ఆదర్శ మహిళ ప్రతిరూపం మెదులుతుంది పాఠకుడి మదిలో. ఆ ఊహకీ, భర్త నిరంకుశత్వంతో రాజీపడే సీతపాత్రకీ ఎక్కడా పోలీకలేదు. మూడేళ్ళపాటు భర్త దౌష్ట్యాన్ని ఓర్పుగా భరించిన సీత, అతణ్ని మార్చే ప్రయత్నంలోమాత్రం ఓర్పువహించక ఒకేఒక ప్రయత్నంతో (సినిమాకి వెళ్ళినపుడు) విరమించుకున్నట్టు చిత్రించడం బాగాలేదు. ముగింపుమాత్రం పాఠకుడి ఊహకీ, అభిలాషకీ దగ్గరగాఉంది. మొత్తానికి సీత తన భర్తను ఎదిరించి విడాకులు కోరుకుని, శ్రీహరితో వివాహానికి అంగీకరించడంతో సీతపాత్రకు న్యాయంజరిగిందనే సంతృప్తికలిగింది పాఠకుడిలో.

పాత్రలపరంగా చెప్పవల్సివస్తే కేశవమూర్తి మానవతావిలువలు ప్రతిబింబించే ఒక సజీవమైన మహోన్నత మానవతామూర్తి. పాఠకుడి హృదయాన్ని తాకేలా మలిచారు అతడి పాత్రని.

కథలో కవితాధోరణి, అక్కడక్కడ కొటేషన్లు సరిగ్గా అమరాయి. స్థూలంగా చెప్పాలంటే ఎక్కువప్రశంసను, కొద్దిపాటి విమర్శనూ పొందుతుంది 'వేగుచుక్క'.

—సోమయాజుల సోదరులు, హైదరాబాద్

## చక్కటి ముగింపు

**(రూ 25/- బహుమతి పొందిన సమీక్ష)**

**'వే**గుచుక్క' నవల ఎంతో ప్రయోజనాత్మకంగా వుంది. ప్రస్తుత సమాజంలో జీవితంలో స్త్రీ ఎదుర్కొనే ఎన్నో సమస్యలకు దర్పణం 'వేగుచుక్క' ఈ నవలలో మౌనంగా, గంభీరంగా ఉండే కేశవరావు పాత్ర ఔన్నత్యాన్ని మరిచిపోలేనంత ఉదాత్తంగా చిత్రీకరించారు. ఆ పాత్రని సంస్కారపు సింహాసనాన్ని ఎక్కించా



రు. మానవత్వానికి, మనోసౌందర్యానికి మచ్చు తునకగా మలిచారు. మధ్యతరగతి కుటుంబాల్లో కోరికలు తీరక ఒకవిధమైన అసంతృప్తివల్ల వచ్చిన గయ్యాళితనంతో బతికే సగటు ఇల్లాలు రాధ. రాధ గయ్యాళితనంవల్లనే కేశవమూర్తి సౌజన్యం సౌరభాలను వెదజల్లిందేమో అనిపిస్తుంది. నిజంగా రాధ పాత్ర మంచిదైనట్లైతే కేశవమూర్తిలోని సౌజన్యమూర్తిని పాఠకులు చూసే అవకాశం ఉండేదికాదేమో!

చిన్నతనంలోనే తల్లితండ్రులను పోగొట్టుకుని అక్కపంచనచేరిన అనాధ సీత. పెనంమీదనుండి ఎగిరి నిప్పుల్లోపడ్డట్లుగా రాధ బారి నుండి తప్పించుకొని భర్త అనే క్రూరమృగంపాలిట పడుతుంది. మనసమాజంలో సీత సంసారాల్లాంటి సంసారాలు కోకొల్లలు. ఇక సీత భర్తచేత వంచింపబడి ఒంటరిజీవితం గడుపుతున్న సమయంలో ఆమెను, ఆమెబిడ్డని కూడా ఆదరించి అక్కున్నచేర్చుకున్న ఆదర్శవంతుడు శ్రీహరి. ఇటువంటి విశాలభావాలుగల వ్యక్తులు అరుదుగా ఉంటారు.

సీతలాంటి విధివంచితులు, ఎదురైనప్పుడు, 'పాపం ఆమె ఖర్మ అలాంటిభర్త దొరకటం. మనం మాత్రం ఏంసాయంచెయ్యగలములే అన్న ఉదాసీనభావం కనబరచకుండా స్నేహితులుగా, సాటివ్యక్తులుగా సహాయంచేసిన వసంత, మోహనరావులున్నప్పుడే సమాజం బాగుపడుతుంది. ప్రస్తుత సమాజంలో కోటేశ్వరరావులాంటి చీడపురుగులు ఎంతోమంది వున్నారు. వారి విశృంఖలత్వంవల్ల, దానవకృత్యాలవల్ల అమాయకులైన ఆడపిల్లలు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. వారికడుపున పుట్టిన నేరానికి పిల్లలు అనాధలౌతున్నారు. వీళ్ళనేరాలకు శిక్షలులేవు. వీరు చట్టానికి దొరకని నేరస్తులు.

భార్య విడాకులు తీసుకున్నంతమాత్రాన వాళ్లు బుద్ధిమంతులుగా మారిపోరు. మళ్ళీ నెలతిరగకుండానే కోటేశ్వరరావులాంటివాళ్ళకు మరో ఆడపిల్లతండ్రి కాళ్ళుకడిగి కన్యాదానం చేస్తాడు. మళ్ళీ చరిత్ర చర్విత చర్వణమే అవుతుంది.





అందుకే కోర్టులు, చట్టాలు చేయలేని న్యాయం మహిళలకు సమాజమే చెయ్యగలగితే, ఈ స్ఫూర్తితోనే విప్లవాత్మకమైన పరిష్కారాన్ని రచయితలు చూపించగలిగితే, అటువంటి రచనలు సాంఘిక ప్రయోజనాన్ని కలిగిస్తాయి అని చెప్పవచ్చు.

—గన్నమనేని విజయలక్ష్మి, గుంటూరు

## చట్టానికి దొరకని నేరస్థులు

*(రూ 25/- బహుమతి పొందిన సమీక్ష)*

"పితారక్షతి కౌమారే...." అన్న శ్లోకానికి తగినట్లుగా జీవితమంతా ఒక పురుషుని పంచనపడి ఉన్న స్త్రీలు రాధ, రంగనాయకమ్మ. తమకున్న ఒకేఒక ఆధారంకోసం మరొకరితో పోటీపడవలసి రావటం వీరికి దుర్భరమే. ఈ అత్తాకోడళ్ళ తగవులూ, రాధకు చెల్లెలిమీద కలిగిన అసూయ కూడా ఈ దైన్యస్థితికి ఫలితాలే. సంఘంలో స్త్రీకి కేవలం ఒకరి భార్యగా కాకుండా తనకంటూ ఒక విలువ ఏర్పడేవరకూ ఈ స్థితి మారదు. కాగా రాధమీద పాఠకులకి సానుభూతి కలగకుండా ద్వేషబీజాలునాటి రచయితలు పొరపాటుచేశారు.

సీతపాత్ర చాలా సహజంగా ఉంది. బుద్ధితెలియని వయస్సునుంచీ తనకు తెలియకుండానే పోటీకి గురై నలిగిపోయింది. కాస్త ఓదార్పు కలిగించేవాడు బావ ఒక్కడేకావటంచేత అతని ఆలోచనావిధానంలో తననితాను మలచుకొంది. పందిరి ఉన్నవైపు తీగ పాకటం సహజం. పసితనంనుంచీ బావే ప్రపంచంగా ఆలోచించటంవల్ల, కౌమారదశలో స్త్రీ పురుషభేదం తెలిసేనాటికి బావే పురుషుడిగా కనబడటం సహజం. ఇది నమ్మదగిన సత్యమే. తన పెంపకంలో జరిగిన ఈ పొరపాటును కేశవమూర్తి సరిదిద్దుతాడు.

సీతమెచ్చే భావగీతాలూ, నవల ముగింపు పేజీల్లో కనిపించిన భావుకత అడివి బాపిరాజుగారిని గుర్తుతెస్తాయి. ఇది అనుకరణే అయినా మహనీయుల మార్గం కాబట్టి తప్పటడుగులు వేసినా దోషంలేదు.

కోటేశ్వరరావు 'దరిద్రునికి ఆకలెక్కువ, అసమర్థుడికి కోపమెక్కువ' అనే సామెతలు గుర్తుకు తెస్తాడు. తనకులేని విలువ ఉందని నమ్మి, సంఘం గుర్తించలేదనే ఉక్రోషంతో, తనపై ఆధారపడి తనకు లోకువైనవారిమీద దౌర్జన్యంచేసే ప్రబుద్ధులు ఈ సమాజంలో వెతకకుండానే దొరుకుతారు. కోటేశ్వరరావు పరస్త్రీ వాంఛ కూడా ఇలాంటిదే. ఎందరో స్త్రీలచేత తాను కోరబడుతున్నాననే అబద్ధాన్ని నమ్మి, అంతరాత్మచేత నమ్మించబోయి ఆత్మవంచనే మిగుల్చుకునే నీచులు ఇలాంటివాళ్ళు.

శ్రీహరిపాత్ర సామాన్యమైనది. పరిపక్వత లేని వయస్సులో కలిగే ప్రేమలాంటిభావం ఒక్కొక్కప్పుడు జీవితాంతం అదో పిచ్చిలా నిలిచిపోతుంది. వ్యక్తికన్న ఆ వ్యక్తితో ఏర్పడిన ప్రథమ పరిచయానుభవాలను ప్రేమిస్తారు ఇలాంటివారు.

స్త్రీ తన మనుగడకోసం పురుషుడిమీద ఆధారపడే దుర్గతిమారాలన్న సందేశాన్ని "భార్యా భర్తా అనకుండా మొగుడూ పెళ్ళాం" అనాలనే డైలాగ్స్‌తో చాలా సున్నితంగా అందించిన రచయితలకు ధన్యవాదాలు.

-- పి. అనంతలక్ష్మి, హైదరాబాద్

## మంచి నవల

*(రూ 25/- బహుమతి పొందిన సమీక్ష)*

ఈరోజుల్లో వివాహం ఓ లాటరీ అయిపోయింది. చక్కని భర్త దొరికితే సంసారనావ ఏ ఒడిదొడుకులు లేకుండా సాగిపోతుంది. అలా కాకుండా ఈ నవలలోని కోటేశ్వరరావులాటి భర్త దొరికితే జీవితంమీదే విరక్తిపుడుతుంది. ఆ ముగింపునవలలో గనక అలాచేశారుగానీ, నిజజీవితంలో అలా జరగడం అరుదు. అలా అని ముగింపు ఇంకోలావుంటే బాగుంటుందనికాదు. నిజజీవితంలో అయితే శ్రీహరి సీతని పెళ్ళిచేసుకోవడం సంగతి అలా వదిలేసి సీత భర్తనుండి విడాకులు తీసుకొని బయట పడటంకూడా చాలా కష్టం మధ్యతరగతి కుటుంబాలలో. సీతకి తల్లితండ్రులుగానీ, పెళ్ళి కావల్సిన చెల్లెళ్ళుగానీ లేరు. అలా వున్నట్లయితే నీవు విడాకులు తీసుకుంటే నీ చెల్లెళ్ళకు పెళ్ళికాదనీ, సంఘంలో మేం తలెత్తుకోలేమనీ, సంసారమన్న తరవాత అన్నీ సుఖాలే వుండవనీ, కొన్నాళ్ళు సద్దుకుంటే నీ జీవితమే నందనవనం అవుతుందనీ నచ్చచెప్పడానికి ప్రయత్నించేవారు. అంతేగానీ రాక్షసుడిలాటివాడే అయినాసరే ఆ భర్తతో విడిపోయి తన జీవితం తను బతుకుతానంటే ఒప్పుకోరు. వసంతలాంటిస్నేహితురాళ్ళ అండదండలు, కేశవమూర్తిలాంటి అమృతమూర్తులు వెనక వుండి ప్రోత్సహించితే సీతలా కష్టపడేవారికి విముక్తి కలుగుతుందేమో. కేశవమూర్తిపాత్ర చాలా చక్కగా చిత్రించారు. రాధ తనకు పుట్టిన పాప చనిపోవడంవల్ల, ఇక తనకు పిల్లలు పుట్టరని తెలిసి, ఒకరకమైన మానసిక బాధవల్ల సీతని సవతితల్లిలాగా చేసిన ప్రతిపనికి ఆరడిపెట్టినా, రాధవైపునుండి ఆలోచించి, ఆమె ఎందుకలా ప్రవర్తిస్తోందో అర్థంచేసుకొని ఎంతో సంయమనంతో ప్రవర్తించాడు కేశవమూర్తి. సీత రాసిన కవితలు బాగున్నాయి. కేశవమూర్తి సీతబాధపడినపుడల్లా ఆమెకు ధైర్యం, స్ఫూర్తి ఇచ్చేందుకు చెప్పిన పాఠాలు ఒక్క సీతకేగాక ప్రతిఆడపిల్లకూ ఉపయోగపడేలా ఉన్నాయి. అధికారం వుందిగదా అని మొగ్గని పువ్వుగా మార్చలేము. అలాగే స్త్రీ ప్రేమను అధికారంతో పొందలేరు. ప్రేమకి, ఆప్యాయతకి, లాలనకి, తనసర్వం అర్పిస్తుంది స్త్రీ. అహంకారంతో 'ఆడదాన్ని చెప్పుకింద తేలులా వుంచాలి, ఆమెకి ఏపాటి స్వాతంత్ర్యమూ వుండకూడదు తనతో తప్ప ఏమగవానితోను మాట్లాడకూడదు,కానీ తను మాత్రం కనిపించిన ప్రతి స్త్రీనీ కామెంట్ చేయచ్చు' అని అనుకొనే మనస్తత్వంగల మగవాడితో జీవితం వద్దుగాకవద్దు అనిపిస్తుంది. అలాటివారెవరైనా ఈనవల చదివి మారితే సంతోషమే. ఇంత మంచి నవల ప్రచురించినందుకు 'చతుర'కు అభినందనలు.

--యస్. సుబ్బలక్ష్మి, రేపల్లె

కవరు పేజీ ఫోటోగ్రాఫర్: ఇ. జనార్థన్




ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర' లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరటావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో మొదటి మూడింటికి రు.100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనా శక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, కథలు, ఫీచర్ల వంటి ఇతర అంశాల పట్లకూడా పాఠకులు తమ అభిప్రాయాలను విడిగా రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలిచాం.

## కూపన్

అక్టోబర్ చతుర నవల: కన్నీటి కెరటాల వెన్నెల

సమీక్షకుని పేరు: ........................................

చిరునామా: ........................................

........................................

........................................

........................................

# కొంచెం వెల ఎక్కువైనా ఆల్విన్ కొనడం ఎందుకు సమంజసం

**ఆల్విన్ తన శ్రేణిలో సాటిలేనిది**
సంవత్సరాల తరబడి చీకు, చింత, చిక్కు లేని ఆల్విన్ పనితనం, మీ పెట్టుబడికి అత్యుత్తమంగా సరి తూగుతుంది.

ఆల్విన్ అందించే అపారమైన విలువకి, అందరూ ఆనందంగా, ఇష్టంగా కొంచెం వెల ఎక్కువైనా ఆల్విన్ ఎందుకు కొంటున్నారో, ఆల్విన్ పనితనాన్ని అనుభవిస్తే మీకే తెలుస్తుంది.

**హిటాచి రూపకల్పన చేసిన కంప్రెసర్**
చప్పుడు చేయని, సాఫీగా, చీకు, చింతలేని పనితనం.

**వోల్టేజి స్టెబిలైజర్ అవసరం లేదు**
ఎందుకంటే, 170 నుంచి 250 'వోల్ట్స్' దాకా 'వోల్టేజి' హెచ్చు తగ్గుల్ని సునాయాసంగా భరిస్తుంది.

**రోల్ బాండ్ ఫ్రీజర్**
త్వరగా 'అయిస్' అవుతుంది. పళ్ళు, కూరగాయలు ఎల్లప్పుడూ తాజాగా ఉంటాయి.

**సెల్ఫ్ డ్రైయింగ్ పద్ధతి**
బాదరబంది లేకుండా మీట నొక్కగానే దానంతట అదే జమకూడిన 'అయిస్' కరిగించేస్తుంది.

**ఎక్కువ చోటు**
ఆల్విన్ అన్ని రిఫ్రిజిరేటర్ల కంటే ఎక్కువ 'చిల్ ట్రే' మరియు 'క్రిస్పెటర్' స్థలం ఉంది.

**తక్కువ చోటు**
మిగతా వాటి కంటే ఆల్విన్ రిఫ్రిజిరేటర్ పెట్టుకొనుటకు తక్కువ స్థలం ఆక్రమిస్తుంది.

**ఎన్నో రకాలు**
ఆల్విన్ 165 ఇంకా 300 లీటర్ల సింగిల్ డోర్, డబుల్ డోర్ మోడల్స్‌లో ఎన్నో రంగుల్లో లభిస్తాయి.

**7 సంవత్సరాల గ్యారంటీ**
సంవత్సరాల తరబడి చీకు చింతలేని సేవ

**దేశవ్యాప్తమైన సేవాసౌకర్యం**
ఒక్క ఫోన్ పిలుపుకే మీ సేవకై సిద్ధం.

**ఆల్విన్ మీకోసం వినూత్నమైన 'రక్షణ ఒప్పందాన్ని' అందిస్తుంది.***



IS 1476 ISI అన్ని సింగిల్ డోర్ ఆల్విన్ రిఫ్రిజిరేటర్లు ఐ ఎస్ ఐ చిహ్నం కలిగి వుంటాయి

**ALLWYN**




**అన్ని వేళలందు ఆల్విన్**

* మిగతా వివరాలకోసం మీ దగ్గర్లోని ఆల్విన్ ఏరియా ఆఫీసును సంప్రదించండి.

హైదరాబాద్ ఆల్విన్ ఏరియా ఆఫీసులు: అహ్మదాబాదు, ఫోను: 463181, బెంగుళూరు, ఫోను: 238885, భోపాల్, ఫోను: 64122, భువనేశ్వర్, ఫోను: 52271, బొంబాయి, ఫోను: 4927575, 4927586, 4934178, 4921051, కలకత్తా, ఫోను: 440437, 446853, 433576, చండీఘడ్, ఫోను: 41941, కడప, ఫోను: 2230, ఎర్నాకులం, ఫోను: 368002, గౌహతి, ఫోను: 32691, ఘజియాబాదు, ఫోను: 843204, హైదరాబాదు, ఫోను: 43407, జబల్‌పూర్, ఫోను: 22665, జైపూర్, ఫోను: 65729, కాన్పూర్, ఫోను: 245249, కర్నూల్, ఫోను: 2480, మద్రాసు, ఫోను: 861401, నాగపూర్, ఫోను: 45125. న్యూఢిల్లీ, ఫోను: 734740, 730715, పాట్నా, ఫోను: 32745, పూన, ఫోను: 39029, విజయవాడ, ఫోను: 62544, విశాఖపట్నం, ఫోను: 61652.

MAA COMMUNICATIONS/HAL/C/TEL/88

# చతుర ప్రపంచం

## ఆ చెప్పుల వెల 26 లక్షలు మాత్రమే!

ఫలానా ప్రముఖుడు వాడిన వస్తువు అని చెప్పేసరికి అదెంత ఆఫ్టరాల్‌వస్తువైనా అధిక మొత్తం వెచ్చించి కొనే వ్యామోహం చాలా మందిలో వుండటం నేటిఫ్యాషన్.

ఏనుగు చచ్చినా బతికినా వేయివరహాలే అన్నట్లు ఆ ప్రముఖులు జీవించివున్న రోజుల్లోనూ కోట్ల రూపాయలు ఆర్జిస్తారు. నూకలుచెల్లి పోయాక కూడా వారి దుస్తులూ, వస్తువులూ లక్షలు సంపాదించిపెడతాయి.



జూడీగార్లాండ్ అనే కీర్తిశేషురాలైన ప్రఖ్యాత తార ''విజర్డ్ ఆఫ్ ఓజ్'' చిత్రంలో ధరించిన రూబీ చెప్పులజత ఓ వేలంలో దాదాపు 26 లక్షల 40 వేల రూపాయలకు క్రిస్టీస్ ఈస్ట్ సెట్ వద్ద అమ్ముడై ఇదివరకటి రికార్డును అధిగమించింది. ఓ సినీతార చెప్పులకి ఇంత అత్యధికమైన వెల పలకటం ప్రపంచ చరిత్రలోనే ప్రథమం.

1940లో ఓ పోటీలో 'చార్లీచాప్లిన్ టోపీ, కర్రలను' రోబెర్టా బోమన్, టెన్నెస్సీలు గెల్చుకున్నారు. వీటిని గత డిసెంబర్లో వేలం వేయగా టోపీ, కర్రలు 24 లక్షల 28 వేల రూపాయలకు చేతులు మారాయి. గార్లాండ్ చెప్పులు ఆ రేటును అధిగమించటంతో ఆ రికార్డు బద్దలైందనే చెప్పవచ్చు. గార్లాండ్ కోసం ప్రత్యేకంగా తయారుచేయించిన ఏడు జతల చెప్పులలో 26 లక్షలు పలికిన జత ఒకటి. ఇవేగాక 1970లో ఈమెగారి రూబీ చెప్పులు దాదాపు 2 లక్షల 40 వేలకి వేలంవెర్రిలో వేలమైపోగా 1981లో మరోవేలంలో మరోచెప్పులజత 2 లక్షల 11 వేలు ఆర్జించాయి. కాగా మూడవ జత 26 లక్షలు సంపాదించాయి. ఇంకా ఆమె వాడిన మరో 5 జతల చెప్పులు వేలంలో అమ్ముడుపోయేందుకు సిద్ధపడుతున్నాయి.

ఇంతకీ రూబీ చెప్పులలో కెంపులో, మాణిక్యాలో పొదిగారనుకుంటే పొరపాటే! ఆ రూబీ చెప్పులలో నకిలీ వజ్రాలు, బంగారునాణాలూ, పూసలు ఇమిడ్చారు. అయితే, ఆ ప్రముఖుల టాలెంట్‌నీ, ఆదర్శాల్నీ అవగాహన చేసుకుని ఆచరిస్తే బాగుంటుందిగానీ వారు వాడిన





వస్తువులకి లక్షలు వెచ్చించుకొని దాచుకుంటే గర్వంగా చెప్పుకోడానికి తప్పిస్తే ఎందుకువ యోగపడతాయి?

## షీలతో ఊర్మిళ పెళ్లి!

కనకదుర్గ అనే కన్యామణి వెంకటలక్ష్మణవ రాహ కోటివేముల సుందరం అనే వరరత్నాన్ని పెళ్ళాడితే ఆమె శ్రీమతి కనకదుర్గా సుందరం అవుతుంది. కాని ఆ కనకదుర్గే త్రివేణిలక్ష్మీకళ్యాణీఅఖిలాండేశ్వరి అనే ఓ అమ్మడితో తాళికట్టించుకుంటే ఆమె శ్రీమతి కనకదుర్గా అఖిలాండేశ్వరి అవుతుందా లేక... ఎలా పిలిస్తే బావుంటుందోగదా?? సరిగ్గా ఇలాంటి సందేహమే కలిగింది మధ్యప్రదేశ్ లోని ఓ దేవాలయంలో షీలా, ఊర్మిళా అనే ఇద్దరు ఆడకానిస్టేబుళ్లు కళ్యాణమాడగానే వారి స్నేహితులకి. షీల, ఊర్మిళల తల్లిదండ్రులు కూడా ఈ వివాహానికి హాజరయ్యారు.

28 ఏళ్ల వయస్సున్న షీలా, ఊర్మిళలకు అందర్లానే గతంలో వివాహాలయ్యాయి. షీలా భర్తకూడా ఓ పోలీసే. అతను రెండేళ్ళక్రితం షీలానీ, ఆమె ముగ్గురుపిల్లల్నీ విడిచి స్వర్గస్తుడైనాడు.

ఊర్మిళ చరిత్ర మరోలా ఉంది. ఆమె మూడేళ్ళపసిపాపగా వున్నప్పుడే తల్లిదండ్రులో కుర్రాడికిచ్చి పెళ్ళిచేశారు. ఊర్మిళకి ఊహతెలిశాక, అతన్ని భర్తగా స్వీకరించటానికి నిరాకరించింది. దాంతో ఆమె బంధువులు, ఇరుగు పొరుగువారూ ఆమెతో మాట్లాడటం మానేశారు. అందుకే ఊర్మిళ పోలీసు ఉద్యోగమైనా సరేనని ఉద్యోగంలో చేరింది.

భోపాల్‌లో 1986 నవంబర్ మాసంలో మధ్యప్రదేశ్ ఆర్మ్‌డ్‌పోలీస్‌లో ఇద్దరికీ ఉద్యోగాలొచ్చాయి. ఇద్దరూ ఒకేచోట నియమితులయ్యారు. మొదట్లో వారిద్దరూ మంచి స్నేహితురాళ్లు. ఆ స్నేహమే వారిమధ్య ప్రేమకు దారితీసింది. ఈ ఇద్దరూ ఆర్థికసమస్యలవల్లా, గృహసంబంధమైన అశాంతులవల్లనే ఉద్యోగంలో చేరారు. కానీ పోలీసు వుద్యోగం కావటంవలన ఇక్కడ మరో రకమైన సమస్యలు వారిని వేధించాయి. విసుగెత్తిన ఆ ఇద్దరూ ఆలోచించుకుని ఓ నిర్ణయానికొచ్చారు. వారంరోజులపాటు సెలవుపెట్టి ఎక్కడికోవెళ్ళిపోయారు.



తిరిగివచ్చిన ఆ స్నేహితురాళ్ళు పెళ్ళిచేసుకున్నామని చెబితే ఆశ్చర్యపోనివారులేరు. వారినెలా పిలవాలి? శ్రీమతి ఊర్మిళాషీలా అని పిలవాలా లేక శ్రీమతి షీలాఊర్మిళఅనా? అని కొందరుహేళన చేయటంతో వెంటనే వారొక నిర్ణయం తీసుకున్నారు. ఊర్మిళతను భర్తగా వుండాలనుకుని ప్యాంటూ, షర్టులూ వేసుకోసాగింది. బాధ్యతగల గృహిణిగా షీలా చీరకట్టి ఇంటిపనులూ, వంటపనులూ చూసుకోవటంలో విలీనమైంది. పోలీసు అధికారులకి మాత్రం ఉద్యోగంలో ఊర్మిళను కొనసాగనివ్వాలా? వద్దా? అనేది ఒక సమస్యగా మారిందిట!

## టెర్రరిస్టులనణచే స్పైడర్

ఎందరి ప్రాణాలతోనో చెలగాటమాడుతూ మనశ్శాంతిని కబళించే టెర్రరిస్టులు మనదేశంలో నరమేధాన్ని నిర్భయంగా, నిర్దయగా కొనసాగిస్తున్నా మనం వారిని అణచలేకపోతున్నాం. కానీ ఇజ్రాయిల్ ప్రభుత్వ పరిరక్షణలో ఇజ్రాయిల్ ప్రజలకు టెర్రరిస్టుల వల్ల ఎలాంటి కష్టాలూ, నష్టాలూ లేవు. ఆ దేశంలో టెర్రరిస్టులకు నిలువనీడేలేదు.

తీవ్రవాద వ్యతిరేకపోలీసు సంఘం సభ్యులు అక్కడ రాబోట్ నొకదాన్ని తయారు చేసి దానికి 'స్పైడర్' అని పేరుపెట్టారు. దీనికి మనిషిని పోలిన భుజాలనే అమర్చారు. ఈ స్పైడర్‌కున్న బలమైన చేతులు ఎంతటి పరిస్థితినైనా ఎదుర్కొనేందుకు సిద్ధంగా వుంటాయి. ఏవస్తువునైనా పట్టుకోగలిగే ఈ చేతులు కార్లకిందనో, చెట్లకిందనో దాచిన పేలుడుపదార్థాల్ని సైతం సమర్థవంతంగా వెలికితీస్తాయి. ఈ చేతులు ఒకచెట్టు సైజు పొడుగుకి కూడా సాగేలా వుంటాయి. చెట్ల చివర్లలో ఉంచిన బాంబులను కూడా ఇట్టే పసిగట్టి పరిగ్రహిస్తాయి. స్పైడర్ చాలా చురుగ్గా వ్యవహరించి పనిచేస్తుంది. గాలి పీల్చినట్టే బాంబుల్ని గాలి ద్వారా పీల్చుకుంటుంది. దీనిని ఆపరేట్ చేయటానికి ఓ డ్రైవరు ఉంటాడు. లేదా రిమోట్‌కంట్రోల్ మెకానిజం ద్వారానైనా దీనిని పనిచేయించవచ్చును. ఎంతటి విపత్కర పరిస్థితి ఎదురైనా స్పైడర్ ఆపరేటర్‌కి మాత్రం ఎలాంటి హానీ జరుగదు. ఈ రోబోట్



రక్షణ ఏర్పాట్ల దృష్ట్యా ఎంతో ఉపయోగపడు తుంది. దీని పైభాగాన అత్యధికమైన ఉష్ణాన్ని సైతం పీల్చుకోగల తొడుగు వుంటుంది. అదు పుచేసే యంత్రాంగం అంతా దీనిలోనే అమ ర్చబడి వుంటుంది.

ఈ స్పైడర్ కళ్ళలో రెండు చిన్న టి.వి. కమేరాలని అమర్చారు. వీటిని అన్నిదిశలకూ తిప్పుకోవచ్చును. ఈ కమేరా కళ్ళ ద్వారా స్పైడర్ వస్తువుల రంగులను ఆకళింపు చేసు కుంటుంది. ఇన్‌ఫ్రారెడ్ లైట్ల సాయంతో రాత్రి పూట కూడా స్పైడర్ చూస్తూ పనిచేస్తుంది.

స్పైడర్లో దాన్ని నడిపే డ్రైవర్ కూర్చోవటాని కి కూడా సురక్షితమైన స్థలం నిర్దేశింపబడింది. స్పైడర్ బరువులను మోయటమేకాక ఓ సుశి క్షితుడైన సైనికునిలా రైఫిల్ పట్టుకుని అను కున్న లక్ష్యంవైపు పేలుస్తుంది కూడా. 7 మిల్లీ మీటర్ల మందంవరకు లోహాలకి రంధ్రాలు చేస్తుంది. స్పైడర్‌కి 10 కిలో గ్రాముల టి.ఎ న్.టి. శక్తిని తట్టుకోగల సామర్థ్యం వుంది. దీనిని మూడు కిలోమీటర్ల దూరం నుండి కూడా రిమోట్ కంట్రోలింగ్ పద్ధతిలో పనిచే యించవచ్చును.

స్పైడర్ లోపలి యంత్రాంగంలో ఏభాగ మైనా విరిగిపోయినా, పాడైనా అది యాంత్రి కంగా సహజంగా పని గంటల తంబడి చే స్తూనే వుంటుంది. సాధారణ పరిస్థితులలో స్పైడర్ బ్యాటరీ పనిచేయకపోయినా ఆరు గంటలపాటు యథావిధిగా పనిచేస్తుంది. బ్యా టరీ ద్వారానేగాక బాహ్యశక్తితో సైతం స్పైడర్ పనిచేస్తుంది.

ఇజ్రాయిల్‌లో కనుగొన్న ఈ స్పైడర్‌ను బెల్జియం, ఫ్రాన్స్, జర్మన్, ఇంగ్లాండ్, అమెరికా వంటి దేశాలు కూడా నిర్మించుకుంటున్నాయి. ప్రస్తుతం స్పైడర్లను 70;200;500 కిలో మోడళ్ళలో తయారుచేస్తున్నారు. ఒక 70 కిలో మోడల్ స్పైడర్ తయారు చేయటానికి 23 కోట్ల రూపాయలు అవసరమవుతాయి. 200 కిలో మోడల్‌కి 60 కోట్ల రూపాయలూ, 500 కిలోమోడల్‌కి 150 కోట్ల రూపాయలూ ఖర్చవుతాయి. ఖర్చు ఇంత అత్యధికంగా వున్నా టెర్రరిస్టుల వాతపడకుండా వుంటానికి దీనిని తయారుచేస్తూనే ఉన్నారు. ★

# చమత్కార కతలు



## ఆత్మహత్య

చిత్ర గట్టి నిర్ణయం చేసికున్నదానిలా తల పంకించి మంచం పైనుంచి లేచి నిల్చుంది.

''ఆత్మహత్య''

అదే ఆమె గట్టినిర్ణయం. కారణం చిత్ర పెళ్లి తన బావతోనే నిశ్చయం కావడం. అందుకు ఆమె ఎంత ఎదిరించినా ఇంట్లో ఎవరూ లెక్కచెయ్యలేదు.

చివరికి 'ఈపెళ్లి నాకుకాదు, నా శవానికే' అని చిత్ర పంతంగా అంటే, అంతా ఒకరి మొగాలు ఒకరు చూసుకొన్నారు. తర్వాత కిసుక్కున నవ్వుకున్నారు.

చిత్ర కోపంగా తన గదిలోకెళ్లి మంచంమీద పడి పొర్లిపొర్లి ఏడ్చింది.

చిత్ర ఎస్.ఎస్.సి.కి పరీక్షఇస్తూనే మరో చెంపన ఎదురింటి మిద్దెమీది గదిలో బాడుగకున్న బ్రహ్మచారి రాజుకు మనసు ఇచ్చివేసింది. ఆ సంగతి చెప్పేసింది. చిత్రపెద్దలు ఏం చేశారోగానీ రాజు ఆగది ఈమధ్యే ఖాళీ చేసి వెళ్లిపోయాడు. మళ్లీ కనిపించలేదు.

''ఇంత పిరికివెధవకా తన పవిత్రమైన మనసిచ్చిందీ!'' అని రవంత పశ్చాత్తాపప

డినా సినీనాయికలాగా మనసిచ్చాక కుళ్లి కుళ్లి, భళ్లు భళ్లున ఏడ్వాల్సిందేగనుక, తనకు వచ్చిన ఓ సినీవిషాదగీతం పాడుకొంది చిత్ర.

రాజు ఎలాంటి దరిద్రుడయినా తను మన సిచ్చింది. మనసిచ్చాక తిరిగిరాదని సినిమా సిద్ధాంతం. కనుక తానిప్పుడు ఆత్మహత్య గురించి ఆలోచించాల్సిందే.

"ఏ విధంగా చావాలి?" అనుకోగానే చిత్రకి దాహంవేసింది.

మంచినీళ్లు తాగాలనుకొందిగానీ...

'ఆత్మహత్య చేసుకోదలిచిన తనకి మంచినీళ్ల తాపత్రయం దేనికి?, అనుకొని నవ్వుకుంది.

చిత్ర నీళ్లు తాగి గదిలోనే పచార్లు చేస్తూ, ఏ పద్ధతిలో పైకి ఎగిరిపోతే బాగుంటుందని ఆలోచిస్తూంది.

ఉరి వేసుకుంటే...?

ఈ ఇరుకు కొంపలో అది అసాధ్యం.

పోనీ, బావిలోపడితే...?

ఇక్కడ నూతులూ గోతులు లేవు. ఎటు చూసినా బోరింగులూ, కొళాయిలే.

నిట్టూర్చిన చిత్రకి తటాలున ఆంజనేయ స్వామి గుడిలో ఓబావి వున్న సంగతి గుర్తుకొచ్చింది.

చిత్ర మొహం కడుక్కొని ముస్తాబయింది. ఆ సందర్భంగా తన పెట్టిలోని చీరలని చూసి రేపు తను పోతే ఇవన్నీ చెల్లి కట్టుకుంటుందన్న ఆలోచన రాగానే అసూయ, బాధ కలిగాయి. ఆవెంటనే తన ఆలోచనకు తనే నవ్వుకొని ఇంటినుంచి బయటపడింది.

బావిలో దూకితే నీరంతా కడుపులోకి పోతుంది. దూకినప్పుడు బావి గోడలు తగిలి మరణం సిన్మాటిక్‌గా కాక ఘోరమాటిక్‌గా సంభవించవచ్చు.

ఆలోచిస్తూ వెళ్తున్న చిత్రకి దారిలో మెడికల్ షాప్ కన్పించింది. పర్సు నుండి పది నోటు తీసి 'స్లీపింగ్ పిల్స్ కావాలి" అనడిగింది.

షాపువాడు ఎగాదిగా చూస్తూ ప్రిస్క్రిప్షనును చూపమన్నాడు. చిత్ర కంగారుపడి చకచకా బయటకొచ్చి రోడ్డుమీద జనంలోకి కలిసిపోయింది.

బావిలో పడిపోదాం అనుకొని నిద్రమాత్రల గురించి ఆలోచించడమేమిటి?- అని తనను తానే తిట్టుకున్నది చిత్ర. ఈ సినిమాలవాళ్లకు నిద్రమాత్రలు సీసాలకొద్దీ ఎలా దొరుకుతాయోనని సందేహం వచ్చింది.

సందెచీకటి పడుతూంది. ఆంజనేయ ఆలయం రానేవచ్చింది.

గంట మోగించి మారుతికి మనసారా దండంపెట్టుకొని గుడి వెనక బావి దగ్గరకు చేరింది చిత్ర.

బావిలోంచి నీరు తోడుతూంది, పూజారిగారి కూతురు. చిత్ర బావిలోకి తొంగిచూసింది. బిందె పాతాళంలోంచి వస్తూన్నట్టుంది.

బిందె అందుకోబోయిన పూజారి కూతురు కెవ్వుమంది. బిందెలో తేలుతూ వున్న కప్పను చూసి బావిలో కప్పలూ, పాములూ ఉంటాయనే ఆలోచన రాగానే చిత్ర గుడినుంచి బైటపడింది. రైలుకింద పడాలని నిశ్చయించుకొని అటు నడిచింది.

రైలింకా రాలేదు. సిగ్నల్ ఇచ్చారు.

జానపద సినిమాల్లో అయితే పెద్దకత్తి తీసుకొని కస్సున పొడుచుకొంటారు. తనా - సూది గుచ్చుకొంటేనే భరించలేదు. కొన్ని పిక్చర్స్‌లో పిస్టల్‌తో కణతదగ్గర ఢాం ఢాం అనిపించుకొంటారు. అది బాగుంటుందిగానీ తనకా అవకాశం లేదే అని చిత్ర బాధపడింది.

చిత్ర రైలుపట్టాల మధ్య నుంచుని సినిమా నాయికలా దేవునికి వినతిఇచ్చి రైలు కింద పడాలనుకొందిగాని, రైలు కూతకి దడవచ్చి దూరంగా పారిపోయింది.

"ఇక్కడున్నావేంటీ వెళ్దాంపద" అంటూ అటొచ్చిన బావ చెయ్యందుకున్నాడు.

"బావా ... నన్నెందుకు బతికించావని అడగనుగానీ, బావా ఆ సినిమా వాళ్లలా నేనెందుకు ఆత్మహత్య చేసుకోలేకపోయాను?" అంది చిత్ర సిగ్గుపడుతూ.

"నాకు తెలీదు ... నేను తెలుగు సినిమాలు చూడనుగా" సన్నగా నవ్వాడు బావ.

--బద్వేలి రమేష్



# ఆడ టికెట్టు

బస్సు దగ్గుతూ, రొప్పుతూ, రోజుతూ శృతికల పని గాయకుని గాత్రంలా గీపెడుతూ సిద్దిపల్లి నుంచీ సిరిపురం వెళుతోంది.

బస్సులో కోళ్లు, మేకపిల్లలు మనుషులతోపాటు మాట్లాడుతున్నాయి.

రోడ్డుమీద వున్న గతుకులలో పడ్డప్పుడయ్యే చప్పుడుతోపాటు మనుషులు మూలుగుతున్నారు.

చంద్రపల్లిలో బస్ ఆగింది.

దిగేవాళ్లు దిగిపోతున్నారు.

ఎక్కేవాళ్లు తేనెపట్టుమీద తేనెటీగల్లా బస్ మీదకు ఎగబడ్డారు.

కొత్తగా పెళ్లిఅయిన కొండయ్య భార్య కొండమ్మతో బస్సులోకి ఎక్కాడు.

బస్సు నిక్కుతూ, నీలుగుతూ, బతుకు భారమైన కూలివాని జీవితంలా కదిలింది.

''టికెట్... టికెట్'' అన్నాడు కండక్టర్ అటు వచ్చి.

కొండయ్య పదిరూపాయలు నోటు తీసి ''గరిండీలు దిబ్బకు ఒక ఆడటిక్కెట్టు, ఒక మగటిక్కెట్టు ఇవ్వండి'' అన్నాడు.

బస్‌లో అందరూ గొల్లున నవ్వారు.

కొండయ్య అందరివైపు అయోమయంగా చూశాడు.

''నాకెంతండి?'' అడిగాడు.

''రూపాయిన్నర''

''మా ఆవిడకు''

''రూపాయిన్నరేనయ్యా'' విసుగ్గా అన్నాడా కండక్టరు.

ఈసారికూడా అందరూ గొల్లున నవ్వారు.

'ఆర్డర్ ... ఆర్డర్' అన్నట్టుగా హారన్ మ్రోగింది.

''ఇది అన్యాయమండి - సినిమాల్లో, బస్సుల్లో, రైళ్లలో అన్నిట్లో ఆడ మగకు టికెట్టు సమానమేనా... మరి మా ఆవిడ, నేను సమానంగా పనిచేత్తే నాకు రోజుకూలి పదిహేను, దానికి పదిరూపాయలు మాత్రం ఇత్తారే? ఇదెక్కడ న్యాయమండి?'' అన్నాడు.

అందరూ విస్తుపోయారు.

కొందరైతే కొండయ్యని హేళనచేసినందుకు నొచ్చుకున్నారు.

--పెందుర్తి మాస్టర్జీ





# చతుర

అక్టోబరు 1988

సంపుటి: 11 సంచిక: 9


"ఓ అమ్మ కోసమో లేక చనిపోయిన ఆ ర[illegible] కోసమో బతకటం ఏమిటి అర్థంలేకుండా! నీకోసం నువ్వు బతకక్కర్లేదా? నువ్వేమిటి? నువ్వెందుకీ ప్రపంచంలోకి వచ్చావు? నీ జన్మ ఇలా ఏడ్చి చచ్చిపోవటానికేనా? నువ్వు సాధించాల్సిందీ, పొందాల్సిందీ ఏమీలేదా?" కఠినంగా మాట్లాడుతూనైనా తన స్నేహితురాలికి ధైర్యం నూరిపోయటమే ధ్యేయంగా అందామె.

ఇక అంధకారమే తప్ప ఈ జీవితంలో కాంతిరేఖ కనిపించదనుకుంటూ కన్నీటి కెరటాలలో కొట్టుకుపోతున్న ఆ యువతి జీవితాన వెన్నెల వెలుగులెలా ప్రసరించాయి? ఏ అనుభవాలా వెలుగును, చూపాయి? ఓల్గా విరచితమైన 'కన్నీటి కెరటాల వెన్నెల' ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

# కన్నీటి కెరటాల వెన్నెల

—ఓల్గా



"రేణూ లేదా అత్తయ్యా?"

తలుపు తీసిన సుభద్రమ్మగారి ముఖం శిరీషను చూడగానే వికసించింది.

"రామ్మా... నిద్రపోతోంది - ఇదే రావటమా?" అంటూ శిరీషను కుర్చీలో కూచోబెట్టి మంచినీళ్లు తెచ్చి యిచ్చింది.

"ఇప్పుడు నిద్రేమిటీ - ఉదయం పదిగంటలకి" శిరీష ఆశ్చర్యపోయింది.

"పగలూ రాత్రీ అనేముంది శిరీషా - ఎప్పుడూ పడుకుని ఏడవటమేగా! బలవంతాన నాలుగు ముద్దలు తినిపించేసరికి నా తల ప్రాణం తోకకు వచ్చినంతపనవుతుంది" సుభద్రమ్మ కళ్లనీళ్లు తిరిగాయి.

"రేణూ ఇంకా కోలుకోలేదూ?" శిరీష గొంతులో బాధ, ఆశ్చర్యం కలగలిసి ధ్వనించాయి.

"లేదమ్మా... ఏడాదయింది - ఇంకెంత కాలం యేడుస్తావే అంటే బదులివ్వదు. గడిచినరోజులు తలుచుకుని ఏడవటం, తిండి తినకపోవటం- ఇదే వరస. ఇంకెన్నాళ్లు ఆఫీసుకి శెలవుపెడుతుందో తెలియదు. పిల్లలుంటే వాళ్లకోసమన్నా లేచి తిరిగేదేమో! అయిదు సంవత్సరాల్లోనూ దాని కడుపున ఓ నలుసు పడకపోయే" సుభద్రమ్మ దుఃఖంతో మాట్లాడలేకపోయారు.

శిరీష లేచి రేణూ పడుకున్న గదిలోకి వెళ్లింది.

రేణును చూస్తే దుఃఖం పట్టలేకపోయింది. పాలిపోయిన ముఖం, కళ్లు లోపలికి పీక్కుపోయి, పుల్లల్లా చేతులటూ ఇటూపడి జీవచ్ఛవంలావున్న రేణూనుచూసి ఎలాంటిది ఎలాగయిందీ అనుకుంది శిరీష. అందం, తెలివి, చురుకుదనం- అన్నీ తన సొత్తయినట్లు ఎప్పుడూ చైతన్యస్వరూపిణిలావుండే రేణూ ఇవాళ సర్వశక్తులూ కోల్పోయి మంచంలో పడివుంది.

రవి లేకపోతే రేణూ ఇలా అయిపోవాల్సిందేనా? రవి ప్రభావం రేణూమీద ఇంతగా వుందా? ఎలా - ఎప్పటికి కోలుకుంటుంది?

ఎప్పటికి మళ్లీ మామూలు మనిషై ఈ ప్రపంచంలోకి వస్తుంది?

రేణూ పక్కనే కూచుని చెయ్యిపట్టుకుంది శిరీష.

కనురెప్పలు బలవంతాన తెరిచిచూసింది రేణు. ఆశ్చర్యంతో కళ్లు తెరిచింది. బలహీనమైన చిరునవ్వు ఎండిన పెదవులమీదకు పాకింది.

"శిరీ... ఎప్పుడొచ్చావు?"

"ఇప్పుడే - ఏంటిది రేణూ... ఎన్నాళ్లిలా?"

శిరీష ఆగలేకపోయింది.

రేణు కళ్లు మూసుకుంది. కంటికొలకుల్లోంచి నీళ్లు జారుతున్నాయి. శబ్దం బయటకు రాకుండా పెదవులు బిగబట్టి విశ్వప్రయత్నం చేస్తోంది.

"రేణూ... ఏంటమ్మా ఇది-"

రేణూ తలను హృదయానికి హత్తుకుంది శిరీష. ఇద్దరూ తేరుకోటానికి పదినిముషాలుపైనే పట్టింది. రేణులేచి మొహం కడుక్కుని వచ్చింది.

"నీ ట్రైనింగు ఎప్పుడు పూర్తయింది?" రేణు సుభద్రమ్మ అందించిన గ్లాసు తీసుకుని అందులో పాలనుచూసి ముఖం చిట్లించింది.

"నాక్కూడా టీ ఇవ్వమ్మా"

"ఈ ఒక్కసారీ పాలుతాగమ్మా - అరగంటలో టీచేసి ఇస్తాను. తిండి మానేశావు - ఒక్కపూటన్నా - ఇవి తాగితే"

"సరేలే... విసిగించకు. తాగుతాను" తల్లి మీద చిరాకంతా పాలు గటగటా తాగేసి తీర్చుకుంది.

"ఏంటిది - అమ్మనిలా ఏడిపిస్తున్నావా?"

"ఔను... నేను అందర్నీ ఏడిపిస్తూనేవున్నా. అసలు నా బతుకే ఏడుపు బతుకయింది" రేణు ఏడవటం మొదలెట్టింది.

"రేణూ... నీకేమన్నా పిచ్చా! ఇప్పుడేం జరిగిందని ఆ ఏడుపు" శిరీష ఆశ్చర్యపోయింది.

"ఇదే వరస శిరీషా... మనం ఏమాటా మాట్లాడకూడదు. అన్నం తినమనకూడదు. పాలు తాగమనకూడదు. లేచి తిరగమనకూడదు. తనను మాట్లాడించకుండావుంటే సరి. లేకపోతే పోట్లాడుతుంది... ఏడుస్తుంది. ఏడాది

నుంచీ కత్తిమీదసాము చేస్తున్నాననుకో-''

సుభద్రమ్మ చెబుతుంటే రేణు లేచివెళ్లి మంచంమీద పడుకుని ఏడుస్తోంది.

శిరీషకేంచెయ్యాలో తోచలేదు.

రవీ - రేణూ ప్రేమించుకుని పెళ్లిచేసుకున్నారు. అయిదేళ్లు వాళ్ల దాంపత్యం ఆనందంగా సాగిపోయింది. రవి యాక్సిడెంట్‌లో మరణించాడు. రవి చచ్చిపోయిన తర్వాత నెలరోజులు శిరీష రేణుతోనే వుంది. రేణు దుఃఖాన్ని పంచుకుని చెయ్యగలిగిన సేవలన్నీచేసింది. అప్పుడే శిరీషకు మాంటిసోరీ ట్రైనింగులో సీటువచ్చింది. సంవత్సరం ట్రైనింగది - బెంగుళూరులో. అక్కడికివెళ్లిన తర్వాత శిరీష రాసిన ఉత్తరాలకు రేణు బాగానే సమాధానం రాసింది. తాను కోలుకుంటున్నాననీ, మళ్లీ మామూలు ప్రపంచంలో పడుతున్నాననీ, త్వరలో ఆఫీస్‌కెళ్లి డ్యూటీలో చేరతాననీ రాసింది.

అన్నీ అబద్ధాలు - తనని మోసంచేసింది. కోలుకోటానికి ఏమాత్రం ప్రయత్నించలేదు.

రేణునిచూస్తే శిరీషకీసారి కోపం వచ్చింది.

''రేణూ... ఇంక ఏడవకు - నాక్కోపం వస్తోంది-'' రేణు దగ్గరకెళ్లి కూచుంది.

''ఏడవక ఏంచెయ్యనే?''

''ఏంచెయ్యాలో చెబుతాను. ముందు నువ్వా ఏడుపు ఆపు'' గట్టిగా అంది శిరీష.

''రవి చనిపోయి ఏడాదయింది. ఇంకెంత కాలం ఏడుస్తావు - ఎన్నిరోజులిలా?''

''నేను మర్చిపోలేకపోతున్నా శిరీ! ప్రతి నిముషం రవే గుర్తుకొస్తాడు'' దుఃఖంతో మాట్లాడలేకపోయింది.

''ఒట్టిది... రవి నీకు గుర్తు రావటంలేదు. నువ్వు రవిని ఎప్పుడో మర్చిపొయ్యావు. బహుశా రవి చచ్చిపోయిన మరుక్షణమే రవిని మర్చిపోయి వుంటావు. నీకు ప్రతినిముషం గుర్తొచ్చేది నువ్వూ, నీ దుఃఖం''

రేణూని నొప్పించైనాసరే ఆ దుఃఖంనుంచి బైటపడెయ్యాలని నిశ్చయించుకుంది శిరీష.

శిరీష మాటలకు రేణు నిర్ఘాంతపోయింది.

''నేను రవిని మర్చిపోయానా?''

''ఔను... మర్చిపోయావు. రవే జ్ఞాపకంవుంటే నువ్విలా జీవచ్ఛవంలా వుండేదానివేనా? రవికి నువ్వెలావుంటే ఇష్టమో అలా వుండేదానివి. రవి నిన్నిలాంటి స్థితిలో చూస్తే ఎలా బాధపడతాడో అనే ఆలోచన నీకుందా... లేదు! నీకు సంబంధించినంతవరకూ రవి చచ్చిపోయాడు. రవి లేకపోవటం నీకెంత దుఃఖమో ప్రదర్శిద్దామన్న తాపత్రయంతప్ప రవి ప్రేమ నీకిచ్చిన బలాన్ని చూపిద్దామనే ఆలోచనే లేదు నీకు. రవి తన స్నేహితుల కష్టాల్ని ఎంత ధైర్యంగా తనమీద వేసుకుని వాళ్లకు సహాయపడేవాడు - అసలు రవి భావాలేమిటి - వాటికి నువ్వెంత విలువనిస్తున్నావు. రవికున్న ధైర్యం అలవరుచుకోలేదు. రవికున్న స్నేహ స్వభావం అలవరుచుకోలేదు. రవి భావాలు నేర్చుకోలేదు.

నువ్వెలావుంటే రవికి సంతోషమో, తాను లేకపోయినా నువ్వెలా వుండాలనుకుంటాడో వీటిగురించి నీకు కనీసం ఆలోచనలేదు. నువ్వు రవిని ప్రేమించావా? ప్రేమించటమంటే ఏంటి... ఇద్దరూ కలిసి సరదాగా బతకటమేనా? అవతలిమనిషి నుంచి నేర్చుకోవటం, ఆ మనిషి భావాల్ని గౌరవించటం కాదా?''

శిరీష గట్టిగా మందలిస్తుంటే రేణు తల దించుకుని కూర్చుంది.

''ఎందుకిలా బతకటం? పోనీ చచ్చిపోరాదూ?'' శిరీష ప్రశ్నకు రేణు బిత్తరపోయింది.

''ఇలా అంటున్నానని కోపం తెచ్చుకోకు. నువ్విలాగే జీవితాంతం ఏడుస్తానంటే దానికంటే చచ్చిపోవటమే మంచిది'' శిరీష గొంతింకా కఠినంగానే వుంది.

''అమ్మ ఏమవుతుందోనన్న దిగులే లేకపోతే చచ్చిపోయేదాన్నే'' ఏడుస్తున్న రేణు గొంతులో ఉక్రోషం ధ్వనించింది.

''చచ్చిపోయేదానికి నీకింకా అమ్మగురించి దిగులెందుకు? రవిలేంది బతకలేవు... చచ్చిపో! అమ్మకోసం బతుకుదామనుకుంటే బతుకు- కానీ ఇలా ఆవిడకో సమస్యలా కాదు... ఆవిడ సంతోషించేలా బతుకు. అసలయినా రవి కోసమో, అమ్మ కోసమో బతకటం - ఏంటి - అర్థంలేకుండా? నువ్వు బతక

టంముందు నీకోసం. నీకోసం నువ్వు బతకక్క రలేదా? నువ్వేమిటి - నువ్వెందుకీ ప్రపంచంలోకి వచ్చావు - నీజన్మ ఇలాయేడ్చి చచ్చిపోవటానికేనా నువ్వు సాధించాల్సిందీ, పొందాల్సిందీ ఏమీలేదా?'' రేణు మీద ఉబికి వస్తున్న జాలిని వెనక్కి నెట్టి కఠినంగా మాట్లాడింది శిరీష.

రేణు మాట్లాడకుండా కూచుంది.

"రవి నుంచి నీకు దొరికిన ప్రేమ చాలాగొప్పది- నాకు తెలుసు. నీకు ప్రేమంటే ఏమిటో తెలుసు- ప్రేమ విలువ తెలుసు. నీకు తెలిసినది ప్రపంచానికి కూడా తెలియజెప్పాలి గదా - ప్రేమకోసం తపించేవాళ్లకెవరికైనా నీ ప్రేమ ఇవ్వాలిగదా-''

"నేనేం చెయ్యను శిరీ... నాకసలు ప్రపంచంలోకి రాబుద్ధికావటంలేదు. ఈ ఇంట్లో ఎక్కడచూసినా రవీ, నేనూ గడిపినక్షణాలే గుర్తొస్తున్నాయి. అలాంటి రోజులికలేవే అనే దుఃఖమే మనసంతా నిండుతోంది. ఏ మనిషిని చూసినా వాళ్లగురించి రవీ, నేనూ అనుకున్న మాటలే గుర్తొస్తున్నాయి. ఆఫీసుకి వెళితే నాసీటుకి ఎదురుగానే రవి సీటు. నిజమే... రవికి నేనిలా వుండటం ఇష్టంలేదు. కానీ నవ్వటానికి నాశక్తి చాలటంలేదు శిరీ... నేను మామూలు మనిషిని''

శిరీష రేణు చేతిని తన చేతిలోకి తీసుకుంది.

"నాకెందుకిలా ఉత్తరాలు రాశావు. నువ్వు కోలుకుంటున్నావనుకున్నాను. అసలు నువ్వక్కడికివస్తే ఎంత బాగుండేది. నువ్విన్నిరోజులు సెలవు పెడతావని తెలిస్తే ఎలాగోలా నీచేత కూడా మాంటిసోరికోర్సు చేయించేదాన్ని-''

నీరసంగా నవ్వింది రేణు.

"నేనా కోర్సు చెయ్యలేను గానీ - ఈ వాతావరణంనుంచి బైటపడి ఎక్కడన్నా కొన్ని రోజులు వుండాలనివుంది శిరీ! ఎక్కడికి వెళ్లాలో తెలియటంలేదు - అన్నయ్యల దగ్గరికి వెళ్లటం నాకిష్టంలేదు''

సుభద్రమ్మ భోజనానికి రమ్మని పిలిస్తే ఇద్దరూ లేచారు. శిరీష తిడుతుందనే భయంతో రేణు మాట్లాడకుండా పెట్టినవన్నీ తినేసింది. సుభద్రమ్మ మొహం వికసించింది. భోజనంచేసి కబుర్లుచెప్పుకుంటూ నిద్రపోయారు. సాయంత్రం లేచి స్నానాలుచేసి చల్లగాలికి డాబామీద కూర్చున్నారు.

"నీ ట్రైనింగు విశేషాలేంటి శిరీ- నాగొడవతోనే సరిపోయింది పొద్దుట్నించీ'' అంది రేణు.

"ట్రైనింగు చాలా బాగుందే - ప్రాక్టికల్‌వర్క్ చాలా కష్టం. కానీ పిల్లలలోవుండే శక్తుల్ని వికసింపజేయడానికి మాంటిసోరి చేసిన ప్రయత్నాలు అద్భుతం అనుకో. నిజంగా అవన్నీ తెలుసుకోవటం మంచి అనుభవం-''

"మరి వచ్చే ఏడాదన్నా స్కూలు పెడతావా?''

"పెట్టక -స్కూలు పెట్టాలనేగదా - సంవత్సరం లాస్ ఆఫ్ పేతో ఈ ట్రైనింగు పూర్తిచేసివచ్చింది'' పేపర్ తిరగేస్తున్న శిరీష ఒకచోట ఆగిపోయింది.
తనదృష్టినాకర్షించిన సమాచారాన్ని పూర్తిగా చదివి తలెత్తి రేణును చూసింది.

"రేణూ... నువ్వు పూనా వెళ్లరాదూ?''

"పూనానా... ఎందుకు?'' రేణు ఆశ్చర్యపోయింది.

"ఎక్కడికన్నా దూరంగా వెళ్ళాలని వుందన్నావుగా?''

"అయితే పూనా ఎందుకు.... ఏం చెయ్యాలక్కడ?''

"ఫిలిం ఇన్స్టిట్యూట్‌లో ఉండి అయిదు వారాలు వాళ్ళేదో కోర్సు నడుపుతారట అందులో చేరు-''

"అన్నీ పిచ్చిమాటలు మాట్లాడకు- ఫిలిం ఇన్స్టిట్యూట్‌లో నేను చేరటమేంటి- అదేం కోర్సు- నన్నెందుకు చేర్చుకుంటారు- అసలు నాకు ఫిలింస్‌తో ఏంపని?''

"నువ్వు సినిమాలు చూడవా?''

'చూస్తాను- చూస్తే-''

"చూసిన వాటిల్లో ఇది బాగుందీ ఇది బాగోలేదు అనుకోవా?''

"అనుకుంటాను''

"అదే అలా అనుకోటాన్నే మరింత బాగా అనుకునేలా ట్రైనింగు ఇస్తారట. అప్రీసియే

షన్ కోర్సు అన్నారు. ఆ అయిదు వారాలు సినిమాలు ఎలా చూడాలి. సినిమాల్లో ఏంచూడాలి అన్నది నేర్పుతారు- నేర్చుకునిరా''

''పోవే- అలాంటి కోర్సు ఎక్కడన్నా వుంటుందా... సినిమాలెలా చూడాలో వాళ్ళు నేర్పేదేమిటి- మనకి తెలియదూ?''

''అబ్బ- నీకు తెలును- నేను ఒప్పుకున్నా. అయిదు వారాలు పూనాలో గడపటానికి నీకేమిటి అభ్యంతరం-?''

''నాకసలు సీటు రాదు- నాకు సినిమాలతో ఏంసంబంధం?''

''నీకు పెయింటింగయితే వొచ్చుగా- ఏదో ఓ కళలో ప్రవేశం వుందిగదా- అన్నట్టు పాటలు పాడతావు గదా''

''బోడిగుండుకీ మోకాలికి ముడిపెట్టకు- పెయింటింగ్‌కీ, సినిమాలకీ సంబంధం ఏమిటి?''

''అబ్బ- అప్లై చెయ్యొచ్చుగా- రాకపోతే వెళ్ళం- అంతేగదా''

శిరీష గబగబా కిందకు దిగివెళ్ళి కాగితం కలం తెచ్చి అప్లికేషన్ రాసింది. రేణు శిరీషను పట్టించుకోకుండా తన ఆలోచనలలో తాను మునిగిపోయింది.

★ ★ ★

వారంరోజుల తర్వాత పూనా నుంచి వచ్చిన ఉత్తరం చూస్తే రేణు ఆశ్చర్యానికి అంతులేదు. అప్రిసియేషన్ కోర్సులో సీటు వచ్చిందనీ రాదల్చుకుంటే వెంటనే టెలిగ్రాం ఇవ్వమనీ రాశారు. ఉత్తరమంతా చదివిన రేణుకు ఏం చెయ్యాలో తోచలేదు. వారంరోజుల్లో కోర్సు మొదలవుతుందనీ ఇన్స్టిట్యూట్ ఆవరణలో వున్న అమ్మాయిల హాస్టల్లో వసతి యేర్పాటు చేస్తామనీ రాశారు.

''ఏంచెయ్యాలి? వెళ్లాలా- ఈ శిరీష భలే పని చేసిందే-'' అనుకుంది రేణు.

స్నానం చేసి తయారవుతుంటే సుభద్రమ్మ సంతోషం పట్టలేకపోయింది.

''అమ్మా... శిరీష దగ్గరకు వెళ్లొస్తాను'' అని చెబుతుంటే నమ్మలేనట్లు చూసింది.

రేణు ఇంట్లోంచి బైటికడుగు పెట్టి సంవత్సరం కావొస్తుంది. ఎంతమంది ఎన్ని బతిమాలినా రేణును ఇంటినుంచి కదిలించలేకపోయారు.

శిరీష సంవత్సరం నుంచీ ఈ వూర్లోనే వుంటే రేణు ఇలా అయిపోయేది కాదేమో అనుకుంది సుభద్రమ్మ. రేణును చూసి శిరీష సంభ్రమంతో లేచింది.

''ఏం చేస్తున్నావు?'' అంటూ కూచున్న రేణుకేసి సంతోషంగా చూస్తూ-

''ఏముంది... పిల్లల పేపర్లు దిద్దుతున్నాను. స్కూళ్ళు తెరిచి ఇరవై రోజులన్నా కాలేదు అప్పుడే పరీక్షలు పెట్టేశాం- పరీక్షలు కాదుగానీ పిల్లల ప్రాణాలు తీస్తున్నామనుకో''

''నువ్వు పెట్టే స్కూళ్ళో పరీక్షలుండవా?'' నవ్వుతూ అడిగింది రేణు.

''నిజంగా వుండవు. పరీక్షలూ, హోంవర్కూ పుస్తకాల మోతా, టీచర్ల బెత్తాలూ ఏవీ లేని స్కూలు పెడతాను- చూడు''

''ఇవేవీ లేకపోతే అది స్కూలవుతుందా?''

''స్కూలు కాకపోతే పిల్లలు స్వేచ్ఛగా వికసించే చోటవుతుంది- అలాంటి చోటు ఒకటి పిల్లల కోసం తయారు చెయ్యాలి- అదే నా ధ్యేయం'' పట్టుదలగా అంటున్న శిరీషకేసి మెచ్చుకోలుగా చూసింది రేణు.

''నువ్వు అనుకుంటే సాధిస్తావు. నాకా నమ్మకం వుంది''

''సరే... దానికింకా టైముంది గదా- ఏంటి సంగతులు?''

''ఏముంది... పూనానుంచి ఉత్తరం వచ్చింది-'' పర్సులోంచి ఉత్తరం తీసి యిచ్చింది.

''నిజంగా- చూశావా- నేచెప్పలా- నీకు సీటు వస్తుందని-'' శిరీష సంబరపడిపోతూ ఉత్తరమంతా చదివింది.

''మరింకేమిటి- అయిదువారాలు పూనాలో హాయిగా గడిపిరా''

''వెళ్ళమంటావా?''

''నేను వద్దంటానా?- నువ్వు మారాలి. కాస్త మనుషుల్లో పడాలి. నువ్వే అన్నావు- ఈ వాతావరణం నుంచి కొన్నిరోజులు దూరంగా వుంటానని. ఇది మంచి అవకాశం. అయిదు




వారాలు పూర్తిగా కొత్తచోట, కొత్త మనుషుల మధ్య వుంటే జీవితమంటే ఆసక్తి కలుగుతుందేమో చూడు. పోనీ వుండలేననుకుంటే మధ్యలో వచ్చెయ్యి''

రేణు మాట్లాడలేదు.

''పద... టెలిగ్రాం ఇచ్చివద్దాం'' శిరీష లేచి తయారయింది.

''రవి లేకుండా నేనొక్కదాన్నే ఎలా వెళ్ళనే?''

రేణు అనుకోకుండా అడిగేసింది.

''ఈ ప్రశ్న వచ్చేది రవి బతికుంటేనే! రవి విడిగా లేడిప్పుడు. ఉండేదేదో నీ మనసులో వున్నాడు. నీతోపాటు వస్తాడు. లేనిపోని ఆలోచనలుచేసి పిచ్చిపెంచుకోకు''

శిరీష మాటలకు రేణు మాట్లాడలేదు.

''లే– వెళదాం''

''ఏమో... నాకు వెళ్ళాలనిపించటంలేదు''

''సరే- వెళ్ళకు-'' పర్సు టేబుల్ మీదపడేసి మౌనంగా కూచుంది శిరీష.

''కోపం వచ్చిందా? నేనొక్కదాన్నీ వెళ్ళలేనేమోనని'' రేణు సంజాయిషీ చెబుతున్నట్లుగా అంది.

''రేణూ- నాకు కోపం రావటమేంటి? నాకు కోపం వస్తుందని నువ్వు వెళతావా? ఒద్దు... నువ్వు వెళ్ళినా మానినా అది నీకోసం. నువ్వు కొన్నాళ్ళు ఎక్కడన్నా వుండాలని వుందంటే నేనీ ఆలోచన కలిగించాను. ప్రోత్సహించాను. వెళితే వచ్చే ఫలితాలో, మానితే వచ్చే సంతోషమో పొందేది నువ్వు. నిర్ణయం నువ్వే తీసుకోవాలి. ప్రతిదానికీ ఇతరుల గురించి ఆలోచించటం మానుకో''

''సరే... వెళ్దాంరా-'' లేచింది రేణు.

శిరీష మాట్లాడకుండా లేచి పర్సుతీసుకుంది. ఇద్దరూ బయటికి నడిచారు.

టెలిగ్రాం ఇచ్చాక-

''వారంరోజుల్లో బోలెడు సినిమాలు చూస్తావు. ఇవాళ నాకో సినిమా చూపించరాదూ'' అంది శిరీష.

''సినిమాకా?'' తప్పుచేస్తున్నట్లుగా వుంది రేణుగొంతు.

''ఏం... సినిమాకెళ్ళటం ఏదో తప్పులా అంటున్నావు?''

''రవి పోయాక నేనింతవరకూ సినిమాకి వెళ్ళలేదు''

''ఎందుకని?''

రేణు మాట్లాడలేదు.

''సినిమా చూడటం సరదాగా, సంతోషంగా వుంటుంది. రవి లేకుండా సరదాలూ సంతోషాలూ ఏంటీ అనుకున్నావు... అంతేనా?''

రేణు మాట్లాడలేదు.

''రేణూ... నువ్వు బతికున్నావు. సరదాలూ, సంతోషాలూ, బాధలూ, భయాలూ అన్నీ నీ చుట్టూ వున్నాయి. వీటికి అతీతంగా యివేమీ నిన్ను తాకకుండా వేరే ప్రపంచంలో వుందామనుకోవటం, వుండగలననుకోవటం భ్రమ. ఏమైనా పూనాలో చూడాలిగదా- ఇక్కడే మొదలెట్టు''

''ఇక్కడొద్దులే- ఎవరన్నా చూస్తారు''

''చూస్తే-? ఏడాది తర్వాత బయటకొచ్చిన నిన్ను చూస్తే అందరూ సంతోషిస్తారుగానీ నువ్వు దిగులుపడకు. ఇవాళ 'మిస్సమ్మ' ఆఖరి రోజు. ఈ సంవత్సరం 'మిస్సమ్మ' సినిమా ఇంతవరకూ చూడలేదు-''

''ప్రతి ఏడాదీ చూడాల్సిందేనా?'' రేణు నవ్వింది.

''మరి- మిస్సమ్మను మిస్సవుతానా?''

సినిమా వదిలింతర్వాత బైటికొచ్చిన రేణూకు ఒకటే ఆశ్చర్యం-

తను సినిమాని మామూలుగా చూసింది. రేలంగినాగేశ్వరరావుల హాస్యానికి కళ్ళనీళ్ళొచ్చేలా నవ్వింది.

''బృందావనమది అందరిదీ అని పాడుతుంటే''

''రావోయి చందమామా అని పాడుతుంటే'' తన్మయత్వంతోవింది.

రవి లేకుండా ఇదంతా ఎలా సాధ్యమయింది?

రవి లేకుండా తాను కాసేపయినా సంతోషంగా ఎలా వుండగలిగింది? రవిని తాను,

మర్చిపోతోందా?

ఉలిక్కిపడింది రేణు.

రవిని మర్చిపోతే తను బతికేదెందుకు? రవి జ్ఞాపకాలు లేకపోతే తనకు జీవితంలో ఏముంది?

"ఏంటోయ్- నీ ఆలోచనలు-" శిరీష భుజం మీదతట్టింది.

"ఏం లేదు... కాస్త తలనొప్పిగా వుంది-"

"కాఫీ తాగితే తగ్గిపోతుంది- రా" అంటూ హోటల్‌లోకి లాక్కెళ్ళింది.

హోటల్‌కి వెళ్లాక- అసలే వాతావరణం వేడిగా వుంది. కాఫీ ఎందుకంటూ ఐస్‌క్రీం తెప్పించింది. రేణు ఐస్‌క్రీం వంకే చూస్తోంది.

రవీ- తనూ బైటికి వస్తే ఐస్‌క్రీం తినకుండా వెళ్ళేవారు కాదు. ఈ ఏడాది నుంచీ ఆ ఐస్‌క్రీం అంటే విషంలా చూస్తోంది తను. ఇవాళ శిరీష తినకపోతే వూరుకోదు. అన్నయ్యలూ, అమ్మా ఎంత ప్రయత్నించినా ఏడాదినుంచి ముట్టుకోని ఐస్‌క్రీం ఎలా తినాలి-

"శిరీషా... నాకేం బాగోలా- నేను తినను"

"వేషాలెయ్యకు- నీకు ఐస్‌క్రీం ఎంతిష్టమో నాకు తెలియదా? నూటమూడు డిగ్రీల జ్వరంలో కూడా రవిచేత ఐస్‌క్రీం తెప్పించుకు తిన్నావు"

"అందుకే ఇప్పుడు తినలేను" దీనంగా అంది రేణు.

"రవిని జ్ఞాపకం చేసుకుంటూ సంతోషంగా తిను- నేను లేకపోతే రేణు ఐస్‌క్రీం తినటంలేదని రవి సంతోషిస్తాడనుకుంటున్నావా? రవి అంత శాడిస్టా?"

"అది కాదు శిరీషా... నీకర్థం కాదు"

"నాకేం అర్థం కానవసరంలేదు. నాకూ ఐస్‌క్రీం ఇష్టమే. తిందామా వద్దా చెప్పు... వద్దంటే- పద వెళ్దాం" శిరీష లేచింది.

రేణు స్పూన్ చేతిలోకి తీసుకుంది. శిరీష కూచుంది. ఐస్‌క్రీం చల్లగా, తియ్యగా వున్నందుకు కూడా రేణూకు ఆశ్చర్యమనిపించింది.

ఎలా తినేశానో ఐస్‌క్రీం- మరి దొరకదన్నట్లుగా! ఎందుకిలా మారిపోతున్నాను- రవిని మర్చిపోయి, మళ్ళీ ఎందుకు ఈ సుఖాలన్నిటికీ దగ్గరవుతున్నాను. రవీ- రవీ- ఒక్కసారి కనిపించవా? నేనేం చెయ్యాలో ఎలా బతకాలో చెప్పి పోవా- రేణు మనసు గతంలోకి వెళ్ళిపోయింది. రిక్షా ఎక్కటం, యింటిదగ్గర తనను దించి శిరీష వెళ్లటం యివేవీ మనసుకి పట్టలేదు. గబ గబా ఇంట్లోకి వెళ్ళి మంచం మీద పడుకుంది. రవీ- తనూ - తన చుట్టూ రవి చేతులు. తన గుండెల్లో ముఖం దాచుకుంటున్న రవి. తనని గారాంచేస్తున్న రవి. తెల్లవార్లూ రవి ఆలోచనలతో పిచ్చెక్కిన రేణూ తెల్లవారుతుండగా నిద్రలోకి జారింది.

★ ★ ★

ఆ వారంరోజులూ శిరీష రోజూ సాయంత్రం వచ్చి రేణు ప్రయాణానికి కావాల్సిన ఏర్పాట్లన్నీ చేసింది. సుభద్రమ్మ ఆ అయిదువారాలూ పెద్ద కొడుకు దగ్గర వుంటానంది. శిరీష హడావిడంతా నిర్లిప్తంగా చూస్తూ కూచుంది రేణు. తీరా వెళ్ళేరోజు రేణుకు ఎంత వద్దనుకున్నా భయం వేసింది.

"నేనొక్కతినే ఎలా వెళ్లనే... నాకు హిందీ కూడా సరిగా రాదు- అసలు స్టేషన్ నించి అక్కడికి వెళ్లటం ఎలా?"

"పూనాలో ఆటోలుండవా?"

"ఆటోవాడు నాకేం తెలియదని గ్రహించి ఎటన్నా తీసుకుపోతే! అన్నయ్యనన్నా రమ్మనాల్సింది"

"అచ్చం ఆడపిల్లలా మాట్లాడావు. పూనా చాలా మంచి ఊరట. ఇలాంటి గొడవలేం వుండవనీ, చాలా కామ్‌గా వుంటుందనీ, మా ఫ్రెండ్ చెప్పింది"

"ఏమో... ఏమన్నా జరిగితే?"

"ఏం జరగదు... శుభ్రంగా వెళతావు. అంతకుముందు నీకున్న ధైర్యం, ఉత్సాహం ఏమయ్యాయి? ప్రతిదానికీ ఇలా భయపడుతున్నావు"

"అన్నీ రవితోనే పోయాయి"

"రవి లేకముందూ వుండేవిగా"

"రవి లేకముందా?" రేణు అదేమిటన్నట్లు చూసింది.

"రవి లేకముందు ఎలా వుండేదానివి-


ఎందరో తారలతో
వారానికో గెట టుగెదర్
సితార

నువ్వు 20 ఏళ్ళు రవి లేకుండా, రవనే మనిషి ప్రపంచంలో వున్నాడని తెలియకుండా బతికావు. అప్పుడు చాలా చురుగ్గా వుండేదానివి. కాలేజీలో ప్రతి కార్యక్రమంలోనూ నువ్వే ముందుండేదానివి - నాటకాలేసేవు, ఆటలాడావు, అద్భుతమైన పెయింటింగులు వేశావు- అవన్నీ మర్చిపోయి ఈ అయిదేళ్ల జీవితమే గుర్తుపెట్టుకుంటానంటే ఎట్లా?''

రేణు శూన్యంలోకి చూస్తోంది.

"ఈ అయిదేళ్ల జీవితం ఓ కలలా పక్కన పెట్టు. మళ్ళీ ఇరవయ్యో ఏడు వచ్చిందనుకుని జీవితం ప్రారంభించు''

రేణు మాట్లాడలేదు.

శిరీష పెట్టె సర్దేసి ఆటో కోసం వాకిట్లోకి వెళ్ళింది.

★ ★ ★

శిరీషను ప్లాట్‌ఫాం మీద వదిలి రైలు కదలి వెళ్ళిపోతుంటే రేణుకి ఒక్కక్షణం ఊపిరాడనట్లయింది. మహా సముద్రంలో తానొక్కతే మునిగిపోతున్నట్లనిపించింది. చుట్టూ మనుషులు ఎవరి హడావుడిలో వాళ్ళు. పెట్టెలు సర్దేవాళ్ళు- పక్కలు పరిచేవాళ్ళు - ఫలహారాలు - తినేవాళ్ళు. పరామర్శలు చేసుకునేవాళ్ళు పెట్టెంత సందడిగావున్నా రేణూ భయం తగ్గలేదు. వాళ్లందరూ ఒకటైనట్లూ తానొక్కతే వాళ్ల నుంచి వేరైనట్లు అనిపించింది. అసలిదంతా ఎందుకు జరిగినట్లు - తన బాధేమిటి? తన జీవితమేమిటి? ఈ పూనా యేమిటి- ఈ సినిమాలేమిటి శిరీషకు తోచీ తోచక చెబితే తనెందుకు బయల్దేరినట్లు- ఎంత దూరం వెళ్ళినా ఎన్ని చోట్లు తిరిగినా రవిని మర్చిపోవటం సాధ్యమా. అసలు మర్చిపోవాలని తాను ప్రయత్నిస్తోందా- లేదు- తాను రవిని మర్చిపోదు. కానీ శిరీష అన్నట్లు రవి జ్ఞాపకాలే తనను సంతోషపెట్టాలి. సజీవంగా వుంచాలి. జీవచ్ఛవంలా తయారు చెయ్యకూడదు. దానికోసం ప్రయత్నించాలి. తాను చేస్తున్న ఈ ప్రయాణం ఆ మార్పిడికి సహాయపడితే చాలు. ఈ బాధ నుంచీ ఈ నిస్సత్తువ నుంచీ బైటపడాలని తనకీ వుంది. కానీ సాధ్యం కావటంలేదు. రవి రాని స్థితిలోకి- మగతలోకి వెళ్లాలనిపిస్తోంది. ఎంత ప్రయత్నించినా అది మారటం లేదు. తప్పనిసరి పరిస్థితుల్లో ఎలాగయినా కుదురుతుందేమో చూద్దామనే తనూ ధైర్యం చిక్కబట్టుకుని ఈ పూనా ప్రయాణానికి సిద్ధమయింది. రవి లేకుండా తానీ ప్రయాణం చేస్తోంది- రవితో కలిసి ఎన్ని ప్రదేశాలు తిరిగింది - ఎంత ఆనందంగా తిరిగింది- ఎంత నిర్భయంగా తిరిగింది- ఇవాళ రవి పక్కన లేకపోతే ఇంత భయం ఆందోళన- లక్ష అనుమానాలు.

"రవీ నా ధైర్యమంతా తీసుకెళ్లావా?'' రేణు కళ్లనిండా నీళ్ళు.




ఆరింటికి రైలు పూనా చేరింది. రేణు పోర్టర్‌ని పిలిచి పెట్టె అప్పగించింది. పోర్టర్ వెనకాలే స్టేషన్ బయటకు నడిచింది. స్టేషన్ బయట వరసగా లైన్లలో ఆటోలున్నాయి. పోర్టర్ ఎక్కడికిపోవాలని అడిగాడు. ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌కి అంది రేణు.

"ప్రభాత్ స్టూడియో దగ్గరకా' అంటూ ఒక ఆటోలో సూట్‌కేసు పెట్టాడు పోర్టరు.

రేణు కంగారుపడింది. ఆ ఆటో అతను వస్తానంటాడో రానంటాడో- అడక్కుండానే పెట్టె లోపలపెట్టేశాడు. ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌కి వస్తావా అని బెరుగ్గా హిందీలో అడిగింది.

"కూచోండమ్మా- మీరెక్కడికి వెళ్ళాలంటే అక్కడికే వస్తుంది ఆటో' అన్నాడు డ్రైవర్. రేణుకింకా బెరుకుపోలేదు.

"ఎక్కడి నుంచమ్మా?'' అనడిగాడు

"హైదరాబాదు-''

"పూనాలో హైదరాబాదు పద్ధతి కాదమ్మా- దూరమైనా దగ్గరైనా ఒక వరసలో ఆటోలు




జనాన్ని ఎక్కించుకుపోవాల్సిందే. ఒక లైన్లో వుండటం ఒకదాని తర్వాత ఒకటి బేరం రాగానే వెళ్లటం- ఎక్కడికి అనే ప్రశ్నేలేదు'' ఆటో అతను హిందీలో గబగబా మాట్లాడేస్తున్నాడు.

రేణు మాయమవుతున్న పూనా వీధుల్ని చూస్తూ కూచుంది. పదిహేను నిమిషాల్లో ఫిలిం ఇన్స్టిట్యూట్ గేటు ముందు ఆగింది ఆటో. పెద్ద గేటు దగ్గర రెండు మహావృక్షాలు. లోపలికి చూస్తే పచ్చగా చెట్లు- ఎంత బాగుంది ఈ ఇన్స్టిట్యూట్ అనుకుంది రేణు. గేటు దాటగానే సెక్యూరిటీ ఆఫీసుంది. అక్కడికి వెళ్ళి అప్రిసియేషన్ కోర్సుకోసం వచ్చానని చెబితే వాళ్ళు లేడీస్ హాస్టల్ దోవ చూపించారు. సెక్యూరిటీ ఆఫీస్ పక్కనే- కుడివైపుకి తిరిగితే సన్నటి కాలిబాట, ఎడం ఎడంగా వేసున్న బండలు, అటూ ఇటూ క్రోటన్సు, పూలమొక్కలూ- ఉదయం కురిసిన వానకు శుభ్రంగా స్నానం చేసి హుషారుగా గాలికి కదులుతున్నాయి. హాస్టల్లోకి వెళ్ళి వార్డెన్ని కలిసింది. ఆమె మేడమీది గదిలోకి తీసుకెళ్ళింది.

''ఈ రూంలో ముగ్గురు వుంటారు. ఇంతకు ముందే ఒకావిడ వచ్చారు. మీరూ- ఇంకొకరు కూడా వస్తారు. మీరు స్నానం చేసి వెళ్ళేప్పుడు తాళం నాకిచ్చి వెళ్ళండి. మీరు లంచ్, డిన్నరూ ఇక్కడే తీసుకోవచ్చు. రెండొందల నలభై రూపాయలు డిపాజిట్ కట్టాలి'' అంటూ వెళ్ళిపోయింది.

రేణు రూమంతా కలయజూసింది. పెద్ద గది. మూడు మంచాలున్నాయి. రెండు టేబిల్సు- ఒకవైపు గోడకు మూడు అల్మరాలు- గది వెనక కొంచెం చిన్న బాల్కనీలా వుంది. అక్కడికి వెళ్ళిచూసింది- కిందంతా గడ్డి- పిచ్చి మొక్కలూ- తర్వాత గోడ. గోడపక్కనే పెద్ద బంగళా- తోటలో గులాబీలను చక్కగా పెంచారు. రకరకాల రంగుల్లో కన్నులపండుగ్గా వున్న గులాబీల తోటను చూస్తూ నిలబడింది రేణు. లోపలికి వచ్చింది. ఒక మంచం మీద చక్కటి దుప్పటి పరచివుంది. సామానులన్నీ అల్మరాలో సర్దిందేమో కుర్చీమీద ఆరవేసిన టవల్ తప్ప మరింకేమీలేవు. రేణు కూడా సూట్కేసు అల్మరాలో పెట్టి స్నానానికి వెళ్ళింది. స్నానం చేసి వచ్చి టైంచూస్తే పది. హడావుడిపడుతూ గదికి తాళంవేసి తాళం చెవి వార్డెన్కిచ్చి క్లాసెక్కడ అని అడిగింది.

నరానరి వెళ్ళమని చెప్పిందావిడ. ఎత్తుమీదికి ఎక్కుతున్నట్లుగావున్న బాట వెంట ఐదు నిమిషాలు నడిస్తే అప్రిసియేషన్ కోర్సు అన్న బోర్డు కనిపించింది. చాలామంది అక్కడ నిలబడీ గట్లమీద కూచునీ మాట్లాడుకుంటున్నారు.

రేణు వెళ్ళి ఆడవాళ్ళకు పక్కగా కూచుంది.

చుట్టూ చెట్లూ, లతలూ, పూలూ- కనుచూపు మేర ఎక్కడ చూసినా పచ్చదనమే. కోర్సు అదీ ఎలా వున్నా ఈ వాతావరణంలో వుండటమే హాయిగా వుండేలా వుంది- రవి వుంటే ఇంకా బాగుండేది. రవి వుంటే అనలిక్కడికి ఎందుకొచ్చేది తను?

''మీ పేరు?'' పక్కనున్న అమ్మాయి పలకరించింది.

''రేణు... మీపేరు?''

''ప్రభ- బొంబాయి నుంచి వచ్చాను. మీరెక్కడి నుంచి?''

''హైదరాబాదు నుంచి- క్లాసు ఎన్నింటికి మొదలెడతారు?'' పూర్తిగా ఇంగ్లీషులో మాట్లాడటం రేణుకు కొంచెం ఇబ్బందిగా వుంది.

''ఇప్పుడే- ఇంకో అరగంటలో- మీరు లైబ్రరీ డిపాజిట్కట్టి ఫైల్ తీసుకున్నట్లు లేరే?''

''ఎక్కడ కట్టాలి?''

ప్రభ పక్కనే వున్న ఆఫీస్ రూంచూపింది. అక్కడ లైబ్రరీకోసం వంద రూపాయలు డిపాజిట్ కడితే ఫైలొకటి ఇచ్చారు. ఫైలుమీద ఫిలిం అప్రిసియేషన్ అన్నపేరు చూసి నవ్వొచ్చింది. తనకిందులో ఓనమాలు తెలియవు. ఫైలు ఏం చెయ్యాలి- దాంట్లో ఆ వారం ప్రోగ్రామంతా టైపుచేసి ఇచ్చారు.

బెల్ మోగటంతో అందరూ క్లాస్రూం వైపు నడిచారు. రేణు కూడా వాళ్ళ వెంట నడిచింది.

అరవైమందిదాకా వున్నారు. పాతికమంది దాకా ఆడపిల్లలే. ప్రొఫెసర్ రమేష్ వచ్చి తననుతాను పరిచయంచేసుకుని అందరినీ పరిచయం చేసుకోమని కోరాడు. అందరూ వాళ్ళ పేరూ, వృత్తి ఇంకా వివరాలూ చెబుతు

న్నారు. రేణుకెందుకో చాలా నెర్వస్‌గా అని పించింది. తనవంతు వచ్చేసరికి - "రేణు, హైదరాబాద్" అని కూర్చుంది. పాతికమంది ఆడవాళ్ళను చూస్తే రేణుకు ఆశ్చర్యం కలి గింది. ఒక్కరూ మామూలుగా చీరకట్టుకుని సాదాగా లేరు. కొందరు జీన్స్, మరికొందరు చుడీదార్ పైజమా ఇద్దరు చీరెకట్టుకుని స్లీవ్ లెస్ బ్లౌజులు- చాలామంది బాబ్డ్‌హెయిర్. లిప్‌స్టిక్ వేసుకోని వాళ్ళులేరు. "వీళ్ళందరిలో తాను చాలా వెనకబడినదానిలా వుందేమో" అనుమానంగా అనుకుంది.

ఇంతలో రమేష్ పాఠం మొదలుపెట్టేశారు.

"సినిమా అంటే కదులుతున్న బొమ్మ లుంటాయి. ఆ బొమ్మలు మనకు అర్థవంత మైన కథ చెబుతాయి. సినిమా తప్పనిసరిగా ఏదో ఒక విషయాన్ని గురించి చెప్పాలి. ఇప్పు డు మనమో చిన్న సినిమా చూద్దాం. అది 'అవర్‌డైలీ బ్రెడ్' అనే సినిమా.

ఇందులో ఒక చిన్న గ్రామంలో నివసించే ప్రజలు వర్షాలులేక పొలాలు ఎండిపోతుంటే- పక్కనున్న కొండమీది చెరువులో నీటిని పొలా ల్లోకి రప్పించటానికి కాలువ తవ్వుతారు విషయం అదీ- ఆ విషయంలో ప్రధానంగా వుండాల్సిన అంశాలు కొన్నివున్నాయి. అవే మిటో చెప్తారా- ప్రయత్నించండి. పొలాలు నీళ్ళు లేక ఎండిపోతున్నాయి. నీళ్ళు కొండ మీద వున్నాయి. వాటిని కిందికి రప్పించాలి- ఇందులో ప్రధానంగా రావాల్సిన భావాలేమిటి- కలిగించాల్సిన అనుభూతులేమిటి? ఎవరైనా చెప్పండి - కమాన్"

ఒకతను లేచి అన్నాడు - "పంటలు ఎండిపోతున్నాయన్నారు. కాబట్టి ఆ పని చాలా తొందరగా జరగాలి - ఆ తొందరని చూపించాలి" అని.

"వెరీగుడ్- చాలా మంచి అంశం చెప్పారు. ఇది చాలా అర్జెంట్‌గా జరగాల్సిన పని- ఆ అర్జెన్సీని చూపించాలి. ఇది చాలా ముఖ్యమైన విషయం. ఇంకొకటి చెప్పండి"

ఎవరూ మాట్లాడలేదు. రమేష్ "సినిమా చూసి చెప్పండి" అన్నారు. గది చీకటయి సినిమా మొదలయింది. సినిమా చూశారు.

ఆ ఊరిలో మగవాళ్ళందరూ రాత్రింబగ ళ్ళూ పనిచేసి కొండమీద నుంచి కాలువ తవ్వారు. కాలువలోకి నీళ్ళు వచ్చాయి. నీళ్ళు గలగలాపారుతూ పొలాల్లో నీటికోసం ఎదురు చూస్తున్న ఆడవాళ్ళ పాదాల దగ్గరకు వచ్చాయి. పిల్లలు, ఆడవాళ్ళూ, మగవాళ్ళూ అందరూ ఆనందంతో పాటలు పాడారు. గంతులేశారు. సినిమా పదిహేను నిమిషాలే-

సినిమా పూర్తికాగానే రమేష్ మళ్ళీ అడిగా డు

"ఈ కథ దేన్ని గురించి? ప్రధానంగా వుండాల్సిన విషయాలేమిటి? అవన్నీ వున్నా యా?"

"అందరూ కలిసి పనిచేశారు- రాత్రింబగ ళ్ళూ చేశారు- కొండ చాలాదూరాన వుంది" అని చెప్పాడు ఒక అబ్బాయి.

"దూరాన వుంది అనే విషయం చూపించా లిగదా. ఆ నాలుగు మైళ్ళ పొడవునా కెమేరా వెళ్ళదుగదా- ఎలా చూపించారు దూరాన్ని?"

ఇంకొకతను లేచాడు—

"ఒకచోట పొదలు నరకటం, ఇంకోచోట పెద్దచెట్టు నరకటం, ఇంకోచోట పెద్దబండను పగలగొట్టటం, ఇంకోచోట కర్రలతో చిన్న వంతెన కట్టుకోవటం - ఇవన్నీ చూపించటం ద్వారా కాలువ తవ్వాల్సిన దూరం చాలావుంది అనేది స్పష్టం చేశారు సార్"

"బాగుంది- కొండమీది నుంచి కిందకు నీళ్ళు వచ్చాయి. అసలు కొండమీద ఎందు కుండాలి చెరువు? పదిమైళ్ళ అవతల వుండొ చ్చు- పదిమైళ్ళ పొడవునా కాలువ తవ్వుతారు. అప్పుడూ ఇలాగే దూరం శ్రమ, ఆనందం అన్నింటినీ చిత్రీకరించవచ్చు. చెరువు కొండ మీద వుండాల్సిన అవసరంఏముంది- అలా వుండటం విషయానికిగానీ, విషయాన్ని చిత్రీ కరించే విధానానికిగానీ ఏమైనా వుపయోగప డుతుందా? లేకపోతే అనుకోకుండా కేవలం కాకతాళీయంగా వాళ్ల బుర్రల్లోకి కొండ మీద చెరువు అనే ఐడియా వచ్చిందంటారా?"

ఎవరూ మాట్లాడలేదు.

"ఆలోచించండి- సినిమాలోకి ఏ విషయ మూ యాక్సిడెంటల్‌గా రాదు... రాకూడదు. ప్రతీదీ ఒక ప్లాన్ ప్రకారం ఒక పద్ధతి ప్రకారం

నిర్ణయిస్తారు. అలా ప్లానూ పద్ధతీ లేకుండా సినిమాలు తీయగూడదు. తీస్తే అవి అస్తవ్యస్తపు సినిమాలు అవుతాయి. మరి ఇప్పుడీ కొండ ఈ సినిమాలోకి ఏప్లాన్ ప్రకారం, ఏపద్ధతి ప్రకారం వచ్చింది- ఎందుకు వచ్చింది- ఆ కొండ ప్రయోజనం ఏమిటి?''

ఎవరూ మాట్లాడలేదు. అందరూ ఆలోచనలో పడ్డారు.

''ఆల్‌రైట్... లంచ్‌టైం అయింది. లంచ్‌తీసుకుని మళ్ళీ రెండున్నరకు క్లాసుకి రండి. మధ్యాహ్నం హేమంత్ క్లాసు తీసుకుంటారు. మీట్ మిస్టర్ హేమంత్-''

అప్పటిదాకా ముందువరసలో కూచుని రమేష్ క్లాసు విన్న హేమంత్ నవ్వుతూ విష్ చేశాడు.

ఎంత అందంగా వున్నాడీయన అనుకోకుండా వుండలేకపోయింది రేణు. తెల్లగా పొడుగ్గా వున్నాడు. చక్కని ముక్కు, కళ్ళూ; తల పూర్తిగా బట్టతలై మెరిసిపోతోంది. వెనక మాత్రం నలుపు తెలుపులు కలగలిసిన వెంట్రుకలు పొడుగ్గా పెరిగి భుజాలమీద పడుతున్నాయి.

అందరూ క్లాసురూం నుంచి హడావుడిగా లంచ్‌కి పరిగెత్తారు.

రేణు ఒక్కత్తే హాస్టల్‌వైపు నడుస్తుంటే ఒకమ్మాయి పలకరించింది.

''నాపేరు మంజరి- లక్నోనుంచి వచ్చాను. నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామాలో చదివాను'' చనువుగా మాట్లాడుతున్న మంజరిని చూస్తే రేణుకు బెంగతగ్గింది. తన వివరాలు చెప్తూ - రూంలోకి వెళ్ళింది. రూంలో ఒకావిడ చక్కగా ముస్తాబై ఉంది. రేణు ఉత్సాహంగా- ''మీరూ ఈ రూంలో చేరారా? నాపేరు రేణు. హైద్రాబాదు నుంచి వచ్చాను'' అంది.

''నాపేరు ఉమ- లక్నో నుంచి వచ్చాను. లెక్చరర్‌గా పనిచేస్తాను''

ఉమ మేకప్ రేణుకు ఆశ్చర్యంగా అనిపించింది. ఏమీ అందంగా లేదు. మేకప్ బొత్తిగా సూటవలేదు. బాబ్డ్‌హెయిర్, పెదవులకు ఎర్రగా లిప్‌స్టిక్, స్లీవ్ లెస్ బ్లౌస్. ఈవిడ ఇలా కాకుండా సాదాసీదాగా ఉంటే ఇంత వికారంగా ఉండేది కాదేమో- నలభైయ్యేళ్ళున్నట్లుగా ఉంది. పదహారేళ్ళమ్మాయిలా తయారయింది - అనుకుంది రేణు.

ఇద్దరూ కిందికి దిగివెళ్ళి డైనింగ్ హాల్లో లంచ్‌కి కూచున్నారు. ఎంతకీ ఎవరూ రారు... వడ్డించరు. ''మీరే కిచన్‌లోకి వెళ్ళి తెచ్చుకోవాలి. ఇలా కూచుంటే కూరలన్నీ అయిపోతాయి-'' ఎవరో హిందీలో చెప్పారు. రేణు కిచన్‌లోకి వెళ్ళింది. కిచనంతా చాలా నీట్‌గా ఉంది. ఒక గట్టుమీద ప్లేట్లూ, గ్లాసులూ, రెండు కూరగిన్నెలూ, పెరుగు గిన్నె, పెద్దప్లేట్‌లో ఉల్లిపాయలు, పచ్చికూరగాయల ముక్కలూ ఉన్నాయి; చిన్నగిన్నెలో కాస్త అన్నం ఉంది. వంటామె పెనం పెట్టుకుని వేడివేడిగా చపాతీలు కాల్చి పక్కనపెడుతోంది.

రేణు చపాతీలు చూడగానే గతుక్కుమంది. ''ఇక ఈ ఐదువారాలూ చపాతీలు తినాలా?'' పొద్దుట్నించీ ఏమీ తినకపోవటంతో బాగా ఆకలనిపించింది రేణుకు. చపాతీలు తినటమే కష్టమనుకుంటే కూరలు అసలు గొంతు దిగలేదు. ఎలాగో ఒక చపాతీ తిని పెరుగుతో రెండు ముద్దలు తిని గదికి వెళ్ళింది.

''హలో'' అంది గమన రేణును చూడగానే. ''హలో'' అంది రేణు మొహమాటంగా నవ్వుతూ. ''నాపేరు గమన. ఢిల్లీలో పత్రికలో పనిచేస్తున్నాను''

రేణు తన గురించి చెప్తుంటే ఉమ కూడా వచ్చింది. ముగ్గురూ పరిచయాలు మరికాస్త పెంచుకున్నారు. ''మీకు పెళ్ళయిందా?'' గమన అడిగింది ఉమను. ఉమ లేదంటే రేణుకు ఆశ్చర్యమనిపించింది. నలభైయేళ్ళున్నట్లున్నాయి- ఇంకా పెళ్ళి కాలేదా అనుకుంది. ''మీకు?'' గమన రేణు వంక చూసింది.

''అయింది-''

''ఆయనేం చేస్తారు?''

''మా ఆఫీస్‌లోనే-''

''మరి ఇక్కడకు కూడా కలిసి రావాల్సింది. కానీ ఇంట్లో, ఆఫీసులో కూడా కలిసి ఉండీ ఉండీ బోర్‌కొడుతుంది. కొన్నాళ్ళు విడివిడిగా ఉండటం భార్యాభర్తలకు పెద్ద రిలీఫ్...




# ఇతర డైలు అన్నీ కలిపి ఎంతమంది వాడుతారో అంతకంటే ఎంతో ఎక్కువ మంది తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైనే వాడుతారు.

ఇవిగో 3 మంచి కారణాలు:




రెండు నైసర్గిక రంగులలో లభ్యం—
బ్లాక్ మరియు డార్క్ బ్రౌన్.

**1** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై మీ జుట్టుకు అందిస్తుంది నైసర్గిక రంగు, రూపం. జుట్టును మృదువుగాను, ఎలా కావలిస్తే అలా చక్కగా వుంచుకోడానికి దీనిలో కండిషనర్ కూడా వున్నది. నిజానికి, వేసుకొన్నారని మీరు చెప్పితే తప్ప ఎవరికీ తెలియదు.

**2** ఇతర హేర్ డైలలాగా కాకుండా, తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైని సులభంగా, అనుకూలంగా వేసుకోవచ్చు. అవును, జుట్టును షాంపూ చేసుకోవడం లాగే ఎంతో సులభం.

**3** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై నాణ్యత సంబంధంగా మీరు నిశ్చింతగా వుండవచ్చు. ఎందుకంటే, మీ జుట్టును, చర్మాన్ని సంరక్షించడానికి ఇది ప్రత్యేకంగా తయారు చేయబడినది. పరిపూర్ణ రక్షణ—ఇదే గోద్రెజ్ వాగ్దానం.

**గోద్రెజ్®** తనంతట తానే వ్యాపించే పర్మనెంట్ హేర్ డై.



CLARION/B/GS/50/173/TL

ఔనా?''

రేణు నవ్వేసి ఊరుకుంది.

"నాకింకా పెళ్ళికాలేదుగానీ పెళ్ళి గురించి బాగా ఆలోచిస్తున్నా" గమన కూడా నవ్వింది.

గమన జీన్స్ వేసుకుంది. జుట్టు పైకి దువ్వి మెడమీద ఎత్తుగా ముడివేసుకుంది. పెదవులకు కనిపించీ కనిపించకుండా లేతరంగు లిప్‌స్టిక్ వేసింది. మెడలో రుద్రాక్షలంత పెద్ద పెద్ద పూసలు దండగా వేసుకుంది. పెద్దపెద్ద కళ్లు. మంచి రంగు. రెండున్నరకి క్లాసుకి బయలుదేరారు.

"మీవారి పేరు?"- గమన

"రవి—"

"ఉత్తరం రాశారా రవిగారికి- అడ్రసు తెలుసా? ఇదిగో ఈ అడ్రసుతో రాయండి" అంటూ హాస్టలు అడ్రసూ, రూం నంబరూ ఇచ్చింది.

రేణుకు ఒక్కక్షణం ఏమీ అర్థం కాలేదు. రవి లేడని గమనకు తెలియదు. ఉమకు తెలియదు. ఇక్కడ ఎవరికీ తెలియదు. వీళ్ళందరి దృష్టిలో రవి బతికే ఉన్నాడు. రేణుకు గుండెలనిండా సంతోషమూ దుఃఖమూ రెండూ నిండిపోయాయి. కళ్ళల్లోకి నీళ్ళు ఉబికి వచ్చాయి.

"రవీ... రవీ... నా రవీ- నువ్వు బతికే ఉన్నావు. హైద్రాబాదులో ఉన్నావు. నేను పూనా వచ్చాను. ఉత్తరాలు రాస్తాను" రేణు గబగబా అడుగులు వేస్తూ క్లాస్‌రూం వైపు నడిచింది.

అప్పటికే హేమంత్‌గారు వచ్చేశారు. అందరూ నిశ్శబ్దంగా కూచున్నారు. హేమంత్ సినిమా చరిత్ర గురించి ఆ ఐదువారాలు చెబుతారు. హేమంత్ పాఠం మొదలెడుతున్నపుడు మాత్రమే రేణుకు హేమంత్ అందంగా ఉన్నాడనీ, తను పూనాలో క్లాసురూంలో ఉందనీ తన పక్కనే ఒకబ్బాయి సిగరెట్ తాగుతూ కూచున్నాడనీ, తనకు సంకోచంగా ఉందనీ, తెలిసింది.

నాలుగున్నరకు "మళ్ళీ రేపు కలుద్దాం- ఏమైనా సందేహాలుంటే రేపు క్లాసులో సంకోచించకుండా అడగండీ" అంటూ సిగరెట్ వెలిగించుకున్నారు హేమంత్. రేణు ఈ లోకంలోకి వచ్చింది. ఎంత బాగా చెప్పారీయన- ఎన్ని విషయాలు- క్లాసు బయటికి వచ్చి వరండాలో పూలతీగెల పక్కనున్న గట్టు మీద కూచుంది. అందరూ వెళ్ళి టీతెచ్చుకు తాగుతున్నారు. రేణుకు టీ తాగాలనిపించలేదు. హేమంత్ పాఠాన్నే మనసు మననంచేసుకుంటోంది. **1839**లో స్టిల్ కెమేరా కనిపెట్టారనే విషయంతో మొదలుపెట్టి, ప్రాచీనకాలంలో గుహల్లో వేసిన చిత్రాలలో కదలికలను ఎలా చూపించేవారో పరామర్శించి, **1895**వ సంవత్సరానికి కెమేరాలో బొమ్మలెలా కదిలేస్థితికి వచ్చాయో వివరించి మొట్టమొదట తీసిన కదిలేబొమ్మల సినిమాలను చూపించాడు. ఆ సినిమాలన్నీ రెండు మూడు నిమిషాల సినిమాలవి. ప్రపంచంలోనే మొట్టమొదటి సినిమాలు అవి. కార్మికులు ఫాక్టరీలోంచి బైటికి వచ్చేదృశ్యం ఒక సినిమా. గోడను పగలగొట్టే దృశ్యం, పాపకు పాలుపట్టే దృశ్యం, రైలు స్టేషన్‌కి వచ్చి ఆగే దృశ్యం... అన్నీ ఇలాంటి దృశ్యాలే. ఒక్కొక్కటీ ఒక్కొక్క సినిమా.

మొట్టమొదటిసారి కొంచెం కథ, కొంచెం డ్రామా ఉన్న సినిమా అంటూ హేమంత్ చూపిన 'తోటపని' సినిమా గుర్తొచ్చి రేణుకు నవ్వొచ్చింది. ఒకతను రబ్బరు పైపుతో మొక్కలకు నీళ్లు పెడుతుంటాడు. వెనకనుంచి ఇంకొకతను వచ్చి వెనకగా నిలబడి పైపు మీద కాలు వేస్తాడు. నీళ్ళు రాకపోవటంతో మొదటి అతను కంగారుపడి పైపుని తన మొహంవైపు తిప్పి పరీక్షిస్తుంటే రెండవ అతను కాలు తీస్తాడు. దాంతో నీళ్ళు ఒక్కసారిగా మొఖం మీదికి చిమ్ముతాయి. అతను కంగారుపడి వెనక్కుతిరిగి రెండవ అతన్ని చూసి అతని వెంటపడతాడు.

"మీరు టీ తాగరా?" అనే ప్రశ్న వినబడటంతో నవ్వునణుచుకుని పక్కకు చూసింది.

ఎవరో అతను- చనువుగా వచ్చి పక్కన కూచున్నాడు. "తాగాలనిపించటం లేదు-" మొహమాటంగా అంది. నాపేరు వర్మ. బాంబేలో జర్నలిస్టుగా పనిచేస్తున్నాను. మీ పేరు రేణుకదూ?"

"మీకెలా తెలుసూ?" ఆశ్చర్యంగా అడిగింది.




"పొద్దున మీరే చెప్పారుగా"

"నేనా –"

"మీరే - క్లాసులో చెప్పలేదూ?"

"అదా–" నవ్వేసింది.

"ఇతను నారూమ్మేటు చంద్రా - కొచ్చిన్ నుంచి వచ్చాడు" అక్కడికి వచ్చిన మరొకత న్ని పరిచయంచేశాడు వర్మ.

అంతలో మరో ఇద్దరు - పరిచయాలు. రేణుకు వూపిరాడనట్లనిపించింది. వీళ్లంతా ఏదోగా వున్నారు. జీన్సు - గడ్డాలూ, మెళ్లో దండలూ, చేతిలో సిగరెట్లు ఓ గడ్డపబ్బాయి - 'సిగరెట్ కావాలా' అని అడిగాడు. రేణు ముఖం ఎర్రబడింది. "ఛీ" అంది అప్రయత్నంగా. వాళ్లంతా హర్ట్ అయినట్లున్నారు. ఒక్కసారి నిశ్శబ్దమైపోయారు.

ఇంతలో సల్వార్ కమీజు వేసుకున్న ఒక నల్లటి ఆవిడవచ్చి - 'ఎవరన్నా ఓ సిగరెట్ ఇస్తారా - ఇప్పుడు షాప్‌కెళ్లే ఓపికలేదు. నాసిగ రెట్లు అయిపోయాయి" అని అడిగింది.

"విత్ ప్లెజర్" అంటూ ఆనంద్ అనే అబ్బాయి ఆమెకు సిగరెట్ వెలిగించి ఇచ్చాడు.

"నాపేరు బీనా ... పాటియాలా నుంచి వచ్చాను. లెక్చరర్‌గా పనిచేస్తున్నాను" సిగరెట్ పొగ గాలిలోకి వదులుతూ చెప్పిందామె.

అంతలో ఇంకో నలుగురైదుగురమ్మాయిలు పెద్దగా నవ్వుకుంటూవచ్చి ఈ గుంపులో కలిశారు.

రేణు నెమ్మదిగా కదిలి హాస్టల్‌వైపు నడిచింది. దారిలో గమన కలిసింది.

"నేను బజారుకి వెళ్తున్నాను - మీరూ వస్తారా?"

"నేను రానుగానీ నాకొక తాళం తెచ్చిపెడతారా ... నా అల్మారాకు తాళంలేదు. నేను తెచ్చుకోలేదు" అడిగింది.

"నాదగ్గర మరో తాళంవుంది - అయితే మీరు బజారుకి రారన్నమాట- సీయూ -" అంటూ వెళ్లిపోయింది గమన.

రేణు రూంకి వచ్చి కూచుంది. చాలా ఒంటరిగా అనిపించింది. పొద్దుట్నుంచీ జరిగిన విషయాలన్నీ కలలా అనిపించాయి. వెనక బాల్కనీలోకి వెళ్లి నుంచుంటే పక్క ఇంట్లో గులాబీలు తలలూపుతూ పలకరించాయి. వాటిని చూస్తూ నిలబడిపోయింది చాలాసేపు.

అంతలో ఉమ వచ్చింది. హిందీలో గబగబా ఏదో మాట్లాడుతోంది. రేణుకు సరిగా అర్థంకావటంలేదు. తనేమీ మాట్లాడకపోయినా తను వింటోందో లేదో గమనించకుండా మాట్లాడుతున్న ఉమని చూస్తే ఆశ్చర్యం వేసింది. ఈ ఉమలో ఎక్కడో మొరటుతనం వుంది. వేషంలో, అలంకరణలో ఎంత అధునాతనంగావున్నా ఎక్కడో ఏదో లోపం వుందని తెలుస్తోంది- ఇదంతా తెచ్చిపెట్టుకున్న సంస్కారమన్నట్లుగా వుంది. అందంగా లేకపోవటమనిగాదు - అందం లేకపోయినా ముఖంలో సంస్కారం కనపడవచ్చు.

ఉమ ఏదో ప్రశ్నించటంతో ఉలిక్కిపడింది. "9 గం॥కు చార్లీ చాప్లిన్ సినిమాకి వస్తున్నారా?" మళ్లీ అడిగింది ఉమ.

"ఎందుకురాను - రేపు క్లాసులో ఆ సినిమా గురించి డిస్కషన్ వుంటుందిగా" అమాయకంగా అచ్చుక్లాసు ఎగ్గొట్టటానికి సంకోచించే విద్యార్థిలా అడిగింది రేణు.

"రాత్రంతా ప్రయాణం చేసొచ్చి ఇప్పుడు సినిమా ఏంచూస్తాం - నాకైతే నిద్రొస్తోంది. భోజనంచేసి నిద్రపోతా" అంటూ కిందకువెళ్లింది.

రేణు కూడా భోజనానికి వెళ్లింది. చాలా మంది అక్కడ చేరి టి.వి. చూస్తున్నారు.

మంజరి అప్పటికే తింటోంది - నవ్వుతూ ఆహ్వానించింది. రేణు చపాతీలు తెచ్చుకుని మంజరి పక్కనే కూచుంది.

"మీకు పెళ్లయిందా?" మంజరి అడిగింది.

"అయింది–"

"ఆయనేం చేస్తారు – పేరేంటి?"

"రవి - మా ఆఫీసులోనే చేస్తారు"

"ఎన్నేళ్లయింది మీపెళ్లయి?"

"అయిదేళ్లు–"

"ఔనా - మిమ్మల్ని చూస్తే పెళ్లికాని అమ్మాయిలా ఉన్నారు?"

నవ్వింది మంజరి.




ఇద్దరూ భోజనం ముగించి థియేటరుకి వెళ్లారు.

'గ్రేట్ డిక్టేటర్' సినిమా - దాని కథా, సినిమా చివర్లోవున్న చాప్లిన్ వుపన్యాసం ప్రింటుచేయించి ఇచ్చారు. నిజం హిట్లరు ఉపన్యాసం ఇచ్చిన దృశ్యాన్ని ముందు చూపిస్తున్నామనీ, దానిని చాప్లిన్ హిట్లరుగా నటించిన తీరుతో పోల్చుకుని పరిశీలించమనీ కథ చివరన రాశారు.

చాప్లిన్ యుద్ధంలో పనిచేసి తప్పించుకున్న క్షురకుడిగా, హిట్లరుగా అద్భుతంగా నటించాడనిపించింది రేణుకు. చివరలో హిట్లరు స్థానంలోవున్న ఆ క్షురకుడు చేసిన ఉపన్యాసం వింటుంటే కళ్ల నీళ్లు వచ్చేశాయి.

★ ★ ★

తెల్లవారి ఎనిమిది గంటలకు ఉమ లేపుతుంటే మెలకువ వచ్చింది రేణుకు.

"ఇంతసేపు నిద్రపోతే తొమ్మిది గంటలకు క్లాస్‌కెలా వెళతారు - లేవండి - స్నానం, టిఫినూ చాలావనుంది-"

పక్కన గమన నిద్రపోతూనేవుంది. ఉమ గమనని కూడా లేపింది.

"రాత్రి మీరు సినిమాకిరాకుండా పడుకున్నారు. అందుకని పెందలాడే లేచి మా నిద్రలు పాడుచెయ్యటం బాగాలేదు. నాకు తొమ్మిదికిముందు లేచే అలవాటులేదు - లేవను-" నిర్మొహమాటంగాచెప్పి ముసుగు పెట్టేసుకుంది గమన. ఉమ ముఖం మాడిపోయింది. రేణు లేచి ముఖం కడుక్కుని స్నానంచేసి తయారయ్యేసరికి ఎనిమిది ముప్పావు అయింది. ఉమ అప్పటికే వెళ్లిపోయింది.

కింద మెస్‌కి వెళితే భోజనం తప్ప అక్కడ టిఫిన్లు దొరకవనీ, కాంటీన్‌కి వెళ్లమనీ చెప్పారు. మళ్లీ గదికి వచ్చేసింది - గమన ఇంకా లేవలేదు. క్లాసుకురాదా - తను లేపితే ఏమంటుందో - ఆలోచిస్తుండగానే గమన ముసుగుతీసి 'టైమెంతా' అని అడిగింది. "పది నిముషాలుంది తొమ్మిదికి-"

"నాకు పది నిముషాలు చాలు" అంటూ గమన బ్రష్ తీసుకుని బాత్‌రూంకి వెళ్లింది. సరిగ్గా అయిదు నిమిషాల్లో తయారై పదండి అంది రేణుతో. ఇద్దరూ కాంటిన్ కివెళ్లి టిఫిన్ చేశారు. ఆ కాంటిన్‌లో శుభ్రంలేదు - ఈగలు బాగా వున్నాయి. పదార్థాలు రుచిగా కూడా లేవు - ఇంకెప్పుడూ ఈ కాంటీన్‌లో టిఫిన్ తినకూడదనుకున్నారు ఇద్దరూ.

హడావుడిగా క్లాసుకెళ్లేసరికి రమేష్‌పాఠం మొదలెట్టబోతున్నారు. నిన్నటి ప్రశ్న మళ్లీవేశారు. నీళ్లను కొండమీది నుంచి కిందికి ఎందుకు తీసుకురావాల్సి వచ్చింది? దూరంగాఉన్న చెరువునుంచి కాలవ తవ్వటమో, పల్లంనుంచి ఎత్తుమీదికి నీళ్లను మళ్లించటమో ఎందుకు ఎన్నుకోలేదు? బోర్డుమీద చాక్ పీస్‌తో గీశారు. నీళ్లు ఇలా పైనుంచి కింద పడుతున్నపుడూ, ఇలా ప్రవహిస్తున్నపుడూ- ఇలాకిందనుంచి పైకి వెళుతున్నపుడూ మనకు ఒకలాగే అనిపిస్తుందా-- ఆభిన్న ప్రవాహదృశ్యాలను చూసినపుడు మన ఫీలింగ్స్‌లో, మన అనుభూతుల్లో ఎలాంటి తేడాలూ వుండవా— అన్ని ప్రవాహాలనూ ఒకేలా చూస్తామా?"

ఈ ప్రశ్నలతో అందరి బుర్రలూ చురుగ్గా పనిచేశాయి. "పైనుంచి కిందికి పడటం ఉత్సాహంగా వుంటుంది"

"ప్రవాహం తొందరగా కదులుతుంది" అంటూ రకరకాల సమాధానాలు చెప్పారు.

"సరళరేఖలా సాగిపోయే కదలిక శాంతికీ, విశ్రాంతికీ సంకేతం— ఆ కదలిక ఆ భావాల్నే కలగజేస్తుంది. అలాగే కిందనుంచీ పైకి పాకే కదలిక శక్తికీ, పట్టుదలకూ, ఎక్స్‌పీరియన్స్‌కూ గుర్తు- పైనుంచి కిందకు పరిగెత్తే కదలిక అలజడికీ, అశాంతికీ, నిలకడలేనితనానికీ, ఉద్వేగానికీ గుర్తు— ఆ కదలిక అలాంటి అనుభూతుల్ని కలిగిస్తుంది. ఇప్పుడు కాలవ తవ్వేవాళ్లందరిలో ఈ భావాలు వున్నాయి. ఆ భావాలన్నీ ఒక తారాస్థాయికి చేరుకుని చివరకు అంతులేని వుత్సాహంగా మారిపోతాయి. ఈ నీళ్లుకూడా ఒక మహాప్రవాహంలా పొలాల్లోకి ప్రవేశిస్తాయి. అప్పటిదాకా ఎంతో ఆరాటంతో, అలజడితో సాగినపని ఒక మహోత్సాహంతో ముగుస్తుంది. ఆ మొత్తం అనుభూతిని కలిగించటానికి కొండమీదనుండి నీళ్లు కిందకివ

చ్చి ఒక ప్రవాహంగా మారటం ఎంతో అనుకూలంగా వుంటుంది. నేను చెప్పాను గదా- సినిమాలో ఏదీ అనాలోచితంగా, ఏదోపిచ్చి పిచ్చి కారణాలు చెప్పుకునేలా జరగదని- ప్రతిదీ పద్ధతిగా, ప్లానుగా, సకారణంగా జరుగుతుంది''

సురేష్ పాఠంఆపి ఇంకో సినిమా చూపించారు. అది పదినిమిషాల సినిమా. 'హాపీ యానివర్సరీ'. కలర్‌సినిమా కాదు. సినిమా ప్రారంభమవుతూనే చక్కని సంగీతం మధురంగా వినిపిస్తుండగా గుండ్రని చిన్నటేబిల్ కనిపిస్తుంది. ఆ టేబిల్‌మీద ఫ్లవర్‌వేజ్ తప్ప ఏమీలేవు. సున్నితంగా అందంగావున్న చేతులు చాలా జాగ్రత్తగా ఆ టేబిల్‌మీద రెండు ప్లేట్లనీ, గ్లాసులనీ, స్పూన్లూ ఫోర్కులనీ పాత్రలనీ సర్దుతాయి. ప్రతి కదలికా అందంగా వుంటుంది. ప్రతివస్తువునీ ఎంతో పొందికగా ఆ టేబిల్‌మీద పెడతాయి. చివరిగా రెండు స్కాచ్ సీసాలను పెడుతుండగా ఆమె కన్పిస్తుంది. నల్లని గౌనులో ఆమె శరీరం తెల్లగా కాంతులీనుతుంది. ఆమె ఎంతో జాగ్రత్తగా అలంకరించుకుంది. చివరిగా ఒక అట్టపెట్టె లోని చిన్న కానుకని కూడా టేబిల్‌మీదపెట్టి టైమ్ చూసుకుంటుంది. ఆ తర్వాత సీన్‌లో ఒక యువకుడు ఒక షాపునుంచి హడావుడిగా బైటకొస్తాడు. అతనిచేతులనిండా పాకెట్లు. అవన్నీ కారులో పడేసి కారునడపబోతాడు. ఆ కారుకి ముందూ వెనకా అన్నీకార్లు-- ముందతన్ని కారుతియ్యమని హారన్‌కొడతాడు. అతను పక్కనున్న బార్బర్ షాపులో గడ్డానికి తెల్లగా క్రీమ్‌పూసుకుని గడ్డంచేయించుకుంటుంటాడు. అతను పీటర్ వేసిన కేకలకు బైటకొచ్చి కారు అడ్డంతీద్దామని తీసి మళ్ళీ వచ్చేసిరికి అతనికి స్థలం దొరకదు. అతనే మళ్ళీ ముందుకెళ్లి ట్రాఫిక్ జామ్‌లో ఇరుక్కుంటాడు. పీటర్ కొన్న చక్కని పూలగుత్తిలోని పూవులన్నీ ఆ ట్రాఫిక్‌జామ్‌లో నలిగి రాలిపోతాయి. పీటర్ ఆ జామ్ నుంచి ఎలాగైనా బైటపడాలని ప్రయత్నిస్తుంటాడు. అక్కడ-- జోన్ పీటర్‌కోసం ఎదురుచూస్తుంటుంది. క్షణక్షణానికీ అసహనం పెరిగిపోతుంటుంది. ఆకలితో, అసహనంతో- ఓర్పు నశిస్తుంది.

పీటర్ ఒకచోట బైటపడితే మరోచోట ట్రాఫిక్‌లో ఇరుక్కుంటున్నాడు. పీటర్‌లా హడావుడిగా బైటపడాలనుకునేవాళ్లు కొందరైతే ట్రాఫిక్ జామ్‌కు అలవాటైపోయి కారులోపలే అన్నిపనులూ చేసుకుని టైమ్ సద్వినియోగపరుచుకునే వారు మరికొందరు.

అష్టకష్టాలుపడి పీటర్ ఇల్లు చేరాడు. హడావుడీ అసహనం ఇప్పుడులేవు. ఎలాగోలా ఇల్లు చేరిన తృప్తితో నెమ్మదిగా లోపలికి వచ్చాడు. డైనింగ్ టేబులంతా అస్తవ్యస్తం— ఉదయాన అమర్చిన టేబిల్ ఇదేనా అనిపించేంత ఘోరంగా వుంది. జోన్ తిని తాగి ఆ టేబిల్‌మీదే తలపెట్టి నిద్రపోతోంది. పీటర్ నెమ్మదిగా జోన్ పక్కనే కూర్చుని కేక్ తినబోవటంతో సినిమా అయిపోయింది. చూస్తున్నంతసేపూ నవ్వొచ్చినా రేణుకు చివర్లో ఉసూరుమనిపించింది. హాస్యం, బాధా రెండూ కలగలిసిన ఫీలింగు రప్పించిన ఆ సినిమా గురించీ; దాని స్క్రిప్టు రాయటంలో వున్న పద్ధతి గురించీ; అందులో వున్న సంగీతం గురించీ రమేష్ వివరంగా చెప్పారు.

జోన్ వేసుకున్న గౌను నల్లరంగే ఎందుకుండాలి? వాళ్ళ డైనింగ్‌టేబిల్ గుండ్రంగానే ఎందుకుండాలి? ఇలాంటి ప్రశ్నలడిగారు- జోన్ శరీరపు మృదుత్వాన్నీ, కాంతినీ ఆరోజు ఆమె ప్రత్యేకంగా తయారైన తీరునీ నల్లగౌను అయితేనే బాగా ప్రతిబింబిస్తుంది. ఆమె స్కిన్‌టెక్చర్ స్పష్టంగా తెలుస్తుంది. అలాగే ఆ చిన్న గుండ్రని టేబుల్‌ని చూడగానే అది ఇద్దరికోసం, చాలా ప్రైవసీ కావాల్సిన ఇద్దరికోసం తయారుచేసిందని తెలుస్తుంది. అలాగే టేబుల్‌మీద వున్న ప్రతి చిన్నవస్తువూ ఉప్పువేసివున్న చిన్న గిన్నె దగ్గర్నించి ప్రత్యేకంగా ఒక చక్కని సందర్భంకోసం అమర్చబడినట్లు తెలుస్తుంది. వేరువేరు సందర్భాలలో వాడిన నేపథ్యసంగీతం ఆ వాతావరణానికి చక్కగా సరిపోయింది. ఇలా ఆ సినిమానీ, ఆ సినిమా స్క్రిప్ట్‌ప్లానింగ్‌నీ వివరంగా చర్చించారు. రెండోసారి,మూడోసారి కూడా ఆ సినిమా చూసి ప్రతి చిన్నవిషయాన్నీ ప్రత్యేకంగా గమనించారు. పెద్దనగరాల్లో ప్రజల జీవితం ఎంతయాంత్రి




కంగా వుంటుందో మనుషులకున్న సున్నిత మైన అనుభూతులను నగరం ఎలా చంపే స్తుందో, మానవ జీవితంలో విషాదం, నిస్సహా యత్వం ఎలా వుంటాయో, అన్నీ ఆ పదినిమి షాల సినిమాలో దర్శకుడు చూపించిన తీరు అర్థమయ్యేసరికి రేణుకు చాలా ఆశ్చర్యమని పించింది. సినిమాని ఇంత సునిశితంగా చూ డాలని కూడా రేణుకు ఇప్పుడే తెలిసింది.

ఆ అనుభూతినుంచి తేరుకోకుండానే "జూ" అనే డాక్యుమెంటరీ సినిమా చూపిస్తు న్నామన్నారు రమేష్.

వెనక కుర్చీలలోంచి- "హాన్స్ట్రా-రియల్లీ వండర్‌ఫుల్", "ఐ లవ్ హాన్స్ట్రా," "వాట్ ఎ బ్యూటిఫుల్ డైరెక్టర్" అంటూ కొందరు సంతో షంతో కేరింతలు కొట్టారు.

'హాన్స్ట్రా' డైరెక్టరనీ, మంచి డాక్యుమెంటరీ లు తీశాడనీ రేణుకు అర్థమయింది. రేణుకు ఇంతకుముందు సినిమాలు చూడటం తప్ప డైరెక్టర్లనీ, టెక్నీషియన్లనూ, వారివారి ప్రతిభల నూ ప్రత్యేకంగా గుర్తుపెట్టుకోవటం అలవాటు లేదు. హాన్స్ట్రా సినిమాలుచూసే అవకాశం తనకులేదు అన్న విషయం మర్చిపోయి ఆయన సినిమాలు ఇంతవరకూ చూడ నందుకు చాలా విచారించింది. సినిమా మొద లయ్యింది. 'జూ'- జూలో జంతువులు 'జూ'ని చూడటానికి వచ్చిన మనుషులు. జంతువుల నూ, మనుషులనూ, విడివిడిగానూ, కలిపీ, రకరకాల పద్ధతుల్లో చూపించిన తీరూ, కె మేరా వుపయోగించిన తీరూ, ఎడిట్‌చేసిన తీరు ఎంతబాగున్నదంటే-డైరెక్టర్ ఏమి ఆశించాడో అది నెరవేరింది. ఒక్కమాట, వ్యా ఖ్య లేకుండా ప్రేక్షకులకు డైరెక్టర్ ఆశించిందే మిటో అర్థమయింది. ఏది 'జూ'?మనుషులు న్న వెలుపలి ప్రదేశమా- జంతువులున్న ప్రదే శమా? ఎవరు జంతువులు? ఎవరు మనుష లు? మనుషులకూ, జంతువులకూ తేడాఏమిటి? మానవత్వం పశుత్వం కంటే గొప్పగా వుందా లేదా? మనుషులు జంతువుల ను చూసి ఆనందిస్తున్నారా- జంతువులు మనుషులను చూసి ఆనందిస్తున్నాయా- మనుషులు కూడా 'జూ'లో జంతువుల్లా బతు కుతున్నారా?

ఈ ప్రశ్నలు, ఈ భావాలు అన్నీ ప్రేక్షకుల ను ఆలోచింపజేస్తాయి.

ఈ చిన్న సినిమాను రెండుసార్లు చూసేసరి కి ఒంటిగంటన్నరయిపోయింది. అందరూ గో లగోలగా మాట్లాడుకుంటూ హాస్టల్‌వైపు నడిచా రు. రెండున్నరకు మళ్ళీ క్లాసు. గబగబా భోజనాలు చేస్తున్నారు. కొందరు ఇళ్ళదగ్గ ర్నించి వచ్చిన ఉత్తరాలు చదువుకుంటున్నా రు. అప్పుడే వీళ్ళకు ఉత్తరాలెవరు రాశారా అని ఆశ్చర్యపోయింది రేణు. రవి వుంటే తనకూ వచ్చేదే-తనను రైలు ఎక్కించగానే రాసి వెంటనే పోస్ట్‌చేసేవాడు. అసలు రవి వుంటే ఇద్దరం కలిసే వచ్చేవాళ్ళం-

రేణు మళ్ళీ దిగులుగా కూచుంది. ఎదురు గావున్న చపాతీ, శనగల కూరా పచ్చిదోసకాయ ముక్కలూ చూస్తే దిగులు మరీ పెరిగింది.

"తినకుండా ఏమిటాలోచిస్తున్నారు?" మంజరి ప్రశ్నకు తలెత్తింది.

"బెంగగావుందా ఇంటిమీద-నేనూ మా అమ్మనొదిలి ఇన్ని రోజులెక్కడా వుండలేదు. ఆనంద్ వున్నాడుగనుక వుండగలననుకుంటు న్నాను"

"ఆనంద్ ఎవరు?"

"నా ఫ్రెండ్-క్లాసులో నా పక్కే కూచుంటా డు". రేణు గుర్తుతెచ్చుకోటానికి ప్రయత్ని స్తుండగా టేబుల్‌కి ఆ చివర కూచున్నావిడ గట్టిగా అరుస్తున్నట్లు మాట్లాడటంతో అటు చూసింది. షాల్‌కప్పుకుని వున్న ఆవిడ అంటోంది "ఎందుకు నాకోసం రావటం? నీ టైమ్ దండగ- నేను శుభ్రంగా వున్నాను- వెళ్ళింక"

పక్కనే పదిహేడేళ్ళ అబ్బాయి నవ్వుతూ ఆమె తలమీద ముద్దుపెట్టుకుని వెళ్ళిపోయా డు.

"మా అబ్బాయి... ఇంటర్ సీనియర్‌చదు వుతున్నాడు. కలకత్తా నుంచి బొంబాయికి మేమిద్దరం, వాళ్ళనాన్నా కలిసి వచ్చాం. నిన్న బొంబాయినుంచి నేనొక్కత్తినే ఇటొచ్చాను. ఇవాళ మధ్యాహ్నానికి వీడు తయారు- నేను క్షేమంగా చేరానో లేదో ఎలా అడ్జస్ట్అయ్యానో కనుక్కోటానికి వచ్చాడట" ఆవిడ ఆయాసప

డుతూ ఆగింది.

"మనకోసం అంత ఆలోచించి, శ్రద్ధచూపించి ప్రేమించే వాళ్ళుండటం ఎంత బాగుంటుంది" ఆవిడ పక్కన కూచున్న ఓ తెల్లటి అమ్మాయి అంది.

షాల్ కప్పుకున్న ఆవిడముఖం కోపంతో ఎర్రబడింది.

"మనకోసం ఆలోచించటం, శ్రద్ధచూపించటం నాన్‌సెన్స్-ఐ హేట్ ఇట్-నాకు చాలా కోపం అలావుంటే. నా బాగోగులూ, నాక్షేమం నేను చూసుకోగలను. వీళ్ళెవరికీ నామీద, నా శక్తిమీద విశ్వాసం లేదు. వీళ్ళశ్రద్ధ, నాగురించి చూపించే జాగ్రత్తా ఇవన్నీ చూస్తుంటే నాకేమీ చేతకాదనీ, నేనెందుకూ పనికి రానిదాన్నని వీళ్ళనుకుంటున్నారా- అని పిస్తుంది. బొంబాయిలో రైలెక్కించారు- పూనాలో దిగి ఇక్కడికి రాలేనా- వచ్చాక అందరూ ఎలాగో నేనూ అలాగే. ఏమిటి వాళ్ళు నా గురించి ఆలోచించేది- నా మానాన నన్నొదిలి నా బతుకు నన్ను బతకనిస్తే చాలు-" ఆవిడ ఆవేశంతో మాట్లాడుతుంటే రేణు విస్తుపోయి వింటూవుంది.

భర్తా, కొడుకూ ఆమెగురించి పట్టించుకుంటుంటే ఆమెకెందుకంత చిరాకు? ప్రేమవున్నవాళ్ళు పట్టించుకోరా-ఎలాగోలా బతుకుతారులే అని వూరుకుంటారా-తనెప్పుడన్నా అన్నయ్యావాళ్లవూరు వెళితే రవి ప్రతిరోజూ ఫోన్ చేసి లక్షజాగ్రత్తలు చెప్పేవాడు. తననిక్కడ రైలు ఎక్కించి అక్కడ అన్నయ్య స్టేషన్‌కి వస్తాడని నమ్మకంగా తెలిసినా ఒక్కతివే వెళ్తున్నావు ఎలా-ఎలా-నాకు భయంగా వుందీ అంటూ వూరికే వర్రీ అయేవాడు. తనకు రవి అలా వర్రీ అవుతుంటే నవ్వుగా, తమాషాగా అనిపించేదిగానీ బాగుండేది. తనకోసం రవి అలాగే అంత జాగ్రత్తగానూ ఆలోచించాలని పించేది. ఈవిడేమిటి ఇలా అంటుంది- ఆలోచిస్తూనే చపాతి తిని గదిలోకి వెళ్ళింది. ఉమా, గమనా పడుకుని రిలాక్స్ అవుతున్నారు.

"మాధవిగారి మాటలు విన్నారా?" అంది గమన.



"మాధవిగారెవరు?" రేణు అడిగింది.

"డైనింగ్‌హాల్లో మన టేబిల్ చివర కూర్చున్నారు. వాళ్లబ్బాయి వస్తే వినుక్కున్నారు. ఆవిడ పేరు మాధవి. కలకత్తానుంచి వచ్చారు. మన పక్కరూంలోనే వుంటున్నారు"

"ఔను... ఆవిడ మాటలు చాలా ఆశ్చర్యమనిపించాయి. వాళ్లకు ఆదుర్దా వుంటుందిగదా- ఈవిడ అంత మండిపడ్డారెందుకు?" అంది రేణు.

"ఆఁ... ఈ రోజుల్లో ఇదొక ఫాషను" అంటూ ఉమ ఏదేదో హిందీలో గడగడా మాట్లాడుతుంటే గమన మధ్యలో ఆపేసింది.

"అదికాదు- వీళ్లు ఆడవాళ్లు. వీళ్ల బాగోగులు వీళ్లు చూసుకోలేరు. అంతటి శక్తి వీళ్లకు లేదు. ఎవరో ఒకరు వీళ్లను మోసంచేసేస్తారు. ఏమీ తెలియని అమాయకులు అనుకుంటారు మన మగవాళ్లు. నాన్నో, అన్నో, తమ్ముడో, భర్తో, కొడుకో- ఎవరో ఒకరు నిత్యం మనవెంట వుండి మన బాగోగులు చూస్తారు. అది మన

 



కెంత అవమానం. మనం అవిటివాళ్లం కాదు. పెద్ద చదువులే చదివాం. ఇక్కడిదాకా వచ్చామంటే అంతో ఇంతో మేధావులమే. వాళ్ల రక్షణ దేనికి మనకు- మనం అవిటివాళ్లమనే భావం కలిగించటానికి కాకపోతే. నాకు మాధవి గారి మాటలు నచ్చాయి''

ఉమ ముఖం నల్లగా చేసుకుని మాట్లాడకుండా కూచుంది.

రేణు ఆలోచిస్తోంది.

అతిప్రేమ, అతిగా పట్టించుకోవటం మనిషిని చేతగానివాళ్ళుగా, పిరికివాళ్ళుగా చేస్తాయి. రవితో పెళ్లికాకముందు తనకున్న ధైర్యం ఈ అయిదేళ్లలో తగ్గిందా? పెళ్లికాకముందు తన ధైర్యం, ఉత్సాహం చూపించటానికి కాలేజీ స్నేహితులూ వాళ్లతో కలిసి అటూ ఇటూ తిరగటం- ఇవన్నీ వుండేవి. పెళ్లయ్యాక ఉద్యోగం, రవీ ఇదే ప్రపంచమయింది. ఇల్లూ, ఆఫీసూ, సినిమాలూ, షికార్లు. ఆఫీసుకి కూడా ఇద్దరూ కలిసి వెళ్లేవాళ్లు; కలిసి వచ్చేవాళ్ళు. అయిదేళ్లు అలా అలవాటవడం వల్ల ఒక్కతే వూనా రావటానికి భయంవేసిందా?

గమన మాటల్లో ఆలోచించటానికి ఏదో వుందనిపించింది రేణుకు.

ఉమ లిప్‌స్టిక్ దిద్దుకుని క్లాసుకు బయల్దేరింది. గమన అప్పుడు తాపీగా సిగరెట్ వెలిగించింది.

''మీరు కూడా స్మోక్ చేస్తారా?'' రేణు ఆశ్చర్యంగా అడిగింది.

''చాలా తక్కువ- ఎక్కువగా రాత్రిపూట ఇంట్లో- నా రూంలోనే కాలుస్తాను. క్లాసులో సిగరెట్ తాగటం నాకంత ఇష్టం వుండదు''

''అవునుగానీ- వాళ్ళిద్దరి పేర్లూ నాకు తెలియవు గాని ఆ నల్లటమ్మాయి, తెల్లటమ్మాయి క్లాసు జరిగినంతసేపూ కాలుస్తూనే వుంటారు. నాకు చాలా చిరాకనిపిస్తుంది. నాకు లెక్చరర్స్ కాల్చటమే వింతగావుంటే స్టూడెంట్స్ కూడా క్లాసులో సిగరెట్ తాగటం-''

మరింత ఆశ్చర్యంగా అంది రేణు.

''ఆ నల్లటమ్మాయి పేరు బీనా. ఆమె

లెక్చరర్. తెల్లటమ్మాయి పేరు రజనీ. ఢిల్లీలో లెక్చరర్. బొంబాయినుంచి వచ్చిన వర్ష, తనూజా వీళ్లూ కాలుస్తారు''

రేణు వాళ్లపేర్లు గుర్తుపెట్టుకుంది.

''ఇప్పుడు హేమంత్‌కుమార్‌గారి క్లాసు గదా'' అంది గమన.

అవునని ఫైలుతీసి టైంటేబుల్ చూసింది రేణు.

ఇద్దరూ క్లాసుకి బయల్దేరారు.

క్లాసు బయటే ఆరోజు హేమంత్‌గారి క్లాస్ కాన్సిల్ అయిందని తెలిసింది. నిరాశపడుతూ కూచున్నారు.

రమేష్ వచ్చి, ''ఇప్పుడు మూడు చిన్న సినిమాలు చూద్దురుగాని- సినిమాలు చూశాక మీరంతా మూడు గ్రూపులుగా విడిపోయి ఆ సినిమాల గురించి చర్చించి, మీ అభిప్రాయాలు చెప్పాలి. ఒక్కో గ్రూపునుంచి ఒకరిద్దరు చెప్పవచ్చు. ముందు మూడు గ్రూపులవ్వాలి. వరసగా వన్, టూ, త్రీ మళ్లీ వన్, టూ, త్రీ అని నంబర్స్ పలకండి. వన్‌నంబర్‌వాళ్ళు మొదటి గ్రూపు, టూ నంబర్‌వాళ్లు రెండోగ్రూపూ, త్రీ నంబర్ మూడోగ్రూపు- కమాన్''

క్లాసంతా కాసేపు వన్ టూ త్రీలతో సందడి సందడయింది.

''మీరేం గ్రూపో గుర్తుంచుకోండి. ఇక సినిమాలు చూడండి''

క్లాసంతా చీకటయిపోయింది. మొదటి సినిమా పేరు ''ది అదర్‌సైడ్'' (అవతలి వైపు). సినిమా మొదలవుతూనే వందలాది మనుషులు ఒక గోడవెంబడే నడుస్తుంటారు. గోడవైపు ముఖంపెట్టి రెండు అరచేతులతో గోడను తాకుతూ- ఎదురుగా వున్న గోడను తప్ప మరేమీ చూడకుండా ఒక్కొక్క అడుగే మెల్లిగా వేస్తూ గోడవెంబడే నడుస్తుంటారు. అలా నడిచీనడిచీ ఇక ఈ నడకకు అంతు లేదా అనిపించినప్పుడు ఒకడు ఆ లైన్‌లో నుంచి బైటికివస్తాడు. వెంటనే తుపాకీ మోగుతుంది. అతను పడిపోతాడు. జనం కదులుతూనే వుంటారు. ఇంకాసేపటికి ఇంకొకడు వస్తాడు. మళ్ళీ తుపాకీ మోగుతుంది. అతను పడిపోతాడు. జనం కదులుతుంటారుగానీ అశాంతి పెరుగుతుంది. ఇంకొకడు, ఇంకొకడు, ఇంకొకడు ఈసారి పదిమంది- తుపాకులు మోగుతూనే వున్నాయి. జనం పడిపోతున్నారు. గోడపక్కనవాళ్లంతా గుంపులుగుంపులుగా వీధి మధ్యలోకి వస్తూనేవున్నారు. ముందు వరసలోవాళ్లు పడిపోతున్నారు. వెనకవాళ్లు ముందుకి వస్తున్నారు. వీధంతా శవాలమయం అయిపోతోంది. జనం ఆగటంలేదు. ముందుకి మునుముందుకి వెళుతున్నారు. ఇంతలో ఒకడు హఠాత్తుగా గోడను చేరాడు. మళ్ళీ గోడవెంబడి నడక మొదలుపెట్టాడు. వాడిని చూసి ఇంకొకడు... మరొకడు... మరొకడు... వరసగా వచ్చేస్తున్నారు. అయిదు నిమిషాల్లో అందరూ గోడవెంబడి వచ్చి నడుస్తున్నారు. వీధిమధ్య శవాలు తప్ప మనుషులు లేరు. తుపాకీ మోతలు లేవు. అంతా ప్రశాంతంగా వుంది- శ్మశానప్రశాంతి. మెల్లిగా జనం అడుగులు వేస్తున్నారు.

సినిమా అయిపోయింది. క్లాసంతా నిశ్శబ్దం. రేణుకు బుర్రంతా బరువుగా అయిపోయింది. ఇదేం సినిమా- ఒక కథలేదు. మాటలు లేవు. పాటలు లేవు. అలాగని డాక్యుమెంటరీ కాదు. కథలేదని అనుకోవటమేగాని సినిమా ఎంత కథను చెప్పింది. నియంతల చరిత్ర, జనం తిరుగుబాటూ, కొన్ని త్యాగాలూ, కొంత విజయం మళ్ళీ మామూలు అణిచివేత- ఇదంతా ఈ పదిహేను నిమిషాల్లో చూపించారే.

ఇంకో సినిమా మొదలెట్టటానికి ముందు అయిదు నిమిషాలు వ్యవధానం ఇచ్చారు. ఐదు నిమిషాలూ ఎవ్వరూ నోరు విప్పలేదు. అందరి బుర్రలూ ఆలోచనల భారంతో వంగిపోయాయి.

మరో సినిమా ''గ్లాస్'' అనే డాక్యుమెంటరీ సినిమా. గాజు పరిశ్రమ మెషిన్స్ రాకముందు ఎలా ఉందీ, మెషిన్స్ వచ్చాక ఎలావుందీ అన్నది చూపించారు. గాజు పరిశ్రమలో కార్మికులు పనిచేస్తుంటే వారి కదలికల్లోంచి సంగీతం వస్తోందా అన్నంత సహజంగా మధురంగా ఉంది సంగీతం. మెషిన్లు రాకముందు




కార్మికుల్లో ఒక పనిపూర్తి చెయ్యగానే కలిగే ఆనందం పూర్తివస్తువును తామే సృష్టించామనే సంతృప్తి, ఆ వస్తువుమీద కలిగే ప్రేమ ఇవన్నీ ఎంతో స్పష్టంగా చిత్రీకరించాడు దర్శకుడు. అలాగే మెషిన్లు వచ్చాక కార్మికులకూ, ఉత్పత్తి అయ్యే వస్తువుకూ మధ్యదూరం పెరగటం, దానివల్ల కార్మికుల్లో కనపడే నిరాసక్తతా, పనిలోనూ, ఉత్పత్తి అయ్యే వస్తువుల్లోనూ కనపడే మొనాటనీ- వీటిని చాలా వివరంగా చూపించాడు. ఐతే యంత్రాలు వచ్చాక గాజు సామాన్లు ఎక్కువ ఉత్పత్తి కావడం, ఉపయోగపడే వస్తువులకు ఎక్కువ ప్రాధాన్యత రావటం కూడా దర్శకుడి దృష్టిని దాటిపోలేదు. చిత్రం పూర్తయ్యేసరికి అందరికీ ఏమిటో తెలియని సంతోషం మనసుల నిండా నిండింది.

మూడో సినిమా మొదలయింది. ఆ సినిమా పేరు "అర్థగీతలు". తెరమీద గీత- తెర వెనుక సన్నని సంగీతం మధురంగా. ఒక గీత రెండై, రెండు మూడై, నాలుగై, ఎనిమిదై, పదహారై అటూఇటూ కిందకూ, పైకీ సంగీతానికనుగుణంగా కదులుతూ, ఒకదానినొకటి తాకుతూ, ఒక దానిలో ఒకటి కలిసిపోతూ, ఒకదాని నుంచి ఇంకోకటి పుడుతూ రంగురంగుల గీతలు- అదేమి కదలిక- అదేమి సంగీతం- అదేమి సినిమా.

రేణే కాదు. ఎవరూ ఆ సంభ్రమం నుంచి త్వరగా తేరుకోలేక పోయారు. అర్థంకాని అనుభూతితో శరీరమూ, మెదడూ పులకించిపోయాయి. మనసేదో చాలా భారమైపోయి హఠాత్తుగా తేలికైపోయినట్లయింది. తెలియని చిక్కుముడులేవో చిక్కగా అల్లుకుని క్రమక్రమంగా ఒక్కొక్కటే విడిపోయినట్లుంది మెదడుకు.

"మీరు గ్రూపులుగా విడిపోయి చర్చించండి" అన్నారు ప్రొఫెసరు.

రేణు రెండవ గ్రూపువాళ్ళంతా చేరిన చోటికి వెళ్ళింది.

"మనం క్లాసులో కూచో వద్దు. బైట ఆ చెట్లకింద కూచుందాం" అంటూ ఆ గ్రూపును నడిపించాడొక అబ్బాయి.

రేణు వాళ్ళవెనకాలే నడిచింది. ముందు అందరూ ఒకరి నొకరు పరిచయం చేసుకున్నారు. చిన్నగ్రూపు గనుక ఒకరికొకరు బాగా తెలిశారు. తర్వాత ఒక్కొక్క సినిమా మీదా చర్చ మొదలెట్టారు. 'అదర్‌సైడ్' అన్న సినిమా గురించి అవినాష్‌శర్మ చాలా బాగా చెప్పాడు. "ఈ సినిమా రాజ్యం గురించీ, రాజ్యాధికారాన్ని గురించీ తీశారు. రాజ్యం స్వభావం అణిచివేత, ప్రజల్ని గుడ్డిగా నడిపించటం, వాళ్ళ అధికార చట్రాన్ని ధిక్కరించిన వాళ్ళను చంపటం. ఇదే రాజ్యం చేసేపని. ఈ రాజ్యానికి సినిమాలో ఒక స్వరూపం లేదుగానీ, స్వభావం ఉంది. ఏ రూపంలో ఉన్నా దానిస్వభావం అణచివేతే- ఈ విషయాన్ని దర్శకుడు తుపాకుల చప్పుడు తప్ప కాల్చే వ్యక్తులను చూపించకపోవటం ద్వారా చెప్పాడు. అలాగే జనం- ఒక నాయకుడు పోరాటానికి సిద్ధమయితే అతని వెనుక నడుస్తారనీ, పోరాటం ఆపి వెనక్కు నడిస్తే అతని వెనక పడతారనీ కూడా ఈ సినిమా చెప్పింది. నాయకత్వం ప్రజల్ని నడిపించటంలో ప్రధానపాత్ర వహిస్తుందనే విషయాన్నీ ఎవరో ఒకరి వెనక నడవటానికి సిద్ధమయ్యే గుంపు మనస్తత్వాన్ని కూడా చిత్రించింది" అని చెప్పాడు. దాదాపు అందరూ అతని అభిప్రాయాన్ని ఆమోదించారు.

'గ్లాస్' సినిమా గురించి కొంత చర్చ జరిగింది. దర్శకుడు యంత్రాలను నిరసిస్తున్నాడనీ, దర్శకుడు యంత్రాలను, ఆ నాగరికతనూ సపోర్టు చేస్తున్నాడనీ వాదించుకున్నారు. బీనా మాత్రం దర్శకుడు హాన్‌స్ట్రా అసలు ఒక విషయాన్ని సపోర్టు చేస్తూగానీ, విమర్శిస్తూగానీ ఎప్పుడూ సినిమా తియ్యడనీ, అతను వాస్తవాన్ని చిత్రీకరించి వదిలేస్తాడనీ గట్టిగా వాదించింది. 'గీతల' సినిమా మీద ఎవరూ సరిగా చెప్పలేకపోయారు. ఆ సినిమా చాలా బాగుందని అందరూ అన్నా ఆ సినిమా ఏంచెబుతోంది- అన్న విషయం ఎవరూ నిర్ధారించి చెప్పలేకపోయారు.

మిగిలిన రెండు సినిమాల గురించి మౌనంగా ఉన్న రేణు ఈసారి రెండు ముక్కలు మాట్లాడింది.

"ఏదో ఒక ఐడియాను, ఆలోచననూ చిత్రీకరించారేమో అనిపించింది. ఆ ఆలోచన బీజ



రూపంగా మొదలవటం దగ్గర్నించీ క్రమంగా పెరిగి పెద్దదై అనేక వైరుధ్యాలలోపడి వాట న్నింటినుండీ బైటపడి చివరకు ఒక చక్కటి సిద్ధాంతంగా రూపొందటంవరకూ చిత్రించా రేమో అనిపించింది'' అన్నది. అందరూ రే ణునూ మెచ్చుకోలుగా చూశారు.

రేణు సైన్సు చదవటం వల్ల ఒక పరిశోధకు డి అంతర్మథనం, ఒక సిద్ధాంతం రూ పొందించేక్రమంలో అతను పడే స్ట్రగుల్ ఆ సినిమాలో చూడగలిగింది. రాకేష్ అనే అబ్బాయి ఆ సినిమాలో కవిత్వాన్ని చూడగలి గాడు. దినకర్ చిత్రకళను చూడగలిగాడు. తర్వాత మూడు గ్రూపుల చర్చల సారాన్నీ విని అభినందించిన ప్రొఫెసర్ రమేష్ ఆ గీతల గురించి మాట్లాడుతూ

ఏ భీమ్‌సేన్ జోషీనో, ఏ బాలమురళీకృష్ణో ఒక రాగాన్ని అలవోకగా ఆరంభించి నెమ్మదినె మ్మదిగా దానిని ఆరోహణా, అవరోహణా క్ర మంలో ముంచెత్తి దించినట్లుందని వర్ణించా డు.

ఐదింటికి అందరూ చాలా సంతోషంగా క్లాసురూం నుంచి బైటపడ్డారు. అరగంటలో మళ్ళీ థియేటర్‌లో సినిమా ఉంది. గబగబా రూములవైపు నడిచారు.

సాయంత్రం 'రాధాకృష్ణ' అనే డాక్యు మెంటరీ, 'బైసికిల్ థీవ్స్' అనే ఇటలీ సినిమా చూసి డిన్నర్‌కి వచ్చింది రేణు. చాలా అలస టగా, ఆకలిగా అనిపించింది. గబగబా నాలు గు చపాతీలు తిని, గ్లాసు మజ్జిగ తాగి రూంకి వెళ్ళి పడుకుంది. ఉమ షాపింగుకి వెళ్దామా అని అడిగితే రాలేనని చెప్పింది. ఉమా, గమనా హిందీలో ఏదేదో మాట్లాడుకున్నారు. గమన రేణు దగ్గరకు వచ్చి ''మనకు రోజూ ఉదయం టిఫిన్ సమస్యగా ఉంటోంది. బజా రుకెళ్ళి బ్రెడ్డు, బిస్కట్స్, పళ్ళూ తెచ్చుకుంటే బాగుంటుంది. ముగ్గురం కలిసి తెచ్చు కుందాం'' అంది. రేణుకిక తప్పలేదు. అప్పటి కి ఎనిమిది దాటింది. తొమ్మిదిన్నరకి మళ్ళీ సినిమాకు వెళ్ళాలి. హడావుడిగా కర్వే రోడ్డుకి బయల్దేరారు. ఉమ, గమన హిందీలో మాట్లా డుకుంటుంటే రేణు వింటూ నడుస్తోంది.

''మీరు కూడా హిందీలో మాట్లాడాలి'' అంది గమన నవ్వుతూ.

''నాకసలు రాదు... మాట్లాడలేను'' అంది రేణు.

షాపింగ్ అంతా వాళ్ళే చేశారు. బ్రెడ్డూ, ఛీజ్, అరటిపళ్ళూ, మూడు గాజు గ్లాసులు, ఇన్‌స్టంట్ టీ పొడరూ, హీటింగ్ రాడ్, పాలపొ డీ- అన్నీ తీసుకుని వచ్చేసరికి తొమ్మిదింబావ యింది. ముఖాలు కడిగి తయారై థియేటర్‌కి వెళ్ళారు.

రాత్రి పన్నెండు గంటలకు తాను చు సిన ''ఫన్నీఓల్డ్ మాన్'' అనే సినిమా గురించి ఆలోచిస్తూ నిద్రపోయింది రేణు. ఆరోజు తాను రవిగురించి కంటతడి పెట్టకుండా గడిపిన మొదటిరోజని రేణుకు తెలియదు.




ఎవరో ఏదో హడావుడిగా మాట్లాడుతున్నట్లె మెలకువ వచ్చింది రేణుకు. కళ్ళు తెరవబోతే కళ్ళల్లో ఇసకపడినట్లు ఒకటే మంట. బల వంతాన కళ్ళు తెరిచిచూసింది. ఎదురుగా ఉమ టేబిల్‌మీద ఇత్తడి ప్రమిదలో దీపం వెలుగుతోంది. అగరు ఒత్తుల వాసన గదంతా నిండింది. సత్యనారాయణస్వామి ఫొటో ముందు పూలూ, పళ్ళూ ఉన్నాయి. ఉమ ఆ స్వామి వ్రతకథ కాబోలు ఓ పాతపుస్తకం చూ స్తూ గడగడా చదివేస్తోంది హిందీలో.

రేణు ఆశ్చర్యానికి అంతులేదు. ఇక్కడ- ఈ పూనా ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లో ఇదేమిటి? దేవు డిని నమ్మొచ్చు. కానీ ఈ హంగామా ఏమిటి? ఈ పూజలేమిటి? పోనీ దీపం వెలిగించి పూజ చెయ్యొచ్చు- ఆ వ్రతకథలు చదవటమేమిటి- అవన్నీ నిజంగా జరిగాయనీ, ఆ కథలు







# ఆ నొప్పికి
# స్ట్రాంగ్ చికిత్స
# అత్యంతావశ్యం

విపరీతమైన తలనొప్పులు, వొళ్ళునొప్పులు, భరించలేని నరముల తీపులు మరియు బెణుకులు—వీటన్నిటికీ అమృతాంజన్ స్ట్రాంగ్ పెయిన్‌బామ్ వుపశమనము చేకూర్చగలదు.

మీకు సుపరిచితమైన అమృతాంజన్‌లో యిమిడివున్న మూలపదార్థాములే మరింత శక్తివంతంగా సమ్మిళితం చేయబడినాయి అమృతాంజన్ స్ట్రాంగ్‌లో. విపరీతమైన నొప్పులను, బాధలను త్వరితంగా వుపశమింప జేయగలందులకే స్ట్రాంగ్‌గా తయారుచేయబడింది అమృతాంజన్ స్ట్రాంగ్.

**అమృతాంజన**
**స్ట్రాంగ్**

మిక్కిలి బాధాకరమైన నొప్పులకు




అమృతాంజన్ లిమిటెడ్



OBM 831 TG

చదివితే మనకి శుభం జరుగుతుందనీ ఉమ నమ్ముతోందా? ఆ బాబ్డ్ హెయిర్‌కీ, ఆ లిప్‌స్టిక్‌కీ, ఆ మేకప్‌కీ, ఈ భావాలకూ పొంతనేమన్నా ఉందా? పోనీ ఆ కథల్ని కూడా నమ్మమను. అలా పెద్దగా చదవటమేమిటి- ఇతరులకు డిస్టబెన్స్ అని కూడా చూడకుండా. పైగా ఎం.ఎ. చదివింది. లెక్చరర్‌గా పనిచేస్తోంది. హిందీలో పొలిటికల్ కవిత్వం మీద రిసెర్చ్ చేస్తున్నానని చెప్పింది. మరి ఈ మొరటుతనం ఏమిటి?

రేణు ఆశ్చర్యం ఆలోచనల్లోనే ఆగిందిగానీ, గమన ఆశ్చర్యం అలా ఆగలేదు.

"ఉమా... ఏంటి మీరు చేస్తున్నది? టైమింకా ఏడే అయింది. మేమింకా కనీసం ఓ గంటపైగా నిద్రపోవాలి"

ఉమ ఆ మాటలు వినబడనట్టే చదువుకుపోతోంది. గమన చిరాకుపడి మళ్ళీ ముసుగు పెట్టింది. రేణు ఇక నిద్రపట్టదని లేచి బాల్కనీలోకి వచ్చి గులాబీలను చూస్తూనిలబడింది.

పక్కగదిలో ప్రభ స్నానం ముగించి వచ్చి "బాత్‌రూం ఖాళీ అయింది- తొందరగా వెళ్ళండి" అని తరిమింది.

ముఖం కడుక్కుని స్నానం చేసి వచ్చేసరికి గమన లేచి హీటింగ్ రాడ్‌తో టీకి నీళ్ళు కాచింది.

"మన టీ సెషన్‌కు ఇనాగరేషన్" అని నవ్వింది గమన. ఉమ బ్రెడ్డూ, పళ్ళూ తింటోంది.

"నన్ను పూజలో ఉండగా డిస్టర్బ్ చెయ్యొద్దు. నా నమ్మకాలు నావి. ప్రతి గురువారం పూజచేసి ఉపవాసం ఉంటాను. పూజలో నన్ను మాట్లాడించినా నేను మాట్లాడను"

రేణు తనను డిస్టర్బ్ చేసిందన్నట్టు చాలా సీరియస్‌గా చెబుతుంటే గమన అడ్డుపడింది.

"మీతో మాట్లాడింది నేను- ఆమె కాదు. ఐనా మా నిద్రపాడుచేసి మమ్మల్నే అంటారేమిటి?" అంది గట్టిగా.

ఉమ ఏమనుకుందో మాట్లాడకుండా కూచుంది. తనను మెతకగా భావించి దబాయించబోయిన ఉమ స్వభావానికి అసహ్యపడుతూ రేణు టీ గ్లాసు అందుకుంది. గమన రాత్రి పన్నెండయినా సరే పడుకోబోయేముందే ముఖం కడిగి స్నానంచేసి ఫ్రెష్‌గా ఓ గంట ఏదన్నా పుస్తకం చదువుకొని ఏ రెండింటికో పడుకుంటుంది. ఉదయం లేవగానే టీతాగి పళ్ళు తోముకుని సిద్ధమవుతుంది. జీన్స్ వేసుకుంటుందిగనుక రెండు నిమిషాల్లో రెడీ అయిపోతుంది. జుట్టుపైకి దువ్వి పిన్స్‌పెట్టటానికి ఒక నిమిషం చాలు. ఇంకో నిమిషంలో లిప్‌స్టిక్ లైట్‌గా వేసుకుని సరిగ్గా ఐదు నిమిషాల్లో తయారవుతుంది గమన వేషభాషలు రేణుకు బాగా నచ్చాయి.

ఇద్దరూ క్లాస్ రూం చేరేసరికి ప్రొఫెసర్ రమేష్ రానేవచ్చారు. రాత్రి సినిమా గురించీ, జనరల్‌గా సినిమా గురించీ కొంతసేపు చెప్పాక ఇంకో షార్ట్ ఫిల్మ్ చూపించారు.

'సోలో' అనే పర్వతాన్ని ఒకతను తానొక్కడే ఎక్కటం. రేణు ఆ సినిమాలో అంతగా లీనంకాలేకపోయింది. ఆ అబ్బాయికి పర్వతం ఎక్కుతున్నప్పుడు ఒక బండరాతిలో ఉన్న కప్పపిల్ల కనపడుతుంది. దాన్ని తీసి జేబులో వేసుకుంటాడు. పర్వతం ఎక్కి దిగిరాగానే అతను చేసిన మొదటిపని ఆ కప్పపిల్లను కొండ పక్కనే పారుతున్న చిన్న సెలయేటిలో వదిలెయ్యటం. రేణుకు ఆ అంశం చాలా నచ్చింది. పక్కన కూచున్న మంజరితో "ఎంత బాగుందో కదా" అంటే మంజరి కూడా నవ్వి అంగీకరించింది.

సినిమా మీడియం గురించీ, సినిమా భాష గురించీ రమేష్ చెబుతున్న పాఠం వింటుంటే రేణుకు మరింకో ఆలోచన రాలేదు. క్లాసయ్యేసరికి ఒకటిన్నర అయింది. "మీ లంచ్ టైమ్‌లో అరగంట నేను తినేశాను" అంటూ రమేష్ వెళ్ళిపోయారు. రేణూ, మంజరీ కలిసి నెమ్మదిగా డైనింగ్ హాల్లోకి నడిచారు.

కిచన్‌లో నిలబడి తింటోంది ఒకావిడ. ఈవిడను ఎక్కడో చూశాను- ఎక్కడా? ఎక్కడా? అనుకుంటూ చపాతీలూ, కూరా పళ్ళెంలో పెట్టుకుంటూ ఆలోచించింది. ఎవరో గుర్తు రాలేదు.

మంజరితో అన్నది- "ఆవిడను ఎక్కడో చూశాను"




"ఎక్కడో ఏమిటి... సినిమాల్లో చూసుంటారు"

"సినిమాల్లోనా?"

"ఊఁ... ఆవిడ గీత- హిందీ సినిమాల్లో నటిస్తుంది"

"ఓ... గీతా-" రేణు ఆశ్చర్యపోయింది.

"ఆవిడ ఇక్కడికెందుకు వచ్చారు?"

"మన కోర్సు అటెండ్ అవుతారు. లిస్ట్‌లో మీరామె పేరు చూడలేదా?"

"ఆవిడకు ఈ కోర్సెందుకు- ఆవిడ మంచి నటిగదా-"

"నటి అయితే- ఈ జ్ఞానమంతా వుండాలని ఎక్కడుంది. ఇంత మంచి సినిమాలు చూడటం ఎలా సాధ్యపడుతుంది. ఇప్పటికే రెండురోజులు ఆలస్యంగా వచ్చి ఎన్ని సినిమాలు మిస్‌అయిందో- ముఖ్యంగా 'లైన్స్'" అంటూ ఆ సినిమాని గుర్తుతెచ్చుకుని తన్మయత్వంలో మునిగిపోయింది. రేణు మళ్ళీ మళ్లీ గీతకేసి చూసి తన ఆశ్చర్యాన్ని తగ్గించుకుంది.

క్లాసులో వున్నవాళ్లంతా మంచి తెలివిగలవాళ్లు. ఓ పదిమంది పెద్దవాళ్లున్నారు. మిగిలిన వాళ్లంతా యువతీయువకులే. అందరికీ ఏదో ఓ కళలో మంచి ప్రవేశం వుంది. సాహిత్యం బాగా చదివినవాళ్లూ, ఫిలింక్లబ్ మెంబర్లుగా వున్నవాళ్ళూ గాబట్టి ప్రపంచ సినిమా గురించి బాగా తెలుసు. అయినా వాళ్లు చాలా చిన్నపిల్లల్లాగా ప్రవర్తిస్తున్నారనిపించేది రేణుకి.

ఊరికే అరుస్తారు. పెద్దగా నవ్వుతారు. మేధావులిలా వుండరనే నమ్మకం ఏ మూలో వుండి వీళ్లమీద అంత సదభిప్రాయం కలగలేదు. గదికి వెళ్లి మంచంమీద వాలితే వెంటనే నిద్రపట్టింది. రెండున్నరకు గమన హడావుడిగా లేపింది.

ఇద్దరూ పరిగెత్తుతున్నట్టే క్లాసుకి వెళ్లారు.

హేమంత్ అప్పుడే పాఠం మొదలుపెడుతున్నాడు. హేమంత్ పాఠం మొదలెడితే అందరూ అందులో లీనమవ్వాల్సిందే. ఆయన చెబుతున్న విషయం తప్పించి మరింకే విషయం విద్యార్థుల బుర్రల్లోకి రాకుండా చెయ్యగల సమర్థత ఆయనకుంది. ఆయన ప్రపంచ సినిమా చరిత్ర గురించి చెబుతున్నాడు. "సినిమాకు మొదటి ప్రేక్షకులు కార్మికులే. మధ్యతరగతివాళ్లకూ, పైతరగతి వాళ్ళకూ చాలారోజుల వరకు సినిమా నిషిద్ధమే. నాటకాలంటేనే వాళ్లకు గౌరవం. కానీ వాళ్లు సినిమా శక్తిని ఎక్కువకాలం నిరోధించలేకపోయారు. అందుకని వాళ్లు రంగస్థలంమీద ప్రదర్శించే నాటకాన్ని ఉన్నదున్నట్లుగా సినిమా తీశారు. అది ఎలావుంటుందో చూడండి" అంటూ 'ఎలిజబెత్ రాణి' అన్న సినిమాను చూపించారు.

చాలా హాస్యాస్పదంగా వుందా సినిమా. రేణుకు టి.వి.లో చూసే తెలుగు నాటకాలు గుర్తొచ్చాయి. టి.వి.వాళ్ల పొరపాటెక్కడుందో అర్థమయింది. స్టేజీ నాటకాలనే టి.వి.లోకి తెస్తున్నారు. ఆ నాటకం కెమేరాకు పనికిరాదు. కెమేరా వుందంటే ఆ భాషే వేరు- మళ్లీ మన టి.వి. వాళ్లు 10వ శతాబ్దంలో నాటకాలను సినిమాలుగా తీసిన మధ్యతరగతి మేధావుల దగ్గర్నుండీ ప్రారంభిస్తున్నారన్నమాట. ఈమధ్యలో సినిమా-కెమేరా ఇవి సాధించిన గొప్ప మార్పుల్ని పట్టించుకోకుండా మళ్లీ మొదట్నించి మొదలెడుతున్నారు. ఈ లెక్కన ఎప్పుడూ ఓ శతాబ్దం వెనకేవుంటారు- అని నవ్వుకుంటుండగా ఆ సినిమా అయిపోయింది. తర్వాత హేమంత్ గ్రిఫిత్ అనే అమెరికన్ దర్శకుడు సినిమారంగంలో ప్రవేశపెట్టిన కొత్త మార్పుల గురించి అతని సినిమాలను కొంత కొంత చూపిస్తూ చెప్పారు. పాఠం పూర్తయ్యేసరికి సరిగ్గా నాలుగున్నర. హేమంత్ పాఠం చక్కగా చెప్పటమేకాదు- తన రెండుగంటల టైమ్‌లో ఒక్క నిమిషం ఎక్కువ తక్కువ కాకుండా పాఠం ముగిస్తాడు. ఎంతో చక్కగా ప్లాన్‌చేసుకుంటేనేగాని అలా కుదరదు. మరో అరగంటలో థియేటర్‌లో సినిమా రూంకి వెళ్లి రావటానికి బద్ధకించిన రేణు మెల్లిగా నడుస్తూ వెళ్లి థియేటర్ ముందున్న రాతి బెంచిమీద కూచుంది.

నలుగురైదుగురు అబ్బాయిలు పక్కనే చెట్టుకింద చేరి సిగరెట్లు తాగుతూ మాట్లాడుకుంటున్నారు. వాళ్లలో ఒకబ్బాయి తనవంకే చూస్తుండటం గమనించి సర్దుకు కూచుంది.

అతను చూపు తిప్పుకున్నాడు. ఈసారి అతన్ని పరీక్షగా చూసింది. అతను తెలుగు అబ్బాయిలా అనిపించాడు. మిగిలినవాళ్ళలా డాషింగ్‌గా గానీ, వికారంగాగానీ లేడు. బుద్ధిమంతుడిలా వున్నాడు. మంచితనం కళ్ళలో కనిపిస్తోంది.

"తెలుగువాళ్ళెవరన్నా వచ్చారా- తను లిస్ట్ చూడలేదు. రాత్రికి రూంకి వెళ్ళగానే చూడాలి. అతను తెలుగువాడైతే బాగుండు. తెలుగు మాట్లాడి కొన్ని యుగాలైనట్లు వుంది" ఆలోచిస్తున్నకొద్దీ రేణుకు తెలుగులో ఏదోఒకటి మాట్లాడాలనే కోరిక ఎక్కువైపోయింది. ఆ కోరికను అణుచుకోలేక తనకిష్టమైన పాట మెల్లిగా పాడుకోసాగింది. ఆ పాట మొదలెట్టగానే రవి జ్ఞాపకాలు ఒక్కసారి వెల్లువలా ఆమెను ముంచెత్తాయి. రెండురోజులనుంచీ మనసు అడుగున దాగివున్న స్మృతులన్నీ పైకి వచ్చేసరికి ఆ తాకిడికి తట్టుకోలేకపోయింది. ఎంత నిగ్రహించుకుందామన్నా సాధ్యంకాని దుఃఖంతో పరుగెత్తుతూనే రూంకి చేరుకుంది. ఉమ అప్పుడే తాళం వెయ్యబోతున్నది. రేణును చూసి ఆగింది. రేణు ఉమను పట్టించుకోకుండా వెళ్ళి మంచంమీదపడి వెక్కివెక్కి ఏడుస్తోంది. ఉమ బిత్తరపోయి- "ఏం జరిగింది?" అని కంగారుగా అడిగింది.

"ఏంలేదు... నాకేం బాగోలేదు- మీరు వెళ్ళండి" అని అతికష్టంమీద చెప్పింది. ఉమ చేసేదిలేక కిందికి నడిచింది.

'రవీ నువ్వు కావాలి. నువ్వు కావాలి. నీ ప్రేమ లేనిదే నేను బతకలేను రవీ- ఎలా... ఎలా నువ్వు చచ్చిపోలేదు" రేణు అలా ఏడుస్తూనే వుంది. కాసేపటికి ఆ ఉధృతం తగ్గింది. కళ్ళవెంట నీళ్ళు దిండును తడిపాయి. ఎర్రగా మారిన కళ్ళలోంచి తళతళ మెరుస్తున్న నీటి బిందువులను తుడుచుకోబోయిన రేణు చేతి కంటే ముందుగానే గమన చేయి ఆ పనిచేసింది.

"మీరా...?" అంది రేణు. ఆమె దుఃఖం మళ్ళీ మొదలయింది.

"మీరింత బలహీనులనుకోలేదు- మూడురోజులకే ఇంత బెంగయితే అయిదు వారాలెలా వుంటారు? రేపో ఎల్లుండో ఉత్తరాలు రానే వస్తాయి. లేవండి- మీ రవిగారికి టెలిగ్రాం ఇవ్వమంటారా- 'స్టార్ట్ ఇమ్మీడియట్లీ' అని-" గమన బలవంతాన లేపి కూచోబెట్టింది.



రేణు లేచి ముఖం కడుక్కుని వచ్చింది.

"మీరు సినిమాకు వెళ్ళలేదా?" అని అడిగింది.

"వెళ్ళాను... ఉమ వచ్చి మీ సంగతి చెప్పేసరికి ఇక థియేటర్‌లో కూచోవాలనిపించలేదు. సాయంత్రం నాకూ ఇంటిమీద బెంగ అనిపించింది. మీరొక్కళ్ళే దిగులుగా కూచుంటారని నేనూ వచ్చాను. రండి-- వెళ్ళి సినిమాచూద్దాం"

"నాకు రావాలనిపించటంలేదు"

"అరే- రావాలనిపించటం లేదు గనకనే తప్పకుండా రావాలి. ఒక్కళ్ళే కూచుంటే దిగులు పెరిగిపోతుంది. కమాన్- రండి" గమన బలవంతాన రేణుని లాక్కెళ్ళింది.

అప్పటికే సినిమా మొదలెట్టారు.

"ఏంసినిమా ఇది?" మెల్లిగా అడిగింది



రేణు. 'నానూక్' అని ఎస్కిమోజీవితాన్ని యధాతథంగా తీసిన సినిమా. డాక్యుమెంటరీ నేగాని అసలలా అనిపించటంలేదు'' అంది గమన.

ఇగ్లూ కట్టుకోవటం— ఇగ్లూ లోపలవాళ్లు పడుకోవటం, బయటకుక్కలు- ఎస్కిమోజీవితం అంతా తెలుస్తోంది. నానూక్ నటుడుకాదు— నిజం ఎస్కిమో. దర్శకుడు ఆసినిమా తియ్యటానికి ఆధృవప్రాంతంలో ఎన్నేళ్లు ఎలా కష్టపడ్డాడోగాని ఆవాతావరణాన్నీ, ఆ జీవితాన్ని స్వయంగా చూసిన అనుభూతిని కలిగించాడు. ఆసినిమా పూర్తవగానే గ్రిఫెత్ తీసిన 'బర్త్ ఆఫ్ ఎ నేషన్' సినిమా ప్రారంభమయింది. నీగ్రోలకు వ్యతిరేకంగా తీసిన సినిమా. సివిల్‌వార్‌లో దక్షిణమెరికా పట్ల సానుభూతితో తీసిన సినిమా. దర్శకుడు చాలా బాగా తీశాడు. నీగ్రోపాత్రలకు కూడా తెల్లవాళ్లే నటించారు. ముఖాలకు తారుపూసుకున్నారు. అడుగడుగునా తెల్లవారి అభిజాత్యం బైటపడుతూనే వుంది. సినిమా పూర్తయి హాస్టలుకి వస్తుండగా మాధవి ప్రభతో అంటున్నమాటలు విన్నది రేణు. ''ఈ దర్శకుడు గ్రిఫెత్ ఎంతగొప్పగా తీశాడంటే నేని సినిమాను ద్వేషించకుండా వుండలేకపోతున్నాను-- ఇది రేసిస్ట్ సినిమా''

ప్రభ అంది— ''టెక్నికల్‌గా చూస్తే సినిమా చరిత్రనంతా మార్చిన సినిమా అని హేమంత్ గారన్నారు'' ''టెక్నికల్‌గా ఎంతగొప్పదైనా కావచ్చుకానీ ఈ రేసిజాన్ని జాత్యహంకారాన్నీ నేను స్వీకరించలేను'' మాధవి చాలా ఖచ్చితంగా అంది.

రేణుకు 'వేయిపడగలు' గుర్తొచ్చింది. నవలగా 'వేయిపడగలు' చాలాగొప్పది. అప్పటి సామాజిక క్షీణదశకు అద్దంపట్టింది. కానీ సమాజాన్ని వెనక్కు నడిపించబోయింది. ఈసినిమాకూడా అంతే— గొప్పసినిమా కావచ్చు— కానీ అంతా విషం విషం.

అందరితోపాటు డైనింగ్‌హాల్లోకి నడిచింది. టి.విలో శ్యామ్‌బెనెగల్ సినిమా ఏదో వస్తోంది. అందరూ నిశ్శబ్దంగా తింటూ సినిమా చూశారు. ఎనిమిదయింది. ఇంకో గంటన్నరలో మళ్లీ సినిమా— చాలా అలసటగా అనిపించింది. గదికివెళితే ఉమ గొణుగుతోంది. మనకిక

విశ్రాంతీ లేదా-- పొద్దున తొమ్మిదిన్నర దగ్గ ర్నించీ రాత్రి పన్నెండున్నర ఒంటిగంట వరకూ కోర్సయితే ఎలా తట్టుకుంటాం. ఇంకో ఆలోచనకే టైమ్‌లేకపోయే-- ఒకటే తరమటం. అబ్బో-- ఇంత హెవీ షెడ్యూల్. నా తల తిరిగి పోతోంది'' అంటూ తలపట్టుకుకూచుంది.

''మరి ఐదువారాల్లో వీలైనంత ఎక్కువచె ప్పాలని వాళ్ల ఉద్దేశం. థీరీ తెల్సుకోవాలి. ప్రాక్టికల్‌గా సినిమా చూడాలి. అంటే చాలా టైమ్ తీసుకుంటుందిగదా-- పైగా మనం ఇక్క డకువచ్చింది ప్రపంచంలోవున్న మంచి సిని మాలన్నీ చూడటానికి. ఎన్ని వీలైతే అన్ని చూడాలి. నిద్రఎప్పుడైనా పోవచ్చు--'' గమన మాటలకు ఉమ గొణుక్కుంటూ కూచుంది. రేణు శిరీషకు ఉత్తరం రాస్తోంది.

''ఉత్తరం చివరలో కాస్త ఖాళీ వుంచండి. ఇవాళ మీరెలా ఏడ్చారో రవిగారికి నేను రాస్తా ను'' అంది గమన తానూ ఇంటికి ఉత్తరం రాయటానికి కూచుని.

''మీరు రాసినా రవి నమ్మడులెండి''

''అలా అనుకుంటే ఇందాక ఫోటోతీసేదా న్నే-- ఐనా ఫరవాలేదు. మళ్లీ రెండుమూడు రోజుల్లో మీరు ఏడుస్తారని నాకు నమ్మకం కుదిరింది-- అప్పుడు ఫొటోతీస్తాను.''

రేణు నవ్వింది. గమనతో రవిగురించి మాట్లాడుతుంటే హాయిగావుంది. ఏదిగులూ లేకుండా రవి బతికి వున్నాడన్నట్లే వుంది. చాలారోజుల తర్వాత రేణు మనస్సు చాలా సంతోషంగా, ఉత్సాహంగా తయారయింది. ఏదో చురుకుదనం వచ్చినట్లయింది. శిరీషకు ఆ ఉత్సాహంతో పెద్దఉత్తరం రాసి మళ్లీ థియేటర్‌కు నడిచింది. తొమ్మిదిన్నర సినిమా గురించి క్లాసంతా ఉదయం నుంచీ హడావుడి పడుతున్నారు. క్లాసులో చాలామందికి బెర్గ్ మన్ అంటే ఇష్టం. బెర్గ్‌మన్ సినిమాలు చూడనివాళ్లు దాదాపు ఎవరూ లేరు. అందరూ బెర్గ్‌మన్‌ను గురించి అంత పొగుడుతుంటే అలాంటివ్యక్తి సినిమాలు చూడనందుకు రే ణుకు చాలా సిగ్గనిపించింది. సినిమా ఎలా వుంటుందోనన్న కుతూహలంతో థియేటర్‌కి నడిచింది.

ముందు 'డాన్స్' అనే చిన్న సినిమా వేశారు. గుండ్రని పెద్ద స్టేజీ మీద ఒకమ్మాయి డాన్స్‌చే స్తుంటుంది. స్టేజీచుట్టూ కూచున్న పురుషులు ఒకరితరువాత ఒకరులేచి ఆడాన్స్‌లో కలుస్తా రు. ఆ సంగీతం డాన్స్ ఎలా వుందంటే డాన్సు గురించి ఏమీ తెలియని రేణుకుకూడా లేచి నుంచుని కాళ్లూ చేతులూ కదిలించాలని పించింది. ఎవరైనా డాన్స్‌వచ్చిన వాళ్లుంటే వాళ్లులేచి డాన్స్ చెయ్యకుండా వుండటం అసాధ్యం-- ఇక హాల్లో అందరూ లేచి డాన్స్ మొదలెడతారనగా ఆసినిమా అయిపో యింది.

బెర్గ్‌మన్ సినిమా ''స్మైల్స్ ఆఫ్ సమ్మర్ నైట్'' చూసొచ్చాక గమనకూ, రేణుకూ నిద్రప ట్టలేదు. ఒకటే ఉత్సాహం- హుషారు. ఏం చెయ్యాలో తెలియదుగానీ ఏదో చెయ్యాలని పిస్తుంది. ''నాకు రెక్కలుంటే ఎటన్నా ఎగిరిపో యేదాన్ని. అలా అలా తిరిగి వచ్చేదాన్ని. ఎవరినన్నా ప్రేమించ బుద్ధేస్తుంది'' అంది గమన గదిలో అటూ ఇటూ తిరుగుతూ.

ఉమ సినిమా నుంచి వస్తూనే పడుకుంది. ''నిజంగానే చల్లని రాత్రి మెల్లగా నవ్వినట్లని పిస్తోంది-- గమనా ఈ సినిమాలో హీరోయిన్- అదే నాటకాలు వేసే అమ్మాయి-- అలాంటి పాత్ర మా తెలుగుసాహిత్యంలో వుంది. 'కన్యా శుల్కం' అని గొప్పనాటకం. అందులో ప్రధాన పాత్ర మధురవాణి వేశ్య. ఈ హీరోయిన్ లాగానే 'మగాళ్లని తనఇష్టంవచ్చినట్లు ఆడి స్తుంది. కథంతా నడిపిస్తుంది. ఈ సినిమా చూస్తుంటే నాకు ఎన్నిసార్లు మధురవాణి గుర్తొ చ్చిందో. ఈవిడ దగ్గరకు ప్రియులిద్దరూ ఒకే సారి వచ్చినట్లు మధురవాణి దగ్గరకు కూడా వస్తారు-'' కన్యాశుల్కాన్ని తల్చుకుని బాగా నవ్వింది. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ ఏ నాలుగింటికో నిద్రపోయారు.

★ ★ ★

రేణూకు మెలకువ వచ్చి చూస్తే పక్కన ఉమాలేదు- గమనాలేదు. టైము చూస్తే పది న్నర. రేణు హడావుడిగా లేచింది. క్లాసుమొద లై గంటయిపోయి వుంటుంది. ఏదన్నా చిన్న సినిమావేస్తే మిస్సయిపోయినట్టే-- ఈగమన లేపకుండానే వెళ్లిపోయింది. గమనమీదకోపం




తెచ్చుకుంటూ బాత్‌రూం వైపు వెళితే ఆమె ఎదురొచ్చింది. "మనం క్లాసు మిస్సయ్యాం- అందరూ వెళ్లారు. త్వరగా రండి- పద కొండింటికన్నా వెళదాం" రేణు పదిహేను నిమిషాల్లో రెడీ అయింది. ఇద్దరూ ఉరుకులూ పరుగుల్తో క్లాసు దగ్గరికి వెళితే అందరూ బైటే వున్నారు.

"ఎందుకోగాని క్లాసు జరగటంలేదు. మనం అదృష్టవంతులం" అంది గమన సంతోషంగా ఆయాసపడుతూ.

పూర్ణిమ, మంజరి, దీప్తి ఎదురువచ్చి చెప్పారు-

"పవర్‌లేదు. సినిమా చూపించకుండా క్లాస్ చెప్పటం కుదరదన్నారు. పవర్‌కోసం ఎదురుచూడటం తప్ప చేసేదేం లేదు"

"పవర్ వచ్చే ఆశకూడా లేదు. పూనాలో ఒక్కో ఏరియాలో ఒక్కోరోజు పవర్‌కట్ చేస్తారట. ఈ ఏరియాకు ఈరోజు సాయంత్రం వరకూ వచ్చే ఆశే లేదు"

"మరైతే ఏంచేద్దాం?"

"లైబ్రరీకెళదాం? ఆర్కైవ్స్‌కి వెళదాం"

"ఆర్కైవ్‌కి వెళితే ఒకవేళ ఇక్కడ పవర్ వస్తుందేమో"

"నేను లైబ్రరీనుంచి నిన్ననే గొడార్డ్ గురించి పుస్తకం తెచ్చుకున్నా. అది చదువుకుంటాను."

గమన రూంవైపు నడిచింది.

"రేణూ... మేం కొండమీదికి వెళ్తున్నాం- మాతో రాకూడదూ?" మాధవి అడిగింది.

"కొండా... ఎక్కడ?"

"ఎక్కడేమిటి మన క్లాసు వెనకాలంతా అడవీ, కొండానేగదా! అటెప్పుడూ రాలేదూ?' ప్రభ ఆశ్చర్యంగా అంది.

"నేను క్లాసూ హాస్టలూ తప్పమరేం చూడలేదు- పదండి వెళదాం" రేణు నడిచింది.

ఐదారుగురు ఆడవాళ్ళూ, పదిమంది అబ్బాయిలూ కలిసి కొండవైపు నడిచారు.

మెడలో రుద్రాక్షలు వేసుకున్న గడ్డపబ్బాయి గత రెండు రోజుల్లాగానే దీప్తిని గుంపునుంచి వేరు చేశాడు. వాళ్ళిద్దరూ కాస్త వెనగ్గా నడుస్తున్నారు.

"అతనిపేరేమిటి?" మంజరిని అడిగింది రేణు- "మన్మోహన్— వచ్చినప్పటినుంచి దీప్తిని వదలటంలేదు"

"దీప్తి చాలా అందంగా ఉంటుంది కదూ"

"ఔను? అందరికంటే చిన్నదికూడా. మన క్లాసులో దీప్తి, రజని, గమన చాలా బాగుంటారుగదూ" అంది మంజరి.

"నాకు రజని కంటే మీరే బాగుంటారు" రేణు మాటలకు మంజరి నవ్వింది.

"నిజం- రజని చాలా తెల్లగా ఉంటుంది. చాలా స్మార్ట్‌గా డ్రస్ చేసుకుంటుందిగానీ ఎక్కడో ఏదో లోపం ఉందనిపిస్తుంది. నాకైతే మీరే బాగుంటారు"

ఈసారి మంజరి సిగ్గుపడి థాంక్స్ చెప్పింది. మెన్స్ హాస్టలు దాటగానే ఒకవైపు చిన్న అడవి. సరాసరి వెళ్తే కొండ. ఒకతను నెమ్మదిగా హుషారైన హిందీపాట పాడటం మొదలెట్టాడు. అందరూ ఒక లయప్రకారం చప్పట్లు కొడుతూ కొండ ఎక్కారు. కొండమీద నుంచి పూనా నగరమంతా కనిపిస్తోంది. అందరూ ఎంతో ఉత్సాహంగా గంతులేస్తున్నారు. వాళ్ళంతా చాలా చిన్నపిల్లలయినట్లూ తాను చాలా పెద్దదయినట్లూ అనిపించింది రేణుకు. ఒక రాతిమీద కూచుని వాళ్ళ అల్లరిని చూస్తోంది. మన్మోహన్ సంతోషం పట్టలేక డిస్కో పాటొకటి పాడుతూ డాన్స్ మొదలెట్టాడు.

మిగిలినవాళ్ళు జోకులువేసుకుంటూ చప్పట్లుకొడుతూ ఉత్సాహపడుతున్నారు. రేణూకు ఆ ఉత్సాహం అంటకపోగా బాగా దిగులనిపించింది. వాళ్ళ అల్లరంతా అర్థరహితంగా కనిపించింది. నెమ్మదిగా ఒక్కతే కొండ దిగటం మొదలెట్టింది.

"వెళ్ళిపోతున్నారా... ఎందుకని?" అంటూ మంజరి పెట్టిన కేకకు చెయ్యి ఊపి సమాధానం ఇచ్చి నడుస్తోంది.

రవీ, తనూ ఇద్దరూ ఈ కోర్సుకి వస్తే ఏం చేసేవారు? ఇద్దరూ కలిసి మిగిలిన అందరి గురించీ కామెంట్స్ చేసుకునేవారు. క్లాసులో చెప్పిన విషయాలు మళ్ళీ చెప్పుకునీ, సినిమాలను ఇద్దరూకలిసి చూసి ఎంతో

ఆనందంపొందేవారు. ఇప్పుడందరికీ ఎవరో ఒకరు ఆత్మీయులైన స్నేహితులు ఉన్నారని పిస్తోంది. నేనొక్కదాన్నే ఒంటరి దాన్నని పిస్తోంది. హఠాత్తుగా రేణూకు ఇంకో ఆలోచన వచ్చింది. మరి అడుగుముందుకుపడలేదు. ఎంతసేపూ తన ఒంటరితనం గురించే బాధ పడుతోందా? తనకు ఒంటరితనమైనా ఉంది. రవికేం ఉంది. తను ఇక్కడ ఎన్ని మంచి విషయాలు తెలుసుకుంటోంది. ఎన్ని అనుభ వాలు పొందుతోంది. అవన్నీ రవికిలేవు. రవికి జీవితంలేదు. రవికి లేని జీవితం నాకెందుకు. రవికిలేని అనుభవాలు ఎందుకు? ఎందుకి దంతా తాను కల్పించుకుంటోంది. ఎందుకు చచ్చిపోవటంలేదు. తానుకూడా చచ్చిపోతే ఏమవుతుంది? ప్రపంచానికి తనొక బాధగా మిగలటం ఎందుకు? చచ్చిపోవాలి... చచ్చిపో వాలి... నడక ఎప్పుడు మొదలెట్టిందో తనకే తెలియకుండా రూంలోకి వచ్చిపడింది.

మంచంమీదపడి కళ్ళు మూసుకుని- కళ్ళ కడ్డంగా చేతిని పెట్టుకుంది. ఉమ, గమన ఇద్దరూ వింతగా చూశారు.

"రేణూ... లంచ్ తీసుకున్నారా?" ఉమ అడిగింది.

"తీసుకున్నాను" అంది రేణు. "నేను హిందీలో కవితలు రాశాను. ఉమ చదమంటు న్నారు. మీరూ వినండి- మీకు అర్థంకానిచోట్ల నేను ఇంగ్లీషులోకి అనువాదంచేసి చెబుతా ను" అంది గమన.

రేణు బలవంతాన కళ్ళు తెరిచింది. గమన మంచంమీద పడుకుని ఉంది. చేతిలో పుస్తకం పట్టుకుని చదవటానికి సిద్ధంగా ఉంది. గమ నని అలాచూస్తూ నేను వినను అని చెప్పటాని కి నోరురాలేదు. "చదవండి" అంటూ శక్తి నంతా కూడగట్టుకుని లేచికూచుంది.

గమన చదివింది రేణూకు చాలావరకు అర్థమయింది. కొన్నిచోట్ల గమన చెప్పింది ఆ కవితల సారాంశం- "ప్రపంచంలో ఎక్కడ చూసినా బాధేవుంది- ఎక్కడ చూసినా విషా దమే అలముకొని ఉంది. అది స్పష్టంగా తెలిసిన తర్వాత కూడా నేను ఆనందంకోసం వెతకడంలో, ప్రేమకోసం వెతకటంలో అర్థమే ముంది. ఎందుకు వెతకటం?"

రేణూకు ఆసమయంలో ఆ కవితలు ఎంతో నచ్చాయి. మెల్లగా, మెత్తని గొంతుతో, భావోద్వే గంతో గమన ఆ కవితలు చదువుతుంటే అవి తన గురించి రాసినవే తన బాధను అర్థం చేసుకుని రాసినవే, అనిపించింది. గమన చదవటం ఆపగానే ఉమ చప్పరించేసింది.

"ఇదంతా నిరాశావాదం. నాకు నిరాశ ఇష్టంలేదు. నువ్వింకా చిన్నదానివి పాతికేళ్ళు లేవు. ప్రేమా పెళ్ళిలాంటి అనుభవాలులేవు. అప్పుడే జీవితంమీద ఇంత నిరాశ పెంచుకో వటం ఏమిటి- ఎంత ఉత్సాహంగా ఉండా లి " అంటూ ఆపకుండా పదినిముషాలు మాట్లాడింది.

అంతా విని గమన బాగా చిరాకుపడి గట్టి సమాధానం ఇస్తుంది అని ఎదురుచూస్తోంది రేణు. గమన కాసేపు మౌనంగా ఉంది. తర్వాత ఏదో ఆలోచిస్తున్నట్లు మెల్లగా అంది.

"నా జాతి నాశనాన్ని నేను కళ్ళారాచూశాను. నాకు ఉత్సాహం, ఆశ ఎలా కనిపిస్తాయి? పదిమంది గూండాల చేతుల్లో చెరచబడ్డ అమ్మాయిని చూశాకా, నా కళ్ళయెదుట నా జాతి స్త్రీలను చెరచిన దృశ్యాలుచూశాకా- నాకు ప్రేమ గురించి సున్నితమైన భావాలెలా కలు గుతాయి?

"మగవాడు నన్ను ముట్టుకోబోతుంటే నాకు ఉద్రేకం, ఆనందం కలుగుతుందనే నమ్మకం కూడా నాకు లేదు. నాకు భయం, ద్వేషం ఈ రెండూ తప్ప మిగిలిన అనుభూతులకు అర్థం ఎలా తెలుస్తుంది నాకు తెలియదు "

నెమ్మదిగా స్పష్టంగా అంటున్న గమనవంక విస్తుపోయి చూశారిద్దరూ.

"గమనా... నువ్వు "

"ఔను... నేను సిక్కుని "

గమన కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి.

రేణు చప్పునలేచి గమన మంచంమీద కూచుని గమన చేతిని తన చేతిలోకి తీసు కుంది.

"గమనా... బాధపడకు, నాకు ఆ రాజకీయా లూ గొడవలూ అంతగా తెలియవుగానీ సిక్కు లంటే ఇష్టం వారి సమస్యను పరిష్కరించ

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి
పాలతో బాటు ఘన పదార్థాలు కావాలి
సెరిలాక్ లాభాన్ని అందించండి.
పోషకాహార లాభం : సెరిలాక్
ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి
కావలసిన పోషక పదార్థాలు. ప్రొటీన్లు,
కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు,
విటమిన్లు, ఖనిజాలు అన్నీ వున్నాయి.
అన్నీ సమ పాళ్లలో వున్నాయి.
రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్
రుచి ఇష్టం.
సమయం ఆదా లాభం : సెరిలాక్
ముందుగా వండినది. దానిలో పాలు,
పంచదార వున్నాయి. దానిని వెచ్చటి
నీటితో కలిపితే చాలు.
ఎంపిక లాభం : ఎంచుకునేందుకు
మూడు రకాల సెరిలాక్ వుంది.
మీ పాపాయికి సమతూకంలో
పోషకాహారాన్ని అందించేందుకూ,
తయారుచేయటంలో పరిశుభ్రతను
పాటించేందుకూ, డబ్బా మీది
సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి. సెరిలాక్
పోస్ట్ బాక్స్. నెం 3
న్యూ ఢిల్లీ 110008




సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL

కుండా ప్రభుత్వం ఎందుకు పెంచి పోషిస్తుందో నాకు తెలియదు ''

గమన ఒక్కసారిగా దిండులో తలదూర్చి వెక్కివెక్కి ఏడ్చింది.

ఉమ నివ్వెరపోయి చూస్తోంది.

రేణు గమన వీపు నిమురుతూ జుట్టు సరిచేస్తూ ఆమె తలనిముగుతూ ఓదార్చింది. పది నిముషాలలో గమన ఆ దుఃఖావేశం నుంచి తేరుకుంది.

"మిమ్మల్ని చాలా బాధపెట్టినట్లున్నాను-సారీ'' బలవంతాన ముఖానికి నవ్వు పులుముకుని లేచి కూర్చుంది గమన-

"అదేంకాదు... మీకున్న చేదు అనుభవాలను మేమే పనిగట్టుకుని గుర్తు తెచ్చినట్లున్నాం- సారీ'' అంది ఉమ. తన విమర్శవల్లే గమన ఇంత ఆవేశపడిందని సంజాయిషీ చెబుతున్నట్లుగా.

"అవి మర్చిపోతేగదా గుర్తుతెచ్చుకోటానికి- అవి నా మనసులో ఎప్పుడూ మండుతూనే వుంటాయి. ఎన్ని కన్నీళ్ళూ ఆ మంటను ఆర్పలేవు''

"ఏంజరిగింది గమనా-ఎందుకు మీరంత బిట్టర్‌గా ఫీలవుతున్నారు-'' గమన చేతిని తన చేతిలోకి తీసుకుంటూ అడిగింది రేణు.

"అక్టోబరు 31, 1984వరకు నేను అందరిలానే మామూలు అమ్మాయిని. జీవితమంటే ప్రేమ, ప్రేమంటే ప్రేమ-కలలు కనటమే జీవితంగా, ఉత్సాహమే వూపిరిగా బతికాను. ఇప్పుడు నాకు జీవితమంటే నిరాసక్తి ప్రేమంటే అపనమ్మకం, కలలు కనటమంటే ద్వేషం,-''

"ఎందుకలా మారారు... ఏంజరిగింది ఆరోజు'' రేణు అమాయకంగా అడిగింది.

"ఇందిరాగాంధీని హత్యచేశారు''

ఇద్దరూ గమనవంకే చూస్తుండిపోయారు. గమన చెప్తోంది. చెబుతున్న గమన ఈలోకంలో, ఈకాలంలో వున్నట్లు లేదు 1984 అక్టోబరు 31ని చూస్తూ మాట్లాడుతోంది.

"ఇందిరాగాంధీమీద నాకు కోపంతప్ప ద్వేషంలేదు- గౌరవంతప్ప అసహ్యంలేదు. ఆమెను నేను ప్రేమించలేదుగానీ గౌరవించాను. ఒక స్త్రీగా ఆమె శక్తిసామర్థ్యాలమీద నాకు గౌరవం వుంది. కానీ ఆమె పెంచిపోషిస్తున్న సమస్యలను చూస్తే నాకు కోపం కూడా వుంది. ముఖ్యంగా సిక్కుసమస్యను ఆమె కావాలని పెంచిందని నాకనిపించేది-

ఒకరోజు హఠాత్తుగా ఆమెను చంపేశారు. నిజంగా ఆ హంతకులను నేను ద్వేషించాను. ఒకరిని చంపి పగతీర్చుకోవటంలో నాకేమీ నమ్మకంలేదు. ఆరోజంతా రకరకాలుగా ఇందిరాగాంధీని గురించి మాట్లాడుకున్నాం. విచారపడ్డాం. మా అమ్మానాన్నా కన్నీళ్ళుపెట్టుకున్నారు. అమ్మకూ, నాన్నకూ ఆమె ఇందిరాగాంధీకాదు- ఇందిరా మాయి.

మర్నాడు ఉదయం ఎనిమిదింటికి నేను ఆఫీసుకు వెళ్ళటానికి తయారవుతుండగా ఫోన్‌వచ్చింది.

మా సీనియర్ ఫోన్‌చేశారు.

గమనా... నువ్వు ఎట్టిపరిస్థితుల్లోనూ బైటికి రాకు. ఇవాళ ఢిల్లీలో చాలా దారుణాలు జరుగుతాయి అని చెప్పారు.

నేనంత పట్టించుకోలేదు. కాని తొమ్మిదింటిలోపు నలుగురైదుగురు స్నేహితులు ఫోన్‌చేసి చెప్పారు. అమ్మా, చెల్లెళ్ళూ నన్ను బలవంతాన ఆపేశారు.

ఇంతలో నాన్నగురించి ఎవరో ఫోన్‌చేశారు. నాన్న ఉదయాన్నే హాస్పిటల్‌లోవున్న మా పెదనాన్నను చూడటానికి వెళ్ళాడు. ఆయనకు ఆపరేషనై రెండురోజులయింది. ఉదయాన్నే వెళ్ళి చూసి వచ్చి పనిలోకి వెళ్ళాలని ఆరుగంటలకే వెళ్ళాడు. అది చెబితే ఫోన్‌చేసినాయన కంగారుపడ్డాడు. మాకూ భయంవేసింది. పదవుతోంది- ఈపాటికి నాన్న వచ్చి భోజనంచేసి ఆఫీసుకు వెళ్ళాలి. హాస్పిటల్‌లో ఎనిమిదింటివరకూ వున్నా ఈపాటికి ఇల్లు చేరవచ్చు. సమయమయింది నాన్నకు-

అమ్మ కంగారుగా ఏడ్చింది. చెల్లెళ్ళు బిక్కమొహాలేసుకుని కూచున్నారు. నాకేంచెయ్యాలో తోచలా-మా సీనియర్‌కి ఫోన్‌చేస్తే 'నేను చెయ్యగలిగింది నేను చేస్తాను. నువ్వుమాత్రం బైటకి వెళ్ళకు- బైట దాడులు మొదలయ్యాయి. సిక్కుకాలనీల మీదకు వెళ్తున్నారు.




సిక్కు అని తెలిస్తేచాలు చంపేస్తున్నారు. నువ్వుమాత్రం బైటికి రాకు. మీ ఇంటిమీదకు వస్తే ఎలా తప్పించుకోవాలా అనిమాత్రం ఆలోచించు.

మీ ఇంటిముందు నేమ్‌బోర్డ్ వుందిగదా మీనాన్న పేరుతో. ముందది పీకెయ్యి. ఇల్లు తాళంవేసి లోపల కూచోండి. ఎవరూ బైటికి రావద్దు. కిటికీలు వేసుకోండి. ఇంట్లో ఎవరూ లేరన్నట్లుండాలి... జాగ్రత్త. మీనాన్న గురించి ఎంక్వయిరీచెయ్యటానికి ప్రయత్నిస్తాను- అతను కంగారుగా చెప్పేస్తున్నాడు.

ఎందుకిలా- ఏం ఏంజరుగుతోంది-

ఇందిరాగాంధీ హత్యకు సిక్కులమీద ప్రతీకారం తీర్చుకుంటున్నారు-ఇవాళ సిక్కు జాతి వినాశనం-భగవాన్- అంటూ అతను ఫోన్‌పెట్టేశాడు.

నేను ఏడుస్తూనే వెనకనుంచి వెళ్ళి తలుపులు తాళంవేసేశాను. కిటికీలు మూశాం-నిశ్శబ్దంగా భయంగా కూచున్నాం. అందరి తలల్లోనూ ఒకటే ప్రశ్న

నాన్నకేమయింది? నాన్న క్షేమంగావస్తాడా? ఇప్పుడు మనకేం జరుగుతుంది?

నిమిషాలు గంటలుగా, పగలు రాత్రిగా మారుతోంది. మాకు బైటిప్రపంచంతో సంబంధంలేదు. సాయంత్రం ఆరుగంటలకు ఫోన్‌మోగితే దాన్ని ఎత్తటానికి ఎంతశక్తి కూడగట్టుకోవాల్సివచ్చిందో చెప్పలేను. మా సీనియర్ ఫోన్‌చేశారు.

"గమనా... నువ్వింట్లోనే ఉన్నావా-నాన్నవచ్చారా?" నాన్నను గురించి ఏదో చెబుతాడనుకున్న నాకు ఆ ప్రశ్న భయంకరంగా వినిపించింది.

"నాన్న రాలేదు" అంటూ ఏడ్చేశాను. నేను వెళ్ళి నాన్నకోసం వెతుకుతానన్నాను.

ఆయన కోప్పడ్డాడు.

"ఏంజరుగుతుందో, ఎంత దారుణాలు జరుగుతున్నాయో నువ్వూహించలేవు. పత్రికాఫీసులో కూచున్న నాకు తప్ప మరెవరికీ ఇప్పుడివి తెలిసే అవకాశంలేదు. సిక్కుకాలనీలన్నీ తగలబడిపోతున్నాయి. సిక్కు స్త్రీలందర్నీ చెరుస్తున్నారు. తలపాగాతో కనపడితే చాలు చంపేస్తున్నారు. ఇవాళ ఢిల్లీ సిక్కుల రక్తంతో తడిసిపోయింది. ఈ రక్తాన్ని ఈ పాపాన్నీ కడగటానికి ఎన్ని తరాలు, ఎందరు బలికావాలో నాఊహకందటంలేదు. మైగాడ్... మనం మనుషులమేనా-మనది నాగరికతేనా-ఎందుకిలా జరుగుతోంది-" అవతల మా సీనియర్ ఏడుస్తుంటే నేను ఫోన్‌లోకి వెర్రిచూపులు చూస్తూ నిలబడిపోయాను.

"ఆ రాత్రి ఎంత భయంకరమైన రాత్రో-ఎన్ని యుగాలకు ఆ రాత్రి తెల్లవారిందో ఎవరూ ఊహించలేరు. రాత్రంతా చీకట్లో ఒకరి చేతులొకరం పట్టుకుని నిశ్శబ్దంగా చిన్న చప్పుడికి కూడా ఉలిక్కిపడుతూ గడిపాం.

"రాత్రి నెమ్మదిగా వెలుతురులో కలుస్తుండగా మా ఇంటితలుపు మోగింది.

నేను వెనకనుంచి వెళ్లాను. ఎవరో నాకు తెలియని వ్యక్తి లోపలికి వచ్చాడు. అందరం భయంతో వణికిపోతూ నిల్చున్నాం. అతని ఆకారం చూస్తే అతనో గూండాలా ఉన్నాడు.

"భయపడకండి-బలదేవ్‌సింగ్ ఇల్లు ఇదేగదూ-" అతను కాగితం మీద వ్రాసిన అడ్రసు చూపించాడు.

"ఔను-" అన్నాను.

"మీనాన్న మా ప్రాంతంలో వున్నాడు. వెంటనే మీరొచ్చి తీసుకెళ్లండి. మళ్లీ తెల్లవారితే చాలా ప్రమాదం. వీధుల్లో జనసంచారం మొదలవకముందే ఆయన్ని ఇంటికి తెచ్చుకోవాలి"

అతను తెచ్చిన ఆటోలో నేనూ, అతనూ బయల్దేరాం-

నాకు లక్ష అనుమానాలు- నేను బయల్దేరేటప్పుడు మా అమ్మ కళ్లల్లో చదివిన అనుమానాలే బుర్రలోకి ప్రవేశించాయి.

ఇదంతా నిజమేనా- నన్నెక్కడికి తీసుకుపోతాడు. అక్కడేం జరుగుతుంది. నన్ను చంపేస్తారా? ఇంకేమీ చెయ్యకుండా చంపేసినా ఫరవాలేదు. నన్ను చంపేస్తే చాలు- చంపేస్తే చాలూ- అని పిచ్చిగా అనుకుంటూ భయంతో వణికిపోతూ అరగంటసేపు ప్రయాణించేసి ఓ మారుమూల ప్రాంతానికి వెళ్లాను. అతని వెనకాలే నడుస్తూ ఓ కొట్టులాంటి గదిలోకి వెళ్లాను.

అక్కడ నాన్న వున్నాడు. నాన్నను చూస్తే ఆ క్షణం నాకేమనిపించిందో నేనెప్పటికీ మర్చిపోలేను. ఎప్పుడూ హుందాగా, గంభీరంగా చిరునవ్వుతో వుండే నాన్న మానవత్వం అంతా మూర్తీభవించిన మనిషా అన్నట్లుండే నాన్న ఒక్కరోజులో ఎలా మారిపోయాడు- ప్రపంచంలోని దీనత్వమంతా, నిస్సహాయతంతా ఆయన ముఖంలోనే తాండవిస్తోంది. పిరికితనంతో, భయంతో కళ్ళు నిండిపోయాయి. బట్టలన్నీ చిరిగి, జుట్టంతా చెదిరి- తలపాగా లేక, ఒళ్లంతా దుమ్ముకొట్టుకుని నాన్నని అలా చూడాల్సివస్తుందని నాకు ముందే తెలిస్తే నేను అప్పటికి చచ్చిపోయివుండేదాన్నని నాకు ఖచ్చితంగా తెలుసు. నాన్న ఏడుస్తూ వచ్చి నన్ను కావలించుకున్నాడు. అతను తొందరపెట్టాడు ఆటో ఎక్కమని. మాతోపాటు అతనూ ఎక్కాడు. మళ్లీ అరగంట నిశ్శబ్ద ప్రయాణం తర్వాత ఇల్లు చేరాం. నాన్నను ఇంటికి తెచ్చిన తను ఒక్కమాట మాట్లాడకుండా, ఒకక్షణం కూచోకుండా వెళ్లిపోయాడు.



నాన్న ఏంజరిగిందో చెబుతుంటే అందరం జీవచ్ఛవాల్లా విన్నాం.

నాన్న ఎనిమిదింటికి హాస్పిటల్‌నుంచి బైటికి వచ్చి చూస్తే టాక్సీ ఏదీ దొరకలేదు. బస్సు ఎక్కుదామని బస్‌స్టాపుకి వచ్చారు. అప్పటికే వానుల్లో, బస్సుల్లో జనం సిక్కు వ్యతిరేక నినాదాలు చేస్తూ వెళ్తున్నారు. నాన్న ఆందోళనతో బస్సుకోసం చూస్తుంటే అక్కడికి బస్సులు రావనీ, ఎలాగైనా ఏ ఆటోనో, టాక్సీనో పట్టుకువెళ్లమనీ దారిని వెళ్లేవాళ్లు నాన్నను హెచ్చరించారు. ఆ గడ్డం తలపాగా పెట్టుకుని ఇవాళ బైటికెందుకొచ్చావయ్యా అని భయపెట్టారు.

నాన్న గబగబా ముందుకి నడిచారు. ఎంత దూరం నడిచినా ఏవీ కనిపించవు. పోనీ ఏదో ఒక ఇంట్లోకి వెళ్లి ఫోన్ చేద్దామంటే ఎవరూ లోనికి రానివ్వలేదు. నిన్నటిదాకా దేశరక్షణ భారాన్నంతా వహించే వీరసైనికుడిగా, భద్రతకొక గుర్తుగా కనిపించిన సిక్కువ్యక్తి ఇవాళ అపనమ్మకానికీ, అవిశ్వాసానికి, అపాయానికి గుర్తుగా కనిపిస్తున్నాడు. అలిసిపోయిన నాన్న ఒక మున్సిపల్ పంపుదగ్గర నీళ్లు తాగబోతే అక్కడి జనం- వాళ్లు గుండాలు కాదు, రౌడీలు కాదు, హంతకులు కాదు- మామూలు జనం, మధ్యతరగతి జనం, నాన్నను తరిమేశారు. దాహంతో అల్లాడే యాభైఏళ్ల మనిషికి ఒక్కచుక్క నీళ్లివ్వలేదు వాళ్లు.

నాన్నకిక నడిచే పరిస్థితి పోయింది. టైము గడుస్తున్నకొద్దీ దాడుల ఉధృతం పెరుగుతోంది. చుట్టుపక్కలనుంచీ అల్లరి వినిపిస్తోంది. నాన్న వంతెనమీద నడుస్తూ కిందికి చూస్తే వంతెన కింద పదిమంది కలిసి ఒక సిక్కుయువకుడిని బట్టలు విప్పి రక్తాలు కారేలా కొడుతున్నారు. నాన్న భయంతో పరుగెత్తుతుంటే ఎవరో చూసి "పట్టుకోండి పట్టుకోండ"ని అరిచారు. నాన్న పరిగెత్తారు. తలపాగా వుంటే ప్రమాదమని తీసిపారేశారు. పడుతూ లేస్తూ సందుగొందుల్లోంచి పరుగెత్తుతూ ఒక మారుమూలప్రాంతానికి వచ్చారు. అది ఖాళీ ప్రదేశం. చెత్తకుప్పలుపోసే ప్రాంతం. నాన్న ఆ చెత్తకుప్పల వెనక కూచున్నాడు. ఆ







కుప్పలో దూరదామని ప్రయత్నించేటప్పుడు దానికి ఇంకోపక్క కూచుని పేకాడుకుంటున్న నలుగురయిదుగురు వ్యక్తుల్ని చూశాడు. నాన్నకు గుండె ఆగిపోతుందేమో నని పించింది.

వాళ్లంతా పచ్చి రౌడీలు, గుండాలు. పేకాడు కుంటున్నారు.

"ఇవాళ సిటీ అంతా అల్లకల్లోలంగా వుందిరా" అని ఒకడంటే- "మనకోసం కూడా వచ్చార్రా- ఈ పూట దోచుకున్నంత దోచుకోవచ్చు- చెరిచినంతమందిని చెరచొచ్చు. అడిగే వాడు లేడు. కేసులు లేవు. పైగా నాలుగైదొందలు ఇస్తామని వచ్చారు- పెద్దమనుషులు"

"ఛత్- ఎవడు చేస్తాడ్రా ఆ వెధవపని. మనం ఎంత చెడినా అంత చెడలేదులే- మనకేదన్నా కోపం వుంటే చంపుతాం, చెరుస్తాంగాని వృత్తిపుణ్యానికి సిక్కుల్ని చెరచమంటే చంపమంటే ఎందుకు చేస్తాం. అయినా వాడెవడో ఇందిరమ్మని చంపుతే ఈళ్లేం చేశారు- పైగా ఇవాళ చచ్చేదంతా బీదాబిక్కీనే. ఉన్నోళ్లు బంగళాల్లో వుంటారు. చచ్చేవాళ్లంతా ఇందిరమ్మకి ఓటేసి మొక్కినోళ్లే"

"అరేయ్... మాటల్లో పడ్డానని కింద ముక్కెత్తుకుంటావురా" అంటూ లేచిన ఒకడికి నాన్న కనిపించాడు. అతను మిగిలినవాళ్లకు సైగ చేశాడు.

అప్పుడే వెనకనుంచి మళ్లీ అరుపులు వినిపించాయి. నాన్న పరుగెత్తబోతే వాళ్లు ఆపారు.

నాన్నని లాక్కెళ్లి ఆ పక్కనున్న కొట్టుల్లాంటి ఇంట్లో పడేసి- "మీకేం భయంలేదు ఇక్కడే వుండడి" అన్నారు.

ఆ రోజంతా వాళ్లకు బైటికి రావటానికీ, మాకు కబురు చెయ్యటానికీ వీలు కాలేదు. ఆటోలూ, టాక్సీలూ, బస్సులూ ఏమీలేవు. వీధులన్నీ అల్లకల్లోలంగా వున్నాయి.

నాన్నకు ధైర్యం చెబుతూ మర్నాడు ఉదయాన్నే మా దగ్గరకు వచ్చారు.

నాన్న మా గురించి బాగా భయపడ్డాడు. ఇంటికొస్తే ఏ దృశ్యాలను చూడాలో, ఏ భయంకరమైన విషయాలు వినాలో అని నేనింటికి వెళ్లనని గొడవ చేశాడట.

నాన్న దగ్గర అడ్రసు తీసుకుని అతనొచ్చి నన్ను తీసుకెళ్లి మమ్మల్ని మళ్లీ ఇంటిదగ్గర దింపాడు.

ఆ మర్నాడు నేను బైటికి కదిలాను. సిక్కులనుంచిన శిబిరాలవైపూ, సిక్కులు ఖాళీచేసిన ప్రాంతాలవైపూ వెళ్లాను.

నాకు జీవితం నగ్నంగా అక్కడ కనిపించింది. భయంకర వికటాట్టహాసం చేస్తూ కనిపించింది. కోరలుసాచి క్రూరంగా కనిపించింది.

అక్కడి ఏడుపులు, అక్కడి మనుషుల చూపులు వారి గుండెల్లో మండుతున్న బడబాగ్నులు, అక్కడ తాండవమాడిన పైశాచికత్వం అన్నీ చూశాక నాకు జీవితంమీద భ్రమలు లేవు.

జీవితం దారుణమైనదని నాకు స్పష్టంగా తెలిసింది. జీవితం తనలోని అమానుషత్వాన్నీ, రాక్షసత్వాన్నీ, బాధనూ కనిపించనీయకుండా మేలిముసుగు వేసుకుంటుంది.

ప్రేమ, స్నేహం, ఆత్మీయత, మానవత్వం, కరుణ ఈ ముసుగులన్నీ తీసేసిన తరువాత జీవితపు నగ్నస్వరూపాన్ని చూస్తే మనకర్థమవుతుంది మనం భ్రమల్లో బతుకుతున్నామని.

అప్పటినుంచీ నాకొకటే ఆలోచన- నాకున్న శక్తులన్నీ పెట్టి జీవితంమీద జనానికున్న భ్రమలను పోగొట్టాలని.

మనం మనుషులంగా పరిణామం చెందలేదని తెలిస్తే మన మానవలక్షణాలన్నీ కేవలం భ్రమలనీ, ముసుగులనీ తెలిస్తే-

మానవులుగా మారటానికి మనం కృషి చెయ్యాలని తెలిస్తే అప్పుడన్నా జనం మనుషులుగా అవటానికి ప్రయత్నిస్తారేమో- మానవులుగా మారాలనే తపన మనుషుల్లో కలిగించటమే నా ధ్యేయం.

అందుకోసం ముందు వాళ్ళ భ్రమలు పోగొట్టాలి. కళ్ళు తెరిపించాలి. అందుకే నేను కవితలు రాస్తాను. నాటకాలు వేస్తాను. నేను చెయ్యగలిగిందంతా చేస్తాను''

గమన ఆవేశంగా మాట్లాడుతూ హఠాత్తుగా ఆగింది. రేణూ చేతిలోంచి తన చేతిని విడిపించుకుని బైటికి వెళ్ళిపోయింది.

''ఎంత ఘోరం'' అంది రేణు.

''గమన ఎక్కువ ఫీలవుతోంది - సిక్కులది మాత్రం తప్పులేదా - ఇందిరాగాంధీని చంపకపోతే ఇదంతా జరగదు గదా--'' ఉమ మహాని ర్లిప్తంగా లేచి బాత్‌రూం వైపు వెళ్ళింది.

రేణుకు కోపం, అసహ్యం ముంచుకొచ్చాయి. మనుషులు మనుషుల్లా లేరని గమన చెప్పింది. ఎంతైనా నిజం. ఇదంతా విని కూడా ఉమ ఆ మాట అన్నదంటే ఆవిడనలు మనిషేనా - బుర్రవుందా - ఆలోచించిందా - ఇందిరాగాంధీని ఎవడో చంపటమేమిటి - ఆ జాతినంతా చిత్రవధ చెయ్యటమేమిటి వాళ్ళంతా ఇందిరాగాంధీని గెలిపించిన వాళ్ళేనే! రాజకీయ నాయకుల కుట్రల్లో జనం బలవుతున్నారనే ఆలోచన ఉమకెందుకు రాదు--

రేణు అసహనంగా లేచి కాసేపు అటూ ఇటూ తిరిగింది.

నాలుగున్నరవుతోంది. వాతావరణం చల్లగా వుంది. ఉమ టీ చేసి ఇచ్చింది.

''బజారుకు వెళ్దామా - చీరెలు ఇస్త్రీకి కూడా ఇవ్వాలి'' అంది ఉమ

''గమనను రానివ్వండి-ముగ్గురం వెళ్దాం'' అని ముఖం కడుక్కుని వచ్చేసరికి గమన వచ్చింది.

హాండ్‌బ్యాగు సర్దుకుని చెదిరిపోయిన జుట్టుని పైపైన సరిచేసుకుంది.

''బీనా, రజనివాళ్ళు మంచి ప్రోగ్రాం వేశారు. మీరూ వస్తారా?'' అనడిగింది.

''ఏం ప్రోగ్రాం'' గమన మళ్ళీ మామూలయినందుకు సంతోషిస్తూ -- అడిగింది రేణు.

''పార్టీ... బీరుపార్టీ''

''ఆఁ-'' రేణు ఆశ్చర్యానికి అంతులేదు.

''మీరు డ్రింక్ చేయరా?''

''చెయ్యను'' రేణు ముఖం నల్లగా మారింది.

''మీరో ఉమా''

"నేనూ చెయ్యను" అంది ఉమ కాస్త గట్టిగా.

"ఇంతవరకూ డ్రింక్ చెయ్యకపోతే ఇది చాలా మంచి అవకాశం కదా -- మంచికంపెనీ, మంచివాతావరణం. వైడోంట్ యూ జాయిన్?" రేణూను బలవంతపెట్టబోయింది.

"నాకలవాటు లేదు- నాకిష్టంలేదు-ప్లీజ్" రేణు హడావుడిగా అంది.

"బీర్- చాలా లైట్‌డ్రింక్" రేణూను కన్విన్స్ చెయ్యబోయింది. "ప్లీజ్ -- మీరు వెళ్ళిరండి. నా కిష్టంవుండదు--"

రేణూ ఇబ్బంది గమనించి గమన వెళ్ళిపోయింది. "కానివ్వండి- మనం బజారెళ్దాం" ఉమ సతాయించటం మొదలెట్టింది.

ఉమ పోరు పడలేక ఆమెతోపాటు బజారు వెళ్ళింది. దారంతా ఉమ మాట్లాడుతూనే వుంది. గమన గురించీ, సిక్కుల గురించీ, తాగుడు గురించీ -- రేణూకు ఆమె స్పీడుగా మాట్లాడే హిందీ అర్థమూ కాదు, అర్థం చేసుకోవాలనీలేదు. ఆమె మనసంతా ఆలోచనలు-

గమన ఎందుకు తాగుతుంది. ఎంత మంచి అమ్మాయి- ఎంత సున్నితంగా ఆలోచిస్తుంది. ఎంత చక్కని కవితలు రాస్తుంది. కానీ ఈ తాగటమేమిటి -- తనలో వున్న ఆ బాధను భరించలేక తాగుతోందా - కానీ బీనా, రజనీ, మాధవీ - వీళ్ళెందుకు తాగుతున్నారు - వాళ్ళకేం బాధలున్నాయి - ఏమో తనకేం తెలుసు. గమన మనసులో ఇన్ని అగ్నిపర్వతాలున్నాయని ఇవాళ తెలిసింది. మిగిలిన వాళ్ళ జీవితాలేమిటో- తాను ప్రేమ పోయిందనీ ప్రేమించే మనిషి పోయాడనీ బాధ పడుతోంది. గమన అసలు ప్రేమనేదే లేదని బాధపడుతోంది. అది నిజమేనా? ప్రేమ లేదా - రవి ప్రేమ నిజం కాదూ? కానీ రవి ప్రేమ తనకే పరిమితం- తన ప్రేమ రవికే స్వంతం. గమన మాట్లాడేది ఈ ప్రేమ గురించి కాదు. మనుషుల్ని మనుషులుగా ప్రేమించగలిగే ప్రేమ. సాటిమనిషి మీద వుండాల్సిన ప్రేమ. ఆ ప్రేమ సమాజానికి అవసరం. ఆ ప్రేమ గురించి తనకేమీ తెలియదు. తనెప్పుడూ ఆలోచించలేదు. ఆ ప్రేమ ముందు తన వ్యక్తిగత ప్రేమ చిన్నదైపోతుందా --

కానీ గమన ఎందుకు తాగుతుంది. అంత మంచి భావాలున్న గమన, అంత చక్కని కవితలు రాసే గమన ఏం... కవితలు రాసేవాళ్ళు తాగగూడదా?... శ్రీశ్రీ బాగాతాగుతాడంటారే - శ్రీశ్రీ గురించి ఎవరో కవి అన్నాడు - "నీవు రాసి పారేసిన కవితలు గుబాళిస్తున్నప్పుడు నీవు తాగిపారేసిన సీసాల గొడవ మాకెందుకు" అని.

మరి శ్రీశ్రీని కవిగా తప్ప తాగుబోతుగా గుర్తించని తను గమన తాగితే ఇంత బాధపడుతుందేం?

"గమన ఆడది" - రేణు ఉలిక్కిపడింది. తన ఆలోచనతనకే భయం గొలిపినట్లు ఉలిక్కిపడింది. ఆడ, మగా సమానమేనని నమ్మే రేణు ఉలిక్కిపడింది. ఆడవాళ్ళు ఆడవాళ్ళు గనక తాగకూడదా- మగవాళ్ళతాగుడు గురించి పట్టించుకోని వాళ్ళు ఆడవాళ్ళ గురించి ఎందుకు పట్టించుకోవాలి.

ఏమవుతుంది తాగితే - సిగరెట్ కాలిస్తే -

ఇద్దరూ మనుషులే - రవి సిగరెట్ తాగుతుంటే తనకెప్పుడూ అయిష్టం కలగలేదు. ఆ సిగరెట్ వాసన అలవాటయ్యాక బాగానే వుండేది. రవి కాలుస్తుంటే అసహ్యించుకోని తను గమనో, బీనానో, రజనీనో కాలుస్తుంటే ఎందుకసహ్యించుకోవాలి- ఆడవాళ్ళుగనక నేనా?

సిగరెట్ తాగటం తప్పయితే ఆడామగా ఎవరు తాగినా తప్పే - తప్పు కాకపోతే ఎవరు తాగినా తప్పుకాదు. ఆలోచన తెముల్చుకుని హాయిగా నిట్టూర్చింది. ఉమ ఒక షాపులోంచి ఇంకొక షాపుకి తిరుగుతూనే వుంది. ఉమ వెనకాలే రేణు విసుగు పుట్టేదాకా తిరిగింది. ఏవేవో తినుబండారాలు కొన్నది.

ఇద్దరూ తిరిగొచ్చేసరికి డిన్నర్ టైము అయింది. భోజనం చేసి, శిరీషకు ఉత్తరం రాసి కాసేపు పడుకునేసరికి కరెంటు వచ్చింది. అందరూ బిలబిలలాడుతూ థియేటర్‌వైపు పరిగెత్తారు.

పన్నెండు గంటలకు థియేటర్ నుంచి వచ్చి సినిమాల గురించి ఆలోచిస్తూ పడుకుంది.

'వెడ్డింగ్' అనే ఓ చిన్న రష్యా సినిమా. ఒకబ్బాయి ఒకమ్మాయిని చూసి ప్రేమించి ఆమె వెంట పడతాడు. ఒక్కమాట- ఆ అమ్మాయితో మాట్లాడకుండానే ఎన్నెన్నో వూహించుకుంటాడు. కొన్నిరోజులకు ఇక ఊహలతో లాభంలేదని తన మనసు తెలపటానికి పూల గుత్తొకటి పుచ్చుకుని వాళ్ళింటికి వెళతాడు. అప్పుడే ఆ అమ్మాయి నూతన వధువుగా వరునిచేయిపట్టుకుని కారులోనుంచి దిగుతుంది. ఇక ఇతని వెర్రిముఖం చూసి హాలంతా నవ్వులు. 'స్టేజ్ కోచ్' అనే సినిమా. సినిమా చరిత్ర క్రమంలో గొప్పసినిమా అని హేమంత్ చెప్పారుగాని రేణుకు ఆ గొప్పతనం అంతగా తెలియలేదు. ఆ కథను మననం చేసుకుంటూ, సన్నివేశాలను గుర్తుతెచ్చుకుంటూ నిద్రపోయింది.




ఉదయం లేచేసరికి ఎనిమిది దాటింది. ఉమ తయారై బ్రెడ్ ఛీజ్ కలిపి తింటోంది. గమన నిద్రపోతూనే వుంది. గమన రాత్రెప్పుడు వచ్చిందో తనకు మెలకువే లేదు- అనుకుంటూ బాత్‌రూంవైపు నడిచింది. తొమ్మిదింపావుకి గమనని లేపితే నేనివాళ ఆలస్యంగా వస్తాలే- నువ్వు వెళ్లు అంది.

రేణు ఒక్కతే హాస్టల్‌దాటి క్లాసువైపు నడుస్తోంది. స్టూడెంట్స్ అందరూ కాంటిన్‌దగ్గరే వున్నారు. సన్నగా చినుకులు పడుతున్నాయి. క్లాసుకెళ్ళే సరికి జనం పలచగా కనిపించారు. హేమంత్ వచ్చేసరికి అందరూ ఆశ్చర్యపోయారు. అప్పుడు క్లాస్ రమేష్‌ది. హేమంత్ ఆక్లాసు తాను తీసుకుంటాననీ, మధ్యాహ్నం వేరే క్లాసు జరుగుతుందనీ చెప్పి వెంటనే పాఠం మొదలుపెట్టారు. ఆరోజు పాఠం ఐసన్ స్టీన్‌ముంటాజ్ సిద్ధాంతం గురించి.ముంటాజ్ అంటే ఒకరకంగా ఎడిటింగ్ అనేనని చెప్పి ముందు ఆమాటంటే వున్నభయం పోగొట్టారు. ఒక షాట్ తర్వాత ఇంకొక షాట్ చూపించి ఒక అర్థాన్ని సృష్టించవచ్చు. సంబంధంలేని షాట్స్‌ని చూపించి కూడా అర్థాలను సృష్టించవచ్చు. ఎందుకంటే మనిషి బుర్రకి ఒక లాజిక్ వుంది. ఎంత అసంబద్ధమైన, అస్పష్టమైన విషయాలనైనా సరే మనిషి బుర్ర తన లాజిక్ ప్రకారం తాను అర్థంచేసుకుంటుంది. ఈ ముంటాజ్ సిద్ధాంతానికి మూల పురుషుడు కులషోవ్. అతను విప్లవసమయంలో పారిస్‌లో వున్నాడు. విప్లవదినాల్లో చిత్రాల నిర్మాణం తాత్కాలికంగా ఆగింది. ఆ సమయంలో కులషోవ్ తన దగ్గరవున్న పాత చిత్రాలలోని షాట్లను కొత్తపద్ధతిలో అమర్చిపెట్టాడు. దానివల్ల కొత్తచిత్రం కొత్త అర్థంతో తయారయింది. ఉదాహరణకు అతను చేసిన ఒక తమాషా చెబుతాను- వినండి.

ఒకవ్యక్తి చాలా సీరియస్‌గా చూస్తుంటాడు. ఆఫ్రేములో అతనూ అతని చూపులే- ఇంకేమీ వుండవు. తర్వాత ఒక గిన్నెలో ఆహారం చూపిస్తాడు. మళ్లీ అవ్యక్తీ తర్వాత గిన్నె- ఇలా చూపించటంతో ప్రేక్షకులకు అతని చూపుల్లో ఆకలి కనపడింది.

మళ్లీ ఆ వ్యక్తినే చూపించి తర్వాత శ్మశానానికి శవాన్ని తీసుకెళుతున్న ఒక ఊరేగింపు చూపిస్తాడు. ఈ సారి ప్రేక్షకులకు అతని చూపుల్లో విషాదం కనిపించింది. మూడోసారి మళ్లీ అవ్యక్తిని చూపించి తర్వాత బట్టలు విప్పేస్తున్న ఒక అమ్మాయిని చూపించాడు. ఈసారి ప్రేక్షకులకు అతనికళ్లల్లో కోరిక కనపడింది. ఒకేవ్యక్తి ఒకేరకమైన చూపులు-- కానీ ఆ చూపులను వేరే దృశ్యాలతో మిళితం చెయ్యటంవల్ల కొత్త అర్థాలు వచ్చాయి. దాంతో అతను షాట్‌కి రెండు విలువలుంటాయని ప్రతిపాదించాడు. ఒకటి- ఆ షాట్‌లో సహజంగా, స్వభావసిద్ధంగావుండే విలువ. రెండోది- ఇతర షాట్లతో మిళితం చెయ్యటంవల్ల ఏర్పడే విలువ. కాబట్టి షాట్ న్యూట్రల్ అంటాడాయన. ఐతే ఐసన్‌స్టీన్ షాటే నిజంగా న్యూట్రల్




కాదంటాడు

ఇలా ముంటాజ్ గురించీ, ఐనస్టీన్ గురించీ హేమంత్ చెబుతుంటే ఆయన నోటిమాటలవెంటే కాలంకూడా జారిపోయింది. ఒం... గంటకు పాఠం అయిపోయింది. ఒక్క... ముఖం కూడా అటూఇటూ కాకుండా పాఠం ముగించే హేమంత్ వంక గౌరవంగా చూస్తూ బైటకి నడిచింది రేణు.

"మీరు రేణూగారా?" ఇంగ్లీషులో అడుగుతున్న వ్యక్తివంక తేరిపార చూసింది.

మొన్న తను తెలుగువాడేమో అనుకున్న వ్యక్తి. ఔనన్నట్లు తలాడించింది.

"నాపేరు సూర్యనారాయణమూర్తి. సూర్యం అంటే చాల్లెండి. మీరు భయపడవద్దు" హాస్యంగా అన్నాడు సూర్యం.

రేణుకు ఆమాటలు తేనెజల్లుల్లా అనిపించాయి. చెవులు ఇంకా ఇంకా అతని మాటలకోసం రిక్కించి నిల్చున్నాయి. ఆమాటలు మాట్లాడిన వ్యక్తిని చూడటమే తమకు సార్ధకత అన్నట్లు చూశాయి కళ్లు. అతనిమాటలు విని కూడా ముడుచుకుని వుండటం అపరాధమన్నట్లు విచ్చుకున్నాయి పెదవులు. తళుక్కున మెరిసి సంభ్రమాన్ని ప్రకటించింది పలువరస.

ఆనందాశ్చర్యాలతో నిలబడిన రేణువంక వింతగా చూశాడు సూర్యం.

"ఎన్నాళ్లయిందండీ తెలుగుమాట విని-- అబ్బ-- నా నోట్లోంచి తెలుగుమాట రావటం నాకెంత బాగుందో. మాట్లాడటంలో ఇంత హాయీ, ఆనందం వుందని నాకింతవరకూ తెలియదు. నోరారా మాట్లాడటమంటే ఇదన్నమాట" ఆమె ఆవేశం చూసి సూర్యం నవ్వాడు.

"నాకు రెండురోజులకే విసుగేసింది. పాపం... మీరు ఐదారు రోజుల్నించీ తెలుగులో మాట్లాడలేదనుకుంటా?"

"లేదండీ-- ఇక్కడికొచ్చాక ఇవాళే తెలుగు మాట్లాడటం. మీరెక్కడనుంచి వచ్చారు?"

"విజయవాడ. అక్కడ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్నాను. మీరు హైదరాబాదు నుంచి కదూ?"

"ఔను-- అక్కడ ఆఫీసులో పనిచేస్తున్నా

ను"

"మీకు సినిమాలంటే ఇంత ఇష్టం వుండటం ఆశ్చర్యంగా వుంది. సామాన్యంగా మన తెలుగు ఆడపడుచులిలా ఫిలిం అప్రిసియేషన్‌కి రారు. మీరు ఫిలింక్లబ్ మెంబరా?"

"కాదండీ... నాకంత ఎక్కువేం తెలియదు సినిమాల గురించి. ఏదో పేపర్లో ప్రకటనచూసి వచ్చాను"

"ఎలాగోలా వచ్చారు- అదే గొప్ప. లంచ్ టైం అవుతోంది పదండి--"

ఇద్దరూ కలిసి నడిచారు. కాంటిన్‌వైపు వెళ్ళబోతున్న సూర్యాన్ని అడిగింది-

"ఈకాంటిన్‌లో భోజనం బాగుంటుందా? టిఫినే బాగోలేదు"

"చాలా చెత్తగా వుంటుంది. కానీ మాకు మెన్స్ హాస్టల్లో మెస్ రాత్రిపూట మాత్రమే తెరుస్తారు- పగలిక్కడే తినాలి"

"ఎందుకు... కొందరబ్బాయిలు కూడా మా మెస్‌లో తింటున్నారు. మీరు కూడా తినొచ్చు గండి"

స్వంత ఇంటికి ఆహ్వానించినంత ఆప్యాయంగా ఆహ్వానించింది.

"ఒద్దులెండి... అంతమంది అమ్మాయిల మధ్యలో" నసిగాడు.

"అరే— నలుగురైదుగురు అబ్బాయిలు కూడా వుంటారు. ఏంఫరవాలేదు రండి" అని మొహమాటపెట్టి డైనింగ్‌హాలుకి తీసుకెళ్ళింది.

వార్డెన్‌తో మాట్లాడి సూర్యం రోజూ పగలు ఇక్కడ భోజనం చేసేలా ఏర్పాటుచేసింది.

"నిజంగా మీమెస్ బాగుంది. మేం రోజూ ఆ కాంటిన్ తిండి తినలేక అవస్థపడుతున్నాం"

"ఏంబాగులెండి... రోజూ ఈ చపాతీలూ, శనగల కూర, చిక్కుడు గింజల పులుసు-- విరక్తి పుడుతోంది. అసలు పులుసన్నది వాడరేం— ఆ నిమ్మకాయ ముక్కలు కనిపించిన రోజు ప్రాణం లేచొచ్చినట్లుంటుంది."

రేణూకు తెలుగుబెంగ తీరిందిగానీ తిండి బెంగతీరలేదు.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ భోజనం ముగించారు. గ్లాస్, లైన్స్, జూ సినిమాలు మిస్సయినందుకు సూర్యం జీవితాంతం బాధపడేలా వర్ణించి చెప్పింది రేణు.

రేణూ అంత ఉత్సాహంగా మాట్లాడటం అందరూ వింతగా చూశారు. ఎప్పుడూ మౌనంగా, బెరుగ్గా అందరి మాటలూ వింటూ వుండే రేణూ ఇవాళ ఈ అబ్బాయితో ఇంత ఫ్రీగా మాట్లాడటం కొత్తగా అనిపించింది. పైగా రేణు ఇంతవరకూ ఏఅబ్బాయితోనూ తనంతటతాను మాట్లాడటం కూడా వాళ్ళు చూడలేదు.

సూర్యాన్ని పంపి గదిలోకి వచ్చిన రేణూను ఉమ పట్టుకుంది. రేణు కోసమే కాచుకుని వున్నట్టుగా వుంది ఆమె వాలకం.

"ఎవరతను---?"

"సూర్యమని మా ఆంధ్రానుంచి వచ్చాడు. తెలుగులో మాట్లాడుకున్నాం"

వింటున్న గమన నవ్వింది.

"ఇక మాతో ఇంగ్లీషులోకూడా మాట్లాడరా" అంటూ రేణూ నవ్వేసి వూరుకుంది.

రవికి సూర్యం గురించి చెప్పాలని పించింది.

"రవీ... ఇవాళ తెలుగులో మాట్లాడితే ఎంత బాగుందోతెలుసా! పాపం సూర్యంగారుకూడా మంచాయనలాగానే వున్నాడు. ఇక ఈ నెలరోజులూ దిగుల్లేదు" సంతోషంగా అనుకుంది.

రేణుకిప్పుడు తన సంతోషం అసహజంగానో, అసంబద్ధంగానో అనిపించటంలేదు. తను సంతోషంగా వుంటే రవికి బాగుంటుంది అనే ఆలోచనతో రవీ నేను బాగున్నానని నచ్చచెబుతున్నట్లుగా అనుకుంటోంది.

గమన దుఃఖం చూశాక రేణూకు తాను ఏడవటం ఎందుకో చాలా తెలివితక్కువ పనిలాగా, చిన్నపిల్ల చేష్టలాగా అనిపిస్తోంది. దాంతో రేణు దుఃఖానికి బదులుగా ఉత్సాహాన్నీ దిగులుకు బదులుగా కొత్తశక్తినీ మనసులో నింపుకోటానికి తనకు తెలియకుండానే సర్వశక్తులతో ప్రయత్నిస్తోంది. కొత్తప్రదేశం, కొత్త మనుషులు, కొత్త ఆలోచనలు, హృదయానికి




మంచి అనుభూతినిచ్చే సినిమాలూ, మెదడుకి పదునుపెట్టే పాఠాలూ ఇవన్నీ రేణు దుఃఖాన్నీ దిగులునూ పలుచనచేశాయి.

★ ★ ★

రెండున్నరకి క్లాసుకి మూవీ కెమేరా వచ్చింది. స్టూడెంట్స్ అంతా ఆనందంతో కేరింతలు కొట్టారు. కెమేరాతో కంపోజింగ్ ఎలిమెంట్స్ గురించి పాఠం. మూవింగ్ కెమేరాలో పానింగ్, టిల్ట్, ట్రాక్ యిన్‌ట్రాక్ అవుట్, పారలెల్ ట్రాకింగ్ గురించి చెప్పారు. కెమేరా యాంగిల్స్‌గురించీ, లెన్స్‌గురించీ వివరించారు. ఫీల్డ్ డెప్త్‌ని కెమేరాలో ఎలా పట్టుకోవాలో, సాధించాలో చూపించారు. కెమేరా స్పీడుగురించీ, కలర్ గురించీ, ఆప్టికల్ డీసాల్వ్ గురించీ చెప్పారు. అందరికీ ఎంతో ఉత్సాహంగా వుంది. కెమేరాలోకి ఎవరొస్తారని అడిగితే దీప్తి ఉత్సాహంగా లేచింది.

దీప్తి అందంగా వుంటుంది. అందరూ కేకలేస్తుండగా కెమేరాకెదురుగా నిల్చుంది. ఎదురుగా టి.వి. తెరమీద ఆమె బొమ్మ. ఆమెమీద రకరకాల యాంగిల్స్‌లో రకరకాలుగా కెమేరా ఫోకస్‌చేసి వివరించారు. అందరూ ఒకటే ఎక్సయిట్ అయిపోయారు. రేణుకు కూడా ఆ ఉత్సాహం అంటుకుంది.

మామూలుగా ఐదింటికి అవాల్సిన క్లాసు ఆరోజు ఐదున్నరకు బలవంతంగా ముగిసింది.

ఐదున్నరకు మెయిన్ థియేటర్‌లో సినిమా. ఆ జర్మన్ సినిమా గురించి మర్నాడు క్లాసుంటుందనీ, జాగ్రత్తగా చూడమనీ హేమంత్ చెప్పారు.

రేణు పరిగెత్తుతున్నట్లే వెళ్ళి థియేటర్‌లో కూర్చుంది. సూర్యం వచ్చి పక్కనే కూచున్నాడు. రోజూ రేణు ఒక్కతే కూర్చుని సినిమాచూసేది. రెండు మూడు వందలమంది పట్టే థియేటర్‌లో ఈ స్టూడెంట్స్ అరవైమందీ అక్కడక్కడా కూచునేవారు. సాధారణంగా ఎవరి స్నేహితులతో వాళ్ళు. గమనతో ఒక్కసారి కూర్చుంది. గమన సామాన్యంగా అటూ ఇటూ తిరిగి సరిగ్గా టైమ్‌కివచ్చి ఎక్కడో ఓ చోట కూచునేది.

ఉమ, ప్రభ, మంజరి ఇంకో ఇద్దరు ముగ్గురు ఓ గుంపుగా కూచునేవారు.

వాళ్ళవెనక వరసలో రేణు ఒక్కతే కూర్చుని ఆలోచించుకుంటూ దిగులుపడుతూవుండేది. ఇవాళ సూర్యం పక్కన కూచుంటే రేణుకు తృప్తిగా అనిపించింది. ఒంటరితనం తగ్గినట్లనిపించింది. "కాబినెట్ ఆఫ్ డాక్టర్ కాలిగారి" అనే జర్మన్ సినిమా హిట్లర్ అధికారంలోకి రాబోయే ముందు వచ్చింది. హిట్లర్‌కి ఈ సినిమా అంటే చాలాఇష్టమనీ, ఈ సినిమా తీసిన దర్శకుడిని తన ప్రభుత్వంలో సినిమాల విషయం చూసుకునే అధికారిగా నియమించాలనుకున్నాడనీ, ఆ దర్శకుడు ఒప్పుకోలేదనీ హేమంత్ సినిమాకి ముందు ఇంట్రడక్షన్ ఇస్తూ చెప్పారు. ఆ సినిమా అంతా క్షుద్రవిద్యలు- ఒక మాంత్రికుడు సీజర్ అనే శవానికి ప్రాణంపోసి హత్యలు చేయిస్తాడు. సినిమా చివరకు అది నిజమా భ్రమా అనే అనుమానంతో ముగిస్తారు.

రేణుకు మనసంతా గందరగోళమైపోయింది. అయోమయంతోనే బైటికి నడిచింది. బయట ఇంకా వెలుతురుగానేవుంది. టైము చూస్తే ఏడు. పూనాలో ఏడింటికికూడా చీకటి పడదు చిత్రం అనుకుంటూ పక్కకు చూస్తే సూర్యం తీవ్రాలోచనలో మునిగివున్నాడు.

"నే వెళ్తానండీ" అంది రేణు.

"ఏడేగా అయింది- ఇంకో గంటబైటే కాలక్షేపం చెయ్యవచ్చు. రూంకెళ్ళి ఏం చేస్తారు?" సూర్యం కాంటిన్‌వైపు నడిచాడు.

"కాంటిన్‌కి వద్దండీ"

"ఐతే వుండండి—" అని కాంటిన్‌లో సిగరెట్టు పెట్టె కొనుక్కుని— రెండు కప్పులతో టీ పట్టుకుని వచ్చాడు.

"ఆ అరుగుమీద కుచుందాం- పదండి" అంటూ నడిచాడు. బాటకు ఒకపక్కగా ఒక పెద్ద రావి చెట్టు— ఊడలతో చాలాదూరం విస్తరించింది. దాని మానుచుట్టూ కొంచెం ఎత్తులో గుండ్రని అరుగు కట్టారు. ఆ అరుగుమీద ఎప్పుడూ స్టూడెంట్స్ కూచుని వుంటారు.

"ఆ చెట్టు పూనా ఫిలిం ఇన్‌స్టిట్యూట్ విద్యార్థులకు బోధి వృక్షమట" అని నవ్వింది గమన ఒక రోజు. ఆ అరుగుమీద కూచున్నారిద్దరూ.

"చెప్పండి... ఎలావుంది సినిమా?"

"నాకేం అర్థంకాలేదు. అయోమయంగా వుంది" అంది కళ్ళు చిట్లిస్తూ.

"అయోమయం ఏముంది- అందులో మంత్రగాడు సీజర్ చేత ఏ పనైనా చేయించగ

లిగినట్లు- హిట్లర్ నాజీలచేత చేయించగలిగాడు గదా—''

రేణు ఏమీ మాట్లాడలేదు.

''ఈమధ్య వస్తున్న తెలుగు సాహిత్యం చదువుతున్నారా?''

''చదువుతున్నాను—''

''ఎలా వుంటోంది?''

''నాకు నచ్చటంలేదు''

''నాకూ నచ్చదు. నచ్చకపోవటం కాదు ద్వేషిస్తాను. ఈ సినిమా హిట్లర్‌ని యాంటిసిపేట్ చేస్తుంది. ఈ సినిమా తర్వాత హిట్లర్ విజృంభించాడు. అది యాదృచ్ఛికం కాదేమో. ఈ రకం సినిమాలతో, సాహిత్యంతో ప్రభావితులైన కొందరు జర్మన్ ప్రజలన్నా హిట్లర్‌ని ఆమోదించేందుకు సిద్ధపడ్డారేమో''

''ఇప్పటి మన సాహిత్యం మన రాష్ట్రంలో ఫాసిజాన్ని యాంటిసిపేట్ చేసిందేమో- ఈ రకపు సాహిత్యం మొదలైనతర్వాతనే తెలుగు దేశంలో అధికార రాజకీయ వాతావరణం మారటం కాకతాళీయంగా కనిపించినా వాటిని అంతర్గతంగా నడిపించిన సామాజిక సూత్రాలున్నాయేమో—'' సూర్యం ఆగాడు. రేణు అమోమయంగా చూస్తోంది.

''నాకు రాజకీయాలంతగా తెలియవు. కానీ మన రాష్ట్రంలో ఫాసిజం వుందంటే నమ్మబుద్ధి కావటంలేదు''

''ఫాసిజంఅంటే హిట్లర్‌ని యధాతథంగా అనుకరించటంకాదు. ఆ రోజుల్లో ఆ పరిస్థితుల్లో హిట్లరలా ఉన్నాడు. ఈ రోజుల్లో ఈ పరిస్థితుల్లో ఫాసిజం ఎంతవరకు, ఎలా సాధ్యమవుతుందో ఆ పద్ధతుల్లో కొనసాగిస్తున్నారు.

రోజురోజుకీ మనరాష్ట్రంలో పెరిగిపోతున్న పోలీసు దౌర్జన్యాలూ, లాకప్ మరణాలూ గమనించటం లేదూ'' ఆవేశంగా అడిగాడు సూర్యం. అలా గమనించకుండా వుండటం ఘోరమైన నేరమనీ, తానా నేరంచేశాననీ గ్రహించినట్లు తలదించుకుని కూచుంది రేణు. కాసేపు ఆలోచనల్లోపడి తేరుకుని అడిగాడు సూర్యం ''మీరు సాహిత్యం చదువుతారా?''

''చదువుతాను''

''ఎవరి పుస్తకాలు ఇష్టం?''





''చలం, కుటుంబరావు, గోపీచంద్, బుచ్చిబాబు'' వరసగా చెప్పుకుపోయింది.

సూర్యం ఉత్సాహంగా నవ్వాడు.

''అమ్మయ్య- సాహిత్యంలో మనిద్దరివీ ఒకటే అభిరుచులు. నా జీవితాశయం ఏమిటో తెలుసా?''

రేణు తెలియదన్నట్లు తలాడించింది.

''కుటుంబరావుగారి 'నీకేం కావాలి' నవలను సినిమాగా తియ్యటం''

''నిజంగా- మీరు సినిమా తీస్తారా?''

''తియ్యాలి ... సాధ్యమోకాదో కానీ కలలు మాత్రం కంటున్నాను''

''హలో-'' అటువైపు వెళ్తున్న గమన వీళ్ళను చూసి ఆగింది.

రేణు సూర్యాన్ని పరిచయంచేసింది. ''మీరొచ్చినందుకు నాకు సంతోషంగా వుంది. రవిగారిని తల్చుకుని ఏడుస్తూ కూచోవాల్సిన సమయంలో మీతో కలిసి కబుర్లు చెబుతోంది. మంచి మార్పుకదూ''



"రవిగారెవరు?" సూర్యం ఆశ్చర్యంగా అడిగాడు.

"ఆమె భర్త - వచ్చిన రోజునుంచీ ఈవిడకు ఆయనమీద బెంగ. ఆయనేమో ఇంతవరకూ ఒక్క ఉత్తరమన్నా రాసినట్లు లేదు"

గమన నవ్వుతుంటే రేణు ముఖం పాలిపోయింది. సూర్యం ఏమనాలో తెలియక నవ్వాడు. గమన 'సీయూ' అంటూ వెళ్ళిపోయింది.

సూర్యం గట్టుమీద చతికిలపడుతూ--

"రవిగారేం చేస్తారు?" అనడిగాడు.

"మా ఆఫీసులోనే"

"ఆయనక్కూడా సినిమాలంటే, సాహిత్యమంటే ఆసక్తేనా అసలు ఇద్దరూ కలిసి వస్తే బాగుండేదిగా-"

"ఆయనకు లీవ్‌లేదు" శక్తంతా కూడదీసుకుని కళ్ళ నీళ్ళను బలవంతాన ఆపుతూ అంది రేణు. రేణు ముఖాన్ని చూసి ఆశ్చర్యపోయాడు సూర్యం.

"ఆయన ఉత్తరం వస్తుందిలెండి- మీరు రాసిన ఉత్తరం అంది. ఆ అడ్రస్‌తో రాయాలి గదా- ఇంకా రెండురోజుల టైముంది- మీరు బాధపడటానికైనా, కోపం తెచ్చుకోటానికైనా"

రేణు ఒక్క వుదుటున లేచి గబగబా హాస్టల్ వైపు నడిచింది.

గదిలో రజనినీ, బీనానీ, మాధవినీ చూసి అది తన గదేనా అని ఒక్కక్షణం ఆగింది.

"రండి రండి మన రూంలో టీ తాగమని పిల్చాను వీళ్లను" అంది గమన.

రేణు వెళ్ళి తన మంచంమీద కూచుంది.

"మీరు 'పరోమా' సినిమా చూశారా-" అడిగింది గమన.

లేదు.

"ఆ సినిమా గురించి మాధవి చెప్తానంటే టీ ఇస్తానని రూంకి పిలిచాను"

"పరోమ సినిమా గురించి రకరకాల విమర్శలు పేపర్లో చదివాం. అది ఫెమినిస్టు సినిమా అని ఇంకేదేదో రాశారు. ఆఖరికి

సినీవిమర్శకుడు ఇక్బాల్ మసూద్‌కూడా ఒక లెవల్లో దాన్ని విమర్శించాడు''

పరోమాని విమర్శించి ఫస్ట్‌వైఫ్ అనే విడాకుల వ్యతిరేక సినిమాని మెచ్చుకున్నాడులే ఇక్బాల్ మసూద్ - తానూ ఒక మగవాడినని పించుకున్నాడు'' కోపంగా అంది బీనా.

''ఇంతకూ అసలు పరోమా సంగతేమిటి అది చెప్పండి.'

''పరోమా అనేది ఒకావిడ పేరు. ఆమెది ఉన్నత కుటుంబం. కాలేజీ చదువు ముగించి పెళ్ళి చేసుకుంటుంది. తర్వాత క్రమంగా సంసారంలో పడిపోతుంది. భర్తకు భార్యగా, పిల్లలకు తల్లిగా, మరుదులకు వదినగా, అత్తకు కోడలిగా ఆ ఇంట్లో ఇమిడిపోతుంది. క్రమంగా తాను పరోమ అనే ఒక వ్యక్తిననీ, తనకు కొన్ని అభిరుచులూ, ఆసక్తులూ వున్నాయని, అసలు తనకంటూ ఒక జీవితం వుందనీ మర్చిపోతుంది. ఇంట్లో అందరి జీవితాలు సక్రమంగా సాగేలా చూడటమే ఆమె జీవితం అవుతుంది. అప్పుడు నలభయ్యావవడిలో ఆమె జీవితంలోకి వస్తాడు రాకేష్‌అనే ఫొటోగ్రాఫర్. ఆమెను కదిలిస్తాడు. ఆమె లోపలివ్యక్తిని బైటికి రప్పిస్తాడు. అతని ప్రేమలోపడుతుంది. అతను కొన్నాళ్ళకు అమెరికా వెళతాడు. భర్తకు ఈ విషయం తెలుస్తుంది. కాంపులకు వెళ్లినపుడు ఇతర స్త్రీలతో సంబంధాలు పెట్టుకోటానికి వెరవని ఆభర్త పరోమ విషయం విని భరించలేకపోతాడు. ఇంటిల్లిపాదీ ఆమెను వెలివేస్తారు. ఆమెకు చెప్పుకునే అవకాశం కూడా ఇవ్వరు. ఆ బాధ భరించలేక రక్తనాళం ఒకటి కత్తిరించుకుని చచ్చిపోబోతుంది. పనిమనిషి చూస్తుంది. హాస్పిటల్‌లో చేరుస్తారు. మతి చలించిందని ఆపరేషన్ చేస్తారు. జుట్టంతా తీస్తారు. ఆమె క్రమంగా కోలుకుంటుంది. కోలుకుంటూ నిర్ణయించుకుంటుంది - తనకాళ్ళమీద తను నిలబడాలనీ, ఎవరిమీదా ఆధారపడగూడదనీ- ఎంత చిన్నఉద్యోగమైనా చెయ్యాలని. ఆమె కూతురు ఆమెను అర్థంచేసుకుంటుంది ... ఇది కథ. దీనిని అపర్ణాసేన్ చిత్రించినతీరు అద్భుతం'' మాధవి ఆయాసపడుతూ ఆగింది.




''స్త్రీకి ఒక ఎఫైర్ పెట్టి దానిని సమర్థించేసరికి మగాళ్ళందరికీ ఒళ్ళు మండిందన్న మాట-'' బీనా అంది.

''ఔను- మా ఆయన ఆ సినిమా చూసి దేశమంతా పాడైపోయిందని తెగ విసుక్కున్నాడు. ఎంత కోపం తెచ్చుకున్నాడో అపర్ణాసేన్ మీద. మా అమ్మకు 70 ఏళ్ళు- నేను కావాలని ఆమెను తీసుకెళ్ళాను. ఆమెకు చాలా నచ్చింది. ఒక స్త్రీ ఈ సినిమా తీసిందని తెలిసి- ఆడదాని మనసు ఆడదే అర్థంచేసుకోగలదు అంది''

''ఎఫైర్ వుండటం తప్పా, రైటా అనేది అపర్ణాసేన్ చర్చించినట్లు లేదు- అది తప్పవనీ, రైటవనీ ఒక ఎఫైర్ జరిగింది. ఆ ఎఫైర్‌తో ఆమె జీవితం నాశనం కావాల్సిందేనా? పోనీ అది తప్పే అనుకుందాం- తప్పు చెయ్యకూడదా? తప్పుచేస్తే ఇక దాన్నుంచి విముక్తి లేదా? మన ఆడవాళ్లకు సమాజం తయారుచేసిన విషవలయాన్ని అపర్ణాసేన్ చూపించింది అనిపిస్తోంది'' రజనీ అంది.

''నేనసలు అది తప్పనుకోను. మగాడికి ఎఫైర్లుండటం లేదా? యంత్రంలా బతుకుతున్న ఆమె జీవితంలో ప్రాణం పోశాడతను. అతన్ని ప్రేమించటం తప్పేమిటి? అతనితో ఆనందించకుండా పవిత్రంగా వుండటంలో అర్థంలేదు'' మాధవి ఆవేశంగా అంది.

రేణుకంతా ఆశ్చర్యంగా వుంది సంతోషంగా వుంది. తాను చదువుకునే రోజుల్లో చలం నవలలు చదివి స్నేహితులతో చేసిన వాదాలు గుర్తొచ్చాయి. చలం గురించి వాళ్లకు చెప్పాలనిపించింది. కానీ ఇంగ్లీషులో చెప్పాలి. పైగా చలం రచనలు చదివి ఎన్నాళ్ళయింది. ఏడేళ్ళు దాటింది. పెళ్ళయ్యాక, ఉద్యోగంలో వచ్చాక తను చాలావాటికి దూరమయింది. ఇల్లూ, ఆఫీసూ, తీరికదొరికితే సినిమాలు- ఒక్క శిరీష తప్ప స్నేహితులు కూడా లేరు.

రవీ, తనూ అదొక ప్రపంచంగా బతికారు. ఆ జీవితం అలాగే సాగితే పిల్లలు పుట్టుకొచ్చి- బాధ్యతలతో తనూ పరోమాలాగా అయిపోయేదా- ఇంకెవరో తనను మేల్కొలిపితే అతనితో సంబంధం ఛీ- ఛీ-- ఏమిటీ ఆలోచనలు! రవి తనను పరోమాలా తయారవనిచ్చే

వాడు కాదు. అతని ప్రేమతో తాను ఎప్పుడూ సజీవంగా ఉండేది. ఐనా ఎందుకీ లేనిపోని ఆలోచనలు--

అందరితోపాటు భోజనంచేసి తొమ్మిదిన్న రకు థియేటర్‌కు వెళ్ళింది.

ముందు సినిమాల గురించి, సినిమా అంటూ ఒక రష్యన్ షార్ట్ సినిమా చూపించా రు. ప్రసిద్ధ దర్శకుల సినిమాలలోనుంచి కొన్ని షాట్స్ చూపించి వాళ్ళు ఆ షాట్‌ని ఎలా రూపొందించారో అన్ని సాంకేతిక వివరాల్తోనూ చెప్పారు. తర్వాత "యాషెస్ అండ్ డైమండ్స్" అనే పోలెండు సినిమా చూపించా రు. రెండవ ప్రపంచయుద్ధం ముగిశాక పోలెండు దేశంలోపలి రాజకీయాలను వివరించే సినిమా. రేణు చాలా ఆసక్తిగా సినిమా చూసింది. సూర్యం ఆమెకు సినిమాకు ముందు పోలెండు రాజకీయాల గురించి చెప్పాడు. సినిమాలో కూడా అక్కడక్కడా ఆమె సందేహాలను తీర్చాడు.

సూర్యం సహాయంతో రెండో ప్రపంచయుద్ధంనాటి పరిస్థితుల గురించి తాను తెలుసుకున్న విషయాలు మననంచేసుకుంటూ నిద్రపోయింది.



## 5

పొద్దున తొమ్మిది గంటలకు హాస్టలునుంచి బైటికి వచ్చిన రేణు అలాగే నిలబడిపోయింది. ఉదయాన్నే వచ్చిన వర్షం చెట్లనీ, పువ్వుల్నీ బాటల్నీ కడిగి వెళ్ళింది. అప్పుడే స్నానంచేసి వచ్చిన రేణుకు ప్రకృతికూడా స్నానంచేసి శుభ్రంగా స్వచ్ఛంగా తయారై నిలుచున్నట్లని పించింది. పువ్వులు తలలూగిస్తూ నవ్వుతూంటే రేకులమీద నుంచి నీటి బిందువులు ముత్యాల్లా కిందపడుతున్నాయి. పూనాలో వర్షాలు తమాషాగా కురుస్తాయి. ఐదునిమిషాలు కురిసి ఆగిపోతుంది. మళ్ళీ పావుగంటలో జల్లు మొదలవుతుంది. పదినిమిషాలు మించి ఎప్పుడూ కురవలేదు. వర్షం ఇంత బాగుంటుందా అనుకుంది రేణు. పూనాలో హాస్టల్లో వుంటూ హాస్టల్‌నుంచి క్లాసుకి మాత్రమే వెళ్తూంటే వర్షాకాలం చాలా బాగుంటుందని నవ్వుకుంది. మామూలు జీవితంలో అయితే వర్షం వస్తోందనగానే బైటికి వెళ్ళలేమనే చికాకు, వెళ్తే కనబడే మురికీ బురదా-- ఇలాకాకుండా వర్షం చాలా హాయిగా, అందంగా ప్రకృతి కాంతకు షవర్‌బాత్‌లా అనిపించింది.

హేమంత్‌గారి క్లాసులో జర్మన్ సినిమా గురించి బుర్రపట్టనన్ని విషయాలు ఎక్కించుకుని సూర్యంతో కలిసి డైనింగ్ హాలుకి వచ్చింది.

అక్కడ టేబిల్‌మీద ఉత్తరాలలో తనకు శిరీష రాసిన ఉత్తరం వుండటం గమనించి రేణు ముఖం వెలిగిపోయింది.

"రవిగారి దుంచా?" అని సూర్యం అడుగుతుంటె ఔనని తలవూపుతూ గబగబా ఆ ఉత్తరం చదివేసింది.

రేణుకిప్పుడు తృప్తిగా వుంది. తనకు ఉత్తరాలు వస్తాయి. సూర్యం, గమనా వున్నారు. ఇక్కడున్నన్నిరోజులూ రవి తనలోనే వుంటాడు. తను శ్రద్ధగా ఈ కోర్సులో విషయాలు నేర్చుకోవాలి. జీవితంమీద ఆసక్తిపెంచుకోవాలి.

"ఇక నాతో మాట్లాడరా ఏంటి?" తమాషాగా అడిగాడు సూర్యం. నవ్వేసింది. సూర్యంతో కబుర్లు చెబుతూ భోజనం ముగించి గదికి వెళ్ళి శిరీషకు ఉత్తరం రాసింది.

"ప్రియమైన శిరీషా--

నేనిక్కడికి రావటం చాలా మంచిదయ్యిందని రోజురోజు నా అనుభవాలు చెబుతున్నాయి. ఇన్నాళ్ళూ నేనూ, నా విషాదమే ప్రపంచంగా బతికాను. కానీ ప్రపంచంలో వున్న విషాదంతో పోల్చిచూస్తే నాది చాలా చిన్నదని గమన, సూర్యంవల్ల తెలుస్తోంది. రవి నేనెంత దుఃఖించినా తిరిగిరాడనీ, మిగిలివున్న నేనైనా

జీవచ్ఛవంలాకాక మనిషిలా బతకాలనీ ఇక్కడి కొచ్చాకే అనిపిస్తోంది. నన్ను ఇక్కడకు పంపింది నువ్వేకదూ–

సూర్యంగారి గురించి నీకు తెలియదుగదూ– విజయవాడనుంచి వచ్చారు. అక్కడ కాలేజీలో లెక్చరరు. ఆయనకు ఎన్ని విషయాలో తెల్సు. సినిమాల గురించికూడా చాలా బాగా తెలుసు. సూర్యంగారు తెలవకముందు కొన్ని సినిమాలు నాకు అర్థమయ్యేవికావు. ఇప్పుడు చాలావరకు నుందే ఆయన సినిమా గురించి చెప్తున్నారు. అసలు సినిమాకి ముందు మా టీచర్స్ చాలావరకు విషయాలు చెబుతారు. ఐతే వాళ్ళు ఒక స్థాయిలోవున్న విషయాలను చెబుతారు. నా అంత అజ్ఞానంగా వున్నవాళ్ళు ఈ కోర్సుకొస్తారని వాళ్లెందుకనుకుంటారు. వాళ్ళు చెప్పని విషయాలు సూర్యంగారు చెప్తారు.

నిన్న ఇక్కడ మా గమన స్నేహితులంతా 'పరోమా' అనే సినిమా గురించి చర్చించారు. ఆడది ఇంటి పనుల్లో కూరుకుపోయి జీవితంలోని అందాలకూ, ఆనందాలకూ దూరం కాకూడదని వీళ్ల ఉద్దేశం. మగవాళ్ళకు ఎఫైర్స్ వుండటం తప్పుగాకపోతే ఆడదానికి వుండటంలో తప్పేముంది అంటారు. నాకు చలంగారి నవలల గురించి చెబుదామనిపించింది. భాష రాక వూరుకున్నాను. ఇక్కడ నాకుపకరిస్తున్న ముఖ్యమైన విషయం- వీళ్లు ఇచ్చిన టైమ్‌టేబిల్. ఉదయం తొమ్మిదిన్నర నుంచీ రాత్రి ఒంటిగంటవరకూ తీరికలేని ప్రోగ్రాం. అంతాకూడా విపరీతంగా కష్టపడి ఆలోచించి అర్థంచేసుకోవాల్సిన ప్రోగ్రాం. అందువల్ల నాకు ఇతర ఆలోచనలు రాకుండా హాయిగా వుంటోంది. ఇప్పుడిక క్లాస్‌కి టైమయింది. మళ్ళీ రాస్తాను''

ఉత్తరం మెయిన్ గేటు దగ్గరవున్న పోస్టు డబ్బాలో పడేసి పరిగెత్తినట్లే క్లాసుకి వెళ్ళింది.

క్లాసంతా నిశ్శబ్దంగా వుంది. కుర్చీలో ఒక ముసలాయన కూచుని వున్నాడు. హేమంత్, రమేష్ ఇంకా చాలామంది టీచర్లు ముందు వరసలో కూచున్నారు. చాలాసేపు వెతికాక ఓ మూల ఖాళీ కుర్చీ కనిపించింది. వెళ్ళి కూచుని టైమ్‌టేబిల్ చూస్తే భారతీయ సినిమా గురించి ధారప్ అనే ఆయన క్లాసు. ఈయనా ధారప్ అనుకుంటూ మళ్ళీ ఆయన వంక చూసింది. ముడతలు పడిన శరీరం, వున్న కాస్త జుట్టూ తెల్లగా మెరుస్తోంది. చప్పిదవడలు.

ఈయన పాఠం చెప్పగలడా– అందులో రోజూ హేమంత్, రమేష్‌ల పాఠం వింటున్న విద్యార్థులకు... అనుకుని పెన్ తియ్యటంకూడా అవసరమేమో అనుకుంటూనే పర్సులోంచి పెన్‌తీస్తోంది.

ఆయన పాఠం మొదలెట్టాడు.

**1896** జులై **17**న బొంబాయిలో వాట్సన్ హెూటల్‌లో జరిగిన కదిలే బొమ్మల ప్రదర్శన దగ్గర్నుంచీ ప్రారంభించాడు. ప్రపంచంలో మొదటి సినిమాలు అని హేమంత్ అంతకు ముందు చూపించిన చిన్నచిన్న సినిమాలను ఆరోజు బొంబాయిలో ప్రదర్శించారట. సరిగ్గా అదేరోజు రష్యాలో కూడా చూపించారట. ట్రైన్ స్టేషన్‌లోకి వస్తున్న దృశ్యం ఒక సినిమా- అది చూసి హాల్లోని ప్రేక్షకులు సగంమంది బైటికి పరిగెత్తారట. రైలెక్కడ మీదికొస్తుందోనని. అలా మొదలుపెట్టి జె.ఎఫ్.మదన్, సాహిదాదా, రఘుపతి వెంకయ్యానాయుడు- వీళ్లగురించి చెప్పాడు. క్రమంగా క్లాసులో విద్యార్థులంతా క్లాసురూంలోంచి మాయమై భారతీయ సినిమా ప్రపంచంలో తిరగటం మొదలెట్టారు. భారతీయ సినిమా, దాని ప్రారంభం, దాని చరిత్ర, దాని వైభవం, ఆ సినిమా వల్ల కలిగిన సాంఘిక రాజకీయ ఆర్థిక పరిణామాలూ, వీటన్నింటిలోకీ వాళ్లనాయన ఎలా తీసుకెళ్ళాడంటే ఏ ప్రమాదమూ లేని నీటి ప్రవాహంలోకి చెయ్యిపట్టుకొని తీసుకెళ్ళి ఆ అలలమీద అలాఅలా నృత్యంచేయించి, సుందరమైన అద్భుతమైన దృశ్యాలు చూపించి ఆనందపెట్టి ఆశ్చర్యపరచి హఠాత్తుగా మళ్ళీ ఇక్కడ ఈ నాలుగుగోడల మధ్య గచ్చుమీదకు చెక్కకుర్చీలోకి చేర్చాడు.

ఆయన పాఠం ఆపగానే రెండునిమిషాలు నిశ్శబ్దం. మరుక్షణంలో చెవులు బద్దలయ్యేలా చప్పట్లు. చాలామంది ఆయన చుట్టూ మూగారు. రేణు కాస్త ఎడంగా నుంచొని ఆయన్ని




చూస్తోంటే సూర్యం వచ్చాడు.

అరవింద్ అనే అబ్బాయి ధారప్‌ని ఫొటోలు తీస్తున్నాడు. సూర్యం రేణు చెయ్యి పట్టుకొని ధారప్ దగ్గరకు లాక్కువెళ్ళి-

"అరవింద్... ఒక్కఫొటో ప్లీజ్" అన్నాడు.

అరవింద్- "ష్యూర్" అంటూ ముగ్గురినీ ఫొటోతీశాడు.

"ఎందుకలా చేశారు?" అంది రేణు కాస్త కోపంగా.

"మీ కళ్లల్లోకి చూస్తే తెలిసింది. మీరు ధారప్‌గారిని ఎంతగా ప్రేమిస్తున్నారో. ఇంకో నాలుగురోజుల్లో అది కేవలం జ్ఞాపకంగానే మిగిలిపోతుంది. ఈ ఫొటో మీ ప్రేమకు సాక్ష్యంగా వుంటుంది"

"ప్రేమ అంటే-" ఇబ్బందిపడింది.

"భయపడకండి. నేను మంచిఅర్థంతోనే అన్నాను. అయినా మీరే కాదు- ఇవాళ ఆయనని ప్రేమించనివాళ్ళెవరు? మన హృదయాలను జయించాడు. ఏ అందమూ లేని ఆ ముసలాయన పెద్ద స్టార్‌లా వెలిగిపోయాడు. జ్ఞానసౌందర్యంతో ప్రకాశించాడు"

సూర్యం అనుభూతిని అర్థంచేసుకున్న రేణు మనసు ఎందుకో తెలియని ఆనందంతో నిండిపోయింది. మనలాగే ఆలోచించేవాళ్ళూ అనుభూతి చెందేవాళ్ళూ పక్కనుండి మనతో వాళ్ళ అనుభూతులను పంచుకుంటుంటే కలిగే ఆనందమని రేణుకపుడు స్పష్టంగా అర్థంకాలేదు.

సూర్యం ఇంకా ఆ ఆనందపు మత్తునుంచి తేరుకున్నట్లు లేదు.

"ఆయన చెప్పిన విషయంమీద ఆయనకెంత ప్రేమంటే మనం ఆయన చెప్పిన విషయాన్నీ ఆయన్నీ కూడా అంతగాఢంగానూ ప్రేమించగలిగాం. వండర్‌ఫుల్ మాన్"

ఇద్దరూ ఆ విషయాలే చెప్పుకుంటూ మెయిన్ థియేటర్‌కి నడిచారు.

"జోన్ ఆఫ్ ఆర్క్" అనే ఫ్రెంచ్ సినిమా.

"మీకు జోన్ ఆఫ్ ఆర్క్ గురించి తెలుసుగా"

"తెలుసు" నవ్వింది రేణు.

"బి.ఎ.లో షా నాటకం టెక్స్ట్‌గా వుంది"

అంతకుముందు వాళ్లనుభవించిన ఆనందమంతా ఎటుపోయిందో- సినిమా క్రమక్రమంగా వాళ్ల హృదయాల్లో విషాదాన్ని నింపేసింది. అదెప్పుడో 1920లో తీసిన సినిమా. కానీ అనుభూతిని కలిగించటంలో ఇప్పటికీ అలాంటి సినిమా లేదేమో అనిపించింది రేణుకు. ధారప్‌గారి ఉపన్యాసంతో తేలికైన మనస్సు బరువెక్కింది. జోన్ ముఖం మీదే కెమేరా పూర్తిగా కేంద్రీకరించారు. ఆ ముఖంలో, ఆ కళ్లలో కనిపించే వేదన ప్రేక్షకుల హృదయాలను పిండేస్తుంది.

"అలా కొండమీదికి వెళ్లకూడదూ?" అడిగాడు సూర్యం థియేటర్‌లోంచి బైటికి వస్తూనే.

"పదండి" మరో ఆలోచనలేకుండా అంది రేణు. ఈ బరువుతో రూంకెళితే మళ్ళీ తను పూర్వపుస్థితికెడుతుందేమోనని భయంగా వుంది. అందుకే సూర్యం అడగ్గానే ఒప్పుకుంది.

చల్లగాలిలో కొండమీదకు ఎక్కుతూ సూర్యం తానెక్కిన పెద్దపెద్ద కొండల్ని గురించి చెప్పాడు.

రేణు వింటూ, అతను వేసే జోక్‌లకు నవ్వుతూ క్రమంగా మామూలయింది.

"మిమ్మల్ని చూస్తుంటే నాకు చాలా ఆశ్చర్యంగా వుంటుంది హాయిగా సంసారంచేసుకుంటూ హఠాత్తుగా పూనా ఎందుకొచ్చారా అని"- రేణు ముఖంలో అప్పుడప్పుడూ కనిపించే విషాదం, రవి పేరు వినగానే ఆమెలో కలిగే తడబాటూ చూసి సూర్యానికి అనుమానం వచ్చేది- ఈవిడ భర్తతో బాగా గొడవపడి వచ్చిందేమోనని. రేణు అమాయకత్వం, సినిమాల గురించీ, రాజకీయాల గురించీ ఆమెకున్న పరిమిత జ్ఞానం ఇవన్నీ చూస్తే- ఈమె ఇలా ఒంటరిగా పూనా ఈ కోర్సుకి రావాల్సింది కాదు అనిపించేది.

రేణు మాట్లాడకుండా ఓ బండమీద కూచుంది.

రేణు ముఖం చూసి ఆ ప్రస్తావన మానేశాడు.

ఆ కొండమీద ఆ సాయంత్రం ఎంత ప్ర

శాంతంగానే వుంది. చుట్టూ పచ్చని చెట్లు. గూటికి చేరుతున్న పిట్టలు, దూరంగా కనిపిస్తున్న మనుషులు.

రేణు అప్రయత్నంగా పాడింది

"ఆకులో ఆకునై పూవులో పూవునై
ఈ అడవి దాగిపోనా—"

"అదేంటి... ఆపేశారేం- పాడండి చాలాబాగుంది మీగొంతు-"

"ఊరికే... ఈ వాతావరణంలో ఆ పాట గుర్తొచ్చింది" సంజాయిషీ చెబుతున్నట్లుగా అంది.

"ఔను... సహజం. పూర్తిగా పాడండి"

"నాకు పాటంతా గుర్తులేదు"

"నాకు గుర్తుంది- నే చెబుతా- పాడండి"

సూర్యం ఒక్కొక్క చరణం చెబుతుంటే రేణు పాడింది.

"ఇంకో పాట పాడరూ?" దీనంగా అడిగాడు సూర్యం.

"నాకు పాడటం వచ్చుగానీ పాటలురావు"

"నా దగ్గర కృష్ణపక్షం, ఎంకిపాటలూ- రెండు పుస్తకాలూ వున్నాయి. రేపు మీరు పాడాలి... తప్పదు"

"ఎందుకు తెచ్చారవి?"

"మీకోసం కాదులెండి నాకోసమే ఇంకో ఆంధ్రుడిక్కడ వుంటడనే నమ్మకంతో చక్కటి తెలుగు పుస్తకాలు నాలుగైదు తెచ్చుకున్నాను. తెలుగుమీద బెంగగా అనిపించినప్పుడల్లా అవి చదువుకోవచ్చని"

ఇద్దరూ కొండదిగి హాస్టల్ కెళ్ళేసరికి ఎనిమిది ముప్పావయింది.

రేణు భోజనంచేసి అలసటగా కళ్ళు మూసుకుంటే అనుకోకుండా నిద్రపట్టింది.

గమన గబగబా కుదిపితేగాని లేవలేదు.

"ఇప్పుడేం సినిమానో తెలుసా? తెలిసే నిద్రపోతున్నావా?"

"ఏం సినిమా" విరాగ్గా అడిగింది "కురసోవా సినిమా- సెవెన్ సమురాయ్"

"అయితే ఏంటి-- నేను రాను... నాకు నిద్రొస్తోంది."

"నిద్రపో- రేపు ఆ సినిమా చూడలేకపోయినందుకు ఏడిస్తే మాత్రం నేనూరుకోను"

రేణు మాట్లాడలేదు. నిద్రలోపడింది.

గమన లేపి కూచోబెట్టింది. కాసిని చన్నీళ్ళు తెచ్చి ముఖం తుడిచింది.

"కురసోవా- జపాన్ దర్శకుడు. పూనా వచ్చి అతని సినిమా చూడకుండా నిద్రపోతావా"

రేణు బద్ధకంగా లేచి గమనను తిట్టుకుంటూ ముఖం కడుక్కుని వచ్చింది.

గమన రేణునిలా బతిమాలి లేపటం ఉమకి నచ్చలేదు. ఆ నచ్చనితనాన్ని ముఖంలో ప్రకటింపజేస్తూ కూచుంది.

ముగ్గురూ థియేటర్‌కి వెళ్ళారు

థియేటర్‌లోకి వెళ్ళాక ఎవరిదారివారిదే. గమన రజనీ బీనాల దగ్గరో, ఇంకెవరో అబ్బాయిల పక్కనో కూచుంటుంది.

ఉమ ఈమధ్య అరవింద్ పక్కన కూచుంటోంది. అరవింద్ థియేటర్‌కికూడా నోట్స్ తీసుకొచ్చి మంచి విషయాలు గమనించి రాసుకుంటాడు. ఎప్పుడూ వాగుతుండే ఉమని అరవింద్ ఎలా భరిస్తున్నాడబ్బా అనుకుంది రేణు.

సూర్యం కలిశాక రేణు- సూర్యం పక్కపక్కనే కూచుంటున్నారు.

దీప్తి- రుద్రాక్షలబ్బాయీ అచ్చం ప్రేమికుల్లాగానే తిరుగుతున్నారు.

హాలంతా కలయజూస్తుండగా సూర్యం వచ్చాడు. సినిమా మొదలయింది.

మొదటినుంచీ కురసోవా ప్రతిభ కనబడుతూనే వుంది. ఒక గ్రామంలో ప్రజలు బందిపోటు దొంగల బారినుంచి తమ పంటను రక్షించుకోటానికి ఏడుగురు సమురాయ్‌లను తెచ్చుకుంటారు. ఆరుగురిని నాయకుడు ఎన్నుకున్న తీరూ, ఒక్కొక్కరి ప్రత్యేకతా చాలా చక్కగా చిత్రీకరించాడు. ఏడోవాడు ఎందుకూ పనికిరానివాడని మిగిలినవాళ్ళ అభిప్రాయం. కానీ అతనే అందరికంటే సిన్సియర్‌గా తెలివిగా వుంటాడు.

చివరకు బందిపోట్లను చంపేస్తారు. కథ చిన్నది, మామూలుదయినా దానిలోవున్న




మానవత్వం కారణంగా గొప్ప చిత్రమయింది. రైతులు ఏడుగురు సమురాయ్‌లనూ పోషిస్తూ అనుకుంటారు-

"మనం బందిపోట్లు వస్తారనే భయంతో వీళ్ళను మేపుతున్నాం. తీరా బందిపోట్లు రాక పోతే తిండి దండగేగదా-" అని.

మామూలు రైతుల ఆలోచనా ధోరణిని అడుగడుగునా ప్రదర్శించి అద్భుతం అని పించాడు కురసోవా.

ఆ సినిమా మిస్ కాకుండా చేసినందుకు గమనకు థాంక్స్ చెప్పి నిద్రపోయింది రేణు.

★ ★ ★

మర్నాడు ఉదయం క్లాసులో రష్యన్ సినిమా, అందులో వచ్చిన మార్పుల గురించి హేమంత్ చెప్పారు. 'బ్యాటిల్ షిప్ పొటెమ్ కిన్' అనే సినిమాలో ఒడెస్సా స్టెప్స్ సన్నివేశా న్ని చూపించి కొంత వివరించారు.

పొటెమ్‌కిన్ అనే నౌకలో వస్తున్న తిరుగుబా టుదార్లకు స్వాగతం చెప్పడానికి తీరానికి వచ్చిన ప్రజలను మూకుమ్మడిగా కాల్చేసిన సన్నివేశం-- ఐసన్‌స్టీన్ ఆ సన్నివేశంలో మంటాజ్ పద్ధతిని ఎలా అనుసరించాడో, ఒక్క షాట్‌లోనే మంటాజ్‌నెలా సాధించాడో హేమంత్ వివరించాడు. మెట్లమీద నుంచి కిందకు పరిగెత్తుతున్న జనం, వెంటబడి తరు ముతున్న సైనికులు కదలిక అంతా ఎత్తు నుంచి పల్లానికి వుంటుంది. ఆ కదలికలో మొత్తం అశాంతినీ, అలజడినీ, తిరుగుబా టునీ చూపించగలిగాడు.

అధికారాన్నీ తిరుగుబాటునీ క్రౌర్యాన్నీ భయాన్నీ మంటాజ్ పద్ధతిలో ఐసన్‌స్టీన్ చూ పించినతీరు వివరించి ఒక అరగంట టీ బ్రేక్ ఇచ్చాడు హేమంత్. సూర్యం ఎందుకో హడావు డిగా మెన్స్ హాస్టల్‌వైపు వెళ్లాడు. ఎందుకలా వెళ్లాడా అనుకుంటూ టీ తెచ్చుకుని సిమెంటు బెంచీమీద ప్రకృతిని చూస్తూ కూచుంది రేణు.

ఇంకో అబ్బాయికూడా వచ్చి ఆ బెంచీమీదే కాస్త దూరంలో కూచున్నాడు.

ఇరవయ్యేళ్ళు కూడా వుండవేమో-- ఇంకా చిన్నతనం వదలనట్లే వుంది ముఖం.

అతన్ని పరీక్షగా చూస్తే గుర్తొచ్చింది అతని పేరు మనోహర్. క్లాసులో చాలా తెలివైన ప్రశ్న లు అడుగుతాడు. ఇంత చిన్నపిల్లాడికి అన్ని విషయాలెలా తెలుసో అనుకుని మళ్ళీ అత న్ని చూసింది.

ఎందుకోగాని చాలా విచారంగా వున్న ట్లుంది అతని ముఖం. చాలా ఒంటరిగా ఉదాసీనంగా ఏ ఆసక్తి లేనివాడిలా కూచున్న అతన్ని పలకరించాలనిపించింది.

"ఎలావుంది ఈ కోర్సు మీకు?"- చిరున వ్వుతో అడిగింది.

"కోర్సుకేం-- చాలా బాగుంది. కానీ..." అంటూ గాఢమైన నిట్టూర్పు వదిలాడు.

"ఎక్కడనుంచి వచ్చారు మీరు?"

"కలకత్తా నుంచి" ప్రతి మాటలో విషా దమే.

"ఇంటిమీద బెంగపెట్టుకున్నారా?" చాలా జాలిగా అడిగింది.

"బెంగా- పాడా?"

"మరెందుకలా దిగులుగా కూచున్నారు?"

"లెక్చర్స్, సినిమాలూ, ఈ వాతావరణం అన్నీ బాగున్నాయి. కానీ, నేనింకా చాలా ఫన్ కోసం వచ్చాను. చాలామంది అమ్మాయిలు- అబ్బాయిలు వుంటారు. ఆ గుంపులో బోలెడు ఫన్ వుంటుందని ఆశపడ్డాను"

రేణుకు చిరాకనిపించినా అణుచుకుని-

"ఫన్ కావాలంటే అడ్డేమిటి- నిజంగానే చాలామంది అమ్మాయిలూ అబ్బాయిలూ వున్నారుగా-- హాయిగా మీ ఇష్టం వచ్చినట్లు గడపొచ్చుగా" అంది.

"గడపొచ్చు-- మా అత్తయ్య లేకపోతే. ఖర్మ గాని మా అత్తయ్యకూడా కోర్సుకి వచ్చింది. నాకు ముందుతెలిస్తే మానేసేవాడిని"

రేణుకు అతని బిక్కముఖం చూసి నవ్వాగ లేదు.

"ఎవరు మీ అత్తయ్య?"

"మాధవి"

"మాధవా!" రేణు ఆశ్చర్యపోయింది.

ఆడవాళ్ళకు మగవాడి రక్షణ అనుక్షణం అవసరంలేదని వాదించే మాధవి-- ఆడవాళ్ల

ళకు ఎఫైర్స్ వుంటే తప్పేమిటనే మాధవి- ఆ మాధవి ఇతని 'ఫన్' చూసి ఏమనుకుంటుందో అని ఇతని భయం.

ఇతని 'ఫన్' ఎలాంటిదో

క్లాసుకు వెళితే ఒంటిగంటవరకూ ఒకటే నవ్వులు. సైలెంట్ కామెడీ గురించిన క్లాసు. సెన్నెట్, చాప్లిన్‌ల గురించి చెప్పారు. చాప్లిన్‌కి ముందున్న కామెడినీ స్లాప్‌స్టిక్ కామెడీ అంటారు. అందులో పాత్రలకు ప్రాధాన్యతలేదు. పాత్రలెవరో, ఏమిటో, ఎందుకలా ప్రవర్తిస్తున్నారో ప్రేక్షకులకు తెలియదు. ఆ పాత్రలు చేసే వింత చేష్టలు నవ్వు పుట్టించేవి. చాప్లిన్ మొదటిసారిగా కామెడీలో పాత్రను ప్రవేశపెట్టాడు అని చెబుతూ చాప్లిన్ సినిమాల నుంచి కొంత భాగాన్ని చూపించారు.

క్లాసునుంచి వచ్చి భోజనం చేస్తుంటే హఠాత్తుగా 'శంకరాభరణము' అని వినిపించి టీవీ వైపు చూసింది రేణు.

ఆరోజు టి.వి. నేషనల్ ప్రోగ్రాంలో తెలుగు సినిమా. రేణు హడావుడిగా గమన కోసం చూసింది. గమన చూస్తూనే వుంది.

రెండున్నరవరకూ చూసి క్లాసుకు బయల్దేరారు. 'ఇది తెలుగులో గొప్ప సినిమా అటగదా' అడిగింది గమన.

ఔను-

"కావచ్చు- నాకు తెలియదుగానీ- ఈ కాస్త చూశానుగదా ఫొటోగ్రఫీ చాలా ఫ్లాట్‌గావుంది"

రేణుకు బాధనిపించినా మాట్లాడకుండా వూరుకుంది. క్లాసులో మళ్ళీ ఎవరో కొత్తాయన ఎక్స్‌పెరిమెంటల్ సినిమా గురించి చెప్పటానికి వచ్చాడు. సూర్యం పక్కన కుర్చీ ఖాళీగా వుంటే వెళ్ళి కూచుంది.

"ఇందాకలా హడావుడిగా వెళ్ళారేం... భోజనానికి కూడా రాలేదు?"

"రష్యన్ ముంటాజ్ గురించి నాదగ్గరో పుస్తకం వుంది. అరవింద్ అడిగితే తేవటానికి వెళ్ళాను. లంచ్ టైంలో ఆవిషయం గురించి చర్చించుకుంటూ కాంటిన్‌లో భోంచేశాను"

"నాతో మాట్లాడటం మీకు బోరుగా



వుంటుందా?"

హఠాత్తుగా అడిగింది రేణు.

"అదేంటి- అలా ఎందుకనుకుంటున్నారు?" కంగారుపడ్డాడు సూర్యం.

"నాకు చాలా విషయాలు తెలియవు. మీ స్థాయిలో వున్నవాళ్ళతో చాలా విషయాలు మాట్లాడుకోవచ్చు. నాతో అన్నీ పిచ్చిపిచ్చి మాటలు మాట్లాడాలి. నా కంపెనీ మీకు విసుగ్గా వుండొచ్చు" గబగబా అనేసింది. మొత్తం క్లాసులో తానే అజ్ఞానిననీ, మిగిలినవాళ్ళంతా చాలా తెలిసినవాళ్ళనీ రేణుకొక అభిప్రాయం ఏర్పడింది. ఆ అభిప్రాయమే సూర్యం దగ్గర ఇలా బైట పడింది.

సూర్యం ఏదో చెప్పబోతుండగా క్లాసు మొదలయింది. అమెరికన్ సర్రియలిస్టు సినిమాలు చూపిస్తూ చెబుతున్నాడాయన. 'మెషిన్ ఆఫ్‌ది ఆఫ్టర్ నూన్' అనే సినిమా ఒక్క ముక్క అర్థంకాలేదుగానీ భయంపుట్టింది. తర్వాత 'దిబెడ్' అనే సినిమా మొదలయింది. ఒక







అడవిలో అందమైన మంచం. ఆ మంచంమీద రకరకాల మనుమలు కొందరు నగ్నంగా. ఒక్క నూలుపోగు లేకుండా ఆడమగా మనుమలు కనిపించేసరికి బిత్తరబోయింది రేణు. పక్కన సూర్యం వున్నాడని గుర్తుకు వచ్చి ముడుచుకుపోయింది. కానీ చిత్రం ఆ నగ్నదృశ్యాలలా వస్తూనే వున్నాయి. క్రమంగా రేణు సినిమాలో లీనమయింది. అవి అసభ్యంగాగానీ అనుచితంగాగానీ లేవు. మామూలుగా సహజంగా ప్రకృతిలో ఒక భాగంగానే వున్నారా మనుమలు- జుగుప్స కలగటంలేదు.

మామూలుగా వాళ్ళకు బట్టలున్నట్టే చూసింది రేణు. దర్శకుడు ఎలా దాన్ని సాధించగలిగాడో సూర్యాన్ని అడగాలనిపించింది.

కానీ క్లాసవగానే 'రండి' అంటూ కాంటిన్‌కి తీసుకెళ్లి క్లాసు తీసుకున్నాడు.
ప్రపంచంలో అన్నీ తెలిసిన వాళ్ళెవరూ వుండరనీ, రేణు తక్కువతనంతో ఫీలవకూడదనీ ఆపకుండా పదినిమిషాలు చెప్పి- "మీరన్నారే- మీతో మాట్లాడితే వినుగని- అది ఏరకంగానూ నిజంకాదు. ఒకవేళ మీరొక అజ్ఞాని అనీ, నేనొక జ్ఞానిననీ నాకు అహంకారం వున్నా మీతో మాట్లాడటం నాకు ఆనందమే. ఏదో తెలుసన్న నా అహం మీలాంటి అమాయకుల దగ్గరే గదా తృప్తి పడేది. కాబట్టి పిచ్చి ఆలోచనలు మానుకోండి- టీతాగండి" అని గద్దించాడు. రేణు మాట్లాడకుండా టీ తాగి సూర్యం వెనకే థియేటర్‌కి నడిచింది.

తీరా ఆరోజు ఆదివారం కాబట్టి సాయంత్రం సినిమాలు లేవు- విశ్రాంతి."గురువారం కరెంటుపోయి క్లాసులు జరగలేదు గాబట్టి ఆ క్లాసులివాళ జరిగాయి. చూశారా- ఇద్దరం ఎంత అజ్ఞానంగా వున్నామో" అన్నాడు సూర్యం.

"అసలివాళ ఆదివారమనే స్పృహే లేదు నాకు. ఇక్కడికొచ్చాక తారీకులూ, వారాలూ అన్ని మర్చిపోయా. మనం వొచ్చి ఎన్నిరోజులయింది? ఒక్క ఆదివారం ఈ పాటికి నేనూ, శిరీషా ప్రయాణపు హడావుడిలో వున్నాం"

"శిరీష ఎవరు?" సూర్యం అడిగాడు.

"నా ఫ్రెండ్- చాలా మంచి స్నేహితురాలు. ఆమె మూలంగానే నేనిక్కడకు వచ్చాను. తనే నాచేత అప్లయి చేయించి బలవంతంగా ఇక్కడకు పంపింది"

'మరి రవిగారి 'సంగతేమిటి' అని అడగబోయి మానేశాడు సూర్యం.

రవికీ, రేణుకూ ఏవో గొడవలొచ్చాయనీ, అందుకే ఈవిడిటు వచ్చిందనీ సూర్యానికి నమ్మకం కలిగింది. ఇక ఆ ప్రస్తావన తేవటం అనవసరమని 'మరినేను రూం కెళతాను' అన్నాడు.

"ఇప్పట్నించీ ఏంచేస్తారు?"

"ఎక్స్‌పరిమెంటల్ సినిమా గురించి లైబ్రరీలో ఓ పుస్తకం తీసుకున్నాను. ఇవాళది పూర్తిచేస్తా. ఇంతకంటే మనకి టైమ్ దొరకదు

రేణు కూడా హాస్టల్‌కి వచ్చింది. గమనా, ఉమా గట్టిగా మాట్లాడుకుంటున్నారు. అదేమిటో అర్థం చేసుకునే ప్రయత్నం కూడా చెయ్యకుండా మంచంమీద వాలింది.

ఉమ విసురుగా గదిలోంచి బైటికి నడిచింది. గమన గొణుక్కుంటూ పడుకుంది.

"ఏంటి గొడవ?" కళ్ళు తెరిచి అడిగింది.

"బజారువెళ్దామంటుంది. ఇద్దరం దేనికి- నువ్వెళ్ళు లేదా ఏంకావాలో చెప్పు- నేవెళ్ళి తెస్తాను అంటే కోపం. నాకావిడతో వెళ్ళాలంటే పెద్దబోర్. పైగా ఇప్పుడు నాకింకో ప్రోగ్రాం వుంది"

"ఏం ప్రోగ్రాం... డ్రింకా?" రేణు లేచి కూచుంది.

"కాదు... ఇవాళ మన మెస్‌కి శలవు. రాత్రికి కూడ భోజనం వుండదు. నేనూ, బీనా, రజనీ చైనీస్ రెస్టారెంట్‌కి వెళ్దామనుకున్నాం"

"రాత్రికి భోజనం వుండదా?"

"వుండదు- మీరూ వస్తారా?"

రేణుకెందుకో వెళ్ళాలనిపించలేదు. గమన ఎత్తిగి ఆమె టేప్‌రికార్డర్ తీసుకుని పాటలు వింటూ పడుకుని నిద్రపోయింది.

★ ★ ★

మొదటి రెండువారాల అనుభవాలతో రేణుకు ఆ ప్రదేశం, వాతావరణం, మనుషులూ అంతా అందరూ ఎప్పటినుంచో తెలుసున్నట్లు అలవాటయిపోయింది. గమన, సూర్యంల స్నేహంతో క్షణం వూపిరాడనివ్వని కార్యక్రమాలతో రోజులు త్వరగా గడిచిపోతున్నాయి. సినిమాలను అర్థం చేసుకోవాలనే పట్టుదలతో మనసంతా కేంద్రీకరించి చూస్తోంది. పాఠాలను అతి జాగ్రత్తగా విని నోట్సు రాసుకుని మననం చేసుకుంటోంది. సూర్యం ఆమెకు సహాయపడుతున్నాడు.

ఆరోజు 'దిహాండ్' అనే చిన్న సినిమా చూసివచ్చి సూర్యాన్ని పక్కకు పిలిచింది.

"ఈసినిమా గురించి నాకర్థమయింది చెబుతాను. అది తప్పో రైటో మీరు చెప్పాలి" అని అడిగింది.

రేణు ఉత్సాహాన్ని చూసి సూర్యం గబగబా బోధివృక్షపు గచ్చుమీద కూచుని బుద్ధుడిలా పోజుపెట్టి—

"చెప్పండి— మీ జ్ఞానం ఎంత పెరిగిందో చూస్తాను?" అన్నాడు. తీరా మొదలెట్టబోయేసరికి రేణూకు ఎక్కడలేని మొహమాటం వచ్చింది.

"అన్నీ మీకు తెల్సిన విషయాలే--"

"చెప్పండి--"

రేణు "దిహాండ్" అనే ఆ చెకొస్లొవేకియా సినిమాని గుర్తు తెచ్చుకుంది. అదంతా పప్పెట్స్‌తో తీసిన సినిమా. ఒకచిన్న ఇల్లు. అందులో ఓ మనిషి-- (ఇవన్నీ పప్పెట్స్) అతను నిద్రలేచి పూలమొక్కకు నీళ్లు పోసి బ్రెడ్ తయారు చేసుకుంటుంటాడు. కిటికీలో వున్న పూలకుండీని కిందకు నెడుతూ ఒకపెద్ద చెయ్యివచ్చి అతను చెయ్యబోతున్న పని ఆపి ఆపిండితో ఒక చెయ్యి బొమ్మ చేసి అక్కడ పెడుతుంది. ఇతను దాన్ని పాడుచేసి ఆ చెయ్యిని బైటకి నెడతాడు. ఆచెయ్యి బైటనుంచి ఓ పెట్టిని ఇంట్లో పడేస్తుంది. ఆ పెట్టెలో ఒకఫోను. ఆ ఫోనులో నుంచి ప్రతిక్షణం ఆజ్ఞలు. ఆఫోను పీకి అవతల పారేస్తాడితను. తర్వాత ఆచెయ్యి టి.వి.ని పంపుతుంది. అందులోనుంచీ ఆజ్ఞలే— అది పీకిపారేస్తాడు. తర్వాత న్యూస్ పేపరు - దాన్నీ అవతల

పారేస్తాడు. ఈలోపల ఆచెయ్యి చాలాసార్లు పూలతొట్టిని పగలగొట్టటం, ఇతనా మొక్కనువే రే తొట్టిలో పెట్టటం జరుగుతుంటుంది. చివ రకు ఆచెయ్యి ఇతన్ని బంధించి నడిపిస్తూ ఓ పెద్దబండ దగ్గరకు తీసుకెళ్లి దాంతో బొమ్మను చెక్కమంటుంది. ఇతను ఆ బండమీద చె క్కుతుంటే పైపై పెచ్చంతా రాలి లోపల అదివరకే చెక్కి వుంచిన పెద్దచెయ్యి బొమ్మ బైటపడుతుంది. ఇతను భరించలేక తిరగబ డి పారిపోయి ఇంట్లోకొస్తాడు. మళ్లీ చెయ్యితో పోరాటం. చివరకు బ్రహ్మాండమైన శక్తితో ఆచె య్యి ఇతన్ని చంపేస్తుంది. ఆ తర్వాత చాలా సున్నితంగా అతని శవాన్ని పేటికలో పెట్టి పువ్వులుంచి అతని బుగ్గలకు ఎర్రరంగు పూసి స్టేట్ ఫ్యూనరల్ లాగా జరిపిస్తుంది'' అది.

అదంతా గుర్తుతెచ్చుకొని రేణు అంది-

''ఆ చెయ్యి అధికారానికి గుర్తుకదూ-''

''ఏఅధికారానికీ-''

''ఏ అధికారమంటే-- ప్రభుత్వం అనుకోవ చ్చు-''

''దాన్నే రాజ్యాధికారం అంటారు'' చిన్న పిల్లల తప్పుదిద్దినట్లు చెప్పాడు సూర్యం.

''సరే ... ఆరాజ్యాధికారం మన జీవితాల్లోకి చొరబడాలని ఎలా ప్రయత్నిస్తుందో, మనం తిరగబడితే ఎలా చంపేస్తుందో చూపించారు. ఫోనూ, టీవీ, పేపరూ వీటి ద్వారా మన భావాల్ని మార్చటానికి అధికారం ప్రయ త్నించటం చూపించారు. అంతా బాగానే వుందిగానీ ఆ చెయ్యి తను చంపినవాడికి మళ్లీ సకల లాంఛనాలతో దహనకార్యక్రమం జరిపించటమేమిటి?''

''అరే- ఆమాత్రం తెలియదా-- విప్లవకారు లు చచ్చిపోయేదాకా రాజ్యానికి శత్రువులు. చచ్చిపోయాక వాళ్లపేరు వాడుకుని రాజ్యం మరింత స్థిరపడుతుంది. మళ్లీ వాళ్లననుస రించే వాళ్లను తిడుతుంది. ఇవాళ వూరూరా భగత్‌సింగ్ విగ్రహాలు. కానీ భగత్‌సింగ్ చెప్పి నట్లు చేసేవాళ్లకు మాత్రం మళ్ళీ ఉరిశిక్షలు. ఆ చివరి సన్నివేశం, ఆ శవానికి చెయ్యి చేసిన ఊరేగింపు అద్భుతంగా వుందిగదూ''

''సరేగాని- ఆసినిమాకి చెక్ ప్రభుత్వం ఒకసారి అవార్డ్ ఇచ్చి మళ్ళీ వెనక్కు తీసేను కుందట'' ఆశ్చర్యంగా అడిగింది రేణు.

''రాజకీయాల గురించి సినిమా తీశాడు గదా రాజకీయాలకు బలికాక తప్పదు'' గమన పిలుస్తుంటే సూర్యాన్ని వదిలి ఆవైపు నడి చింది.

''రేణూ ... ఈరోజు రాత్రి నేను సినిమాకి రాను - ఇప్పుడే బైటికి వెళ్తున్నాను. నాకు తాళం చెవి ఇచ్చెయ్యి నేను పన్నెండు లోపల వస్తే ఇబ్బందిగదా'' అంది.

''ఎక్కడికెళుతున్నావు?''

''వచ్చాక చెబుతా'' అంటూ తాళం తీసు కుని వెళ్లిపోయింది. రాత్రి రేణూ సినిమా నుంచి తిరిగి వచ్చేసరికి గమన గదిలోనే వుంది.

''హల్లో-'' అంది రేణును చూడగానే.

''ఏంటీ విశేషం-'' అడిగింది రేణు.

''విశేషమే ... రేపట్నించీ మనకు కొత్త లెక్చరర్ సంజయ్ వస్తున్నారు. పది క్లాసులదా కా తీసుకుంటారు. ఆయనకు మాధవి గురించి ఎవరో చెప్పారట. ఇవాళ ఉదయం పరి చయం చేసుకున్నాడట. రాత్రికి కొందరు స్టూ డెంట్స్‌తో పరిచయం చేసుకుంటే రేపు ఉదయం క్లాసులో ఈజీగా వుంటుందని-- మాధవిని కొందరు ఫ్రెండ్స్‌ని తీసుకురమ్మన్నా డట. మాధవి నన్నూ బీనానీ, రజనీనీ పిలి చింది. ఇప్పటివరకూ పార్టీలోనే వున్నాం. సంజయ్ చాలా నైస్‌మాన్- హేమంత్, రమేష్‌లు ఎంత మంచి టీచర్లయినా పాతకా లంవాళ్లు-- ఈయన చూడు స్టూడెంట్స్‌తో ముందే పరిచయం చేసుకోవటంవాళ్లకు విలు విప్వటం-- ఎంత డెమొక్రటిక్‌గా వున్నాడు''

రేణుకెందుకో ఆ పద్ధతి నచ్చలేదు. బీనా, రజనీ, మాధవీ అందరూ క్లాసులో బాగా ప్రశ్న లు వేస్తారు. వాళ్లని మంచి చేసుకుందామని ఈ పార్టీ ఇచ్చి వుంటాడు. వీళ్లు ఇబ్బంది పెట్టకపోతే అతనికి హాయిగా వుంటుంది. అంటే అతను మంచి టీచర్ కాదన్నమాట అనుకుంది.

''ఈవాళ పార్టీలో ఒకవిశేషం చెప్పనా-- సంజయ్ అందరినీ ఒక ప్రశ్న అడిగాడు.




Spectra Pleasant

డబ్బుకు పూర్తి విలువ...
చాలా కాలం మన్నుతుందిగనక.

ECtv

వచ్చే జన్మలో మీకు ఎలా పుట్టాలని వుందని''

అందరూ ఎవరికోరికలు వాళ్లం చెప్పాం.

''ఏంచెప్పారు?'' నవ్వుతూ అడిగింది రేణు.

''మాధవికేమో ఓ కోటీశ్వరుడికి ప్రియురాలుగా పుట్టాలని వుందట.

రజనీకేమో - ఫిలిం ప్రొడ్యూసర్‌గా పుట్టాలని వుందట. బీనాకేమో స్మితాపాటిల్ అంత అందంగా నటనా కౌశలంతో పుట్టాలని వుందట''

''మరి నీకో—'' అసహనంగా అడిగింది రేణు.

''నాకు అడవిలో విరబూసే పెద్దపువ్వులా పుట్టాలని వుందన్నాను. సంజయ్ కోరికేమిటో తెలుసా?''

గమన పగలబడి నవ్వింది.

''ఏంటట-'' రేణు కూడా నవ్వింది.

''దున్నపోతులాగా—'' అంటూ నవ్వు ఆపుకోలేకపోయింది.

''నిజంగా-- దున్నపోతులాగా పుట్టాలని వుందట. పాలిచ్చేపని కూడా లేకుండా తిన్నది నెమరు వేసుకుంటూ ఎదురుగా కనపడేదాన్ని మాత్రమే ఏ ఆలోచనా లేకుండా చూస్తూవుండే దున్నపోతులా పుట్టాలనుకున్నాడట''

గమన నవ్వుతుంటే రేణు విసుక్కుంది.

''దున్నపోతులబండి అని ఆంధ్రాలో వుంటుంది. దానికి కట్టి బరువులు లాగిస్తే సరి'' అంది.

''ఔనా— రేపు సంజయ్‌తో చెబుతాను''

''చెప్తే చెప్పావుగాని నేచెప్పానని చెప్పకు''

పార్టీ కబుర్లన్నీ అయ్యేదాకా గమన వదల్లేదు. రెండింటికి పడుకుంటే మళ్లీ తొమ్మిదింటి దాకా మెలకువరాదు.

★ ★ ★

సంజయ్ సినిమాలో రంగులూ, వాటి ప్రభావం ప్రాముఖ్యత వీటి గురించి చెబుతున్నాడు. ప్రపంచ ప్రసిద్ధి చెందిన చిత్రకారుల పెయింటింగ్స్ స్లయిడ్స్‌లో చూపిస్తున్నాడు.

సంజయ్ మీద ఒక వ్యతిరేక భావంతో క్లాసుకి వెళ్లిన రేణూకు ఆ వ్యతిరేకతను నిలుపుకోవటం కష్టమయింది. సంజయ్ చాలా అందంగా వున్నాడు.

కళాకారుడిలా గిరజాల జుట్టూ గడ్డం, ఎర్రని రంగు- గ్రీకు శిల్పంలా వున్నాడు.

''ఇవాన్ ది టెరిబుల్-లో యువకుడైన ఇవాన్‌లా లేడూ'' అంది మంజరి రేణూతో.

సూర్యం అంతకుముందే సంజయ్ చాలా గొప్పమేధావనీ, పరిశోధకుడనీ, అతని రచనలు చాలా చదివాననీ చెప్పాడు.

వీటన్నిటితో రేణూ అతనిమీద వ్యతిరేకత లేకుండానే పాఠం విన్నది. హేమంత్‌లా కాకపోయినా అతనుకూడా బాగానే చెప్పాడు.

'పోన్లే-నిజంగానే విద్యార్థులతో స్నేహం చేసుకునే స్వభావమేమో-ఇక్కడందరూ తాగేవాళ్ళే. ఇతన్ని ప్రత్యేకం అనుకునేదేముంది' అనుకుంది రేణు.

సంజయ్ నిజంగానే హేమంత్- రమేష్‌లది పాతతరం అనిపించాడు.

హేమంత్ పాఠంచెప్పబోయేముందు సిగరెట్ వెలిగిస్తాడు. ఆ తర్వాత మళ్ళీ సిగరెట్ తాగడు. సంజయ్ నాలుగైదు సిగరెట్లు తాగటమేకాదు విద్యార్థులను అడిగి మరీ తాగుతాడు.

రేణూకు ఆ సిగరెట్ల వ్యవహారం నచ్చక సూర్యంతో అన్నది-

''క్లాస్‌రూంలో టీచర్లూ, స్టూడెంట్సూ అందరూ సిగరెట్లు తాగుతుంటే క్లాస్‌రూం వాతావరణమే వుండటంలేదనిపిస్తోంది. క్లాస్‌రూం అంటే ఒక పవిత్రభావం ఏర్పడాలిగదా-నాకేం బాగోలేదీ పద్ధతి. ఆ రజనీ, బీనా నావెనక కూర్చుంటారు. ఒకటే పొగ, వాసన. ఆ పొగనీ, వాసననీ అయినా భరించొచ్చుగానీ ఆ సిగరెట్ నుసి వచ్చి నా మెడలమీదా, వీపుమీదా పడుతుంటే తగని చిరాగ్గావుంటుంది. ఇన్ని తెలిసినవాళ్ళకూ, ఇంత మేధావులకూ ఇతరులకు ఇబ్బందికలిగించగూడదని తెలియదూ?''

రేణూ కోపంచూసి సూర్యం నవ్వాడు-

''మీరు కూడా సిగరెట్లు తాగటం మొదలెడితేసరి- అన్నీ చిరాకులూపోతాయి''

అంటూ తానూ ఓ సిగరెట్‌వెలిగించాడు.

''అదొక్కటే తక్కువ నాకు'' విసుగ్గా అంది




రేణు.

"ఇక్కడంతా సీమ నాగరికత-" సూర్యం.

"అదీ నాగరికతేనా-" రేణూ నిరసనగా అంది.

"ఎందుకు కాదూ?"

"గురువుగారి ముందు విద్యార్థులు సిగరెట్లు తాగటం, విద్యార్థులనడిగి గురువు సిగరెట్లు తాగటం నాగరికతా?" రేణూకు కోపంవచ్చేసింది.

"ఎవరు గురువు? ఎవరు శిష్యులు" తమాషాగా అడిగాడు.

"అదేంప్రశ్న?"

"ఔను... గురువుగారికన్నీ తెలుసనీ, అతను మాట్లాడే ప్రతిమాటా వేదవాక్యమనీ అనుకునేరోజులు పోయాయి. టీచరంటే విద్యార్థులకు చదువుచెప్తుతూ తానూ నేర్చుకునేవాడు. అతనికి వీళ్ళకంటే ముందు కొన్ని విషయాలు తెలిశాయి. అవి వీళ్ళకు చెబుతూ తాను కొత్తవిషయాలు నేర్చుకుంటాడు. అతను చెప్పిన విషయాలు ఆధారంగా వీళ్ళింకా కొత్తవిషయాలు-అతనికి కూడా తెలియనివి తెలుసుకుంటారు. ఇది జ్ఞానం సంపాదించే ఒక క్రమం. ఇందులో ఎక్కువ తక్కువలు లేవు. అందరూ సమానులే-"

"బాగానేవుంది మీ సమర్థన"

"సమర్థనకాదు... విద్యార్థుల్ని అంతదూరాన నిలబెట్టే టీచర్లకంటే వాళ్ళ భుజాలమీద చేతులేసి స్నేహంగా వుండే టీచర్లే నాకిష్టం. చక్కగా పాఠంచెబుతూ స్నేహంగా వుండే టీచర్లంటే పిల్లలు ప్రాణాలిస్తారు"

"మీరు మీ స్టూడెంట్స్‌తో స్నేహంగా వుంటారుగాబోలు. సిగరెట్లు మాత్రం వాళ్ళనడిగి తీసుకోకండి" భరించలేనట్లు అంది రేణు.

★ ★ ★

భోజనం ముగించి సూర్యం లైబ్రరీలో పుస్తకాలు ఇచ్చేస్తానంటూ వెళ్ళాడు.

రేణు గదిలోకి వెళ్ళింది.

"ఆ సూర్యం ఏమంత అందగాడని అతనితోనే తిరుగుతున్నారు?" ఉమ వ్యంగ్యంగా నవ్వుతూ అడిగింది.

రేణుకు ముందు అసలేమీ అర్థంకాలేదు. తర్వాత కోపంతో ముఖం జేవురించింది.

"ఏమిటి మీ ఉద్దేశం?" తీవ్రంగా అడిగింది.

ఉమ వెకిలిగా నవ్వి "నేనేదో సరదాకి అన్నాను. అంతకోపం తెచ్చుకుంటారెందుకు" అంటూ బైటకెళ్ళిపోయింది. రేణు మనసు ఉడికిపోయింది. సూర్యంతో మాట్లాడితే వీళ్ళంతా ఇలా అనుకుంటున్నారా... ఎంత అవమానం! అందరూ ఎందుకనుకుంటారు? ఈ ఉమ-ఈమె స్వభావం తెలిసీ తనెందుకు బాధపడాలి. మిగిలినవాళ్ళందరూ ఎవరో ఒక అబ్బాయితో మాట్లాడుతూ తిరుగుతూవున్నారు. నాగురించి ఏమనుకుంటారు. ఈ ఉమ ఒట్టి వెకిలిమనిషి. అయినా సూర్యాన్నీ- తననూ గురించి అలా అనుకోవటమేమిటి? తనకు పెళ్ళయిందని తెలుసు. సూర్యానికి కూడా పెళ్ళయ్యే వుంటుంది. ఇన్నాళ్ళూ అతని విషయాలు అడగలేదు. అతని వివరాలు అడిగితే రవి చచ్చిపోయాడనే విషయం చెప్పాల్సివస్తుందనీ-అతనూ తన వివరాలు ఎక్కువ అడగవచ్చనే భయంతో ఏమీ అడగలేదు. అయినా ఇక్కడ ఇంత నాగరిక వాతావరణంలో కూడా ఈ దరిద్రపు ఆలోచనలూ, పుకార్లూ- చండాలంగా! ఈ ఉమ సత్యనారాయణ స్వామినీ- పుకార్లనీ కూడా పూనా తీసుకొచ్చింది.

గమన రేణు ముఖం చూసి యేదో జరిగిందని గ్రహించింది.

గమన అడగ్గానే రేణు చెప్పేసింది.

"సరేలే... ఈ ఉమ మాటలు పట్టించుకుంటే అయినట్లే. తిరిగి క్లాసులో ప్రతి అబ్బాయితోనూ స్నేహం చేసుకోవాలని ప్రయత్నించి విఫలమయింది. మీకో ఫ్రెండు దొరికాడని కుళ్ళు" కాస్త ఆగి- "మొన్నరాత్రి సినిమాలో అరవింద్ అవస్థ చూడాలి"

"ఏమయింది?" అంది రేణు.

"ఈవిడ నాలుగురోజుల్నుంచీ అరవింద్‌పక్కన కూచుని అతన్ని బోర్‌కొడుతోంది. మొన్న అతను ఈవిడ బారినుంచి తప్పించుకోవాలని వచ్చి ఓ మూల కూచున్నాడు. ఈవిడ అతన్ని వెతికిపట్టుకుంది. అతను తనపక్క కుర్చీ విరి

గిందనీ, ఉమ అక్కడ కూచోలేదనీ నిశ్చింతగా వున్నాడు. ఈవిడ అరవింద్ చెయ్యిపట్టుకొని లేపి ఇంకో చోటికి తీసుకెళ్ళింది. అప్పుడు అరవింద్ ముఖంచూసి అందరూ ఒకటే నవ్వుకోవటం-''

గమన, రేణు కళ్ళంట నీళ్ళొచ్చేలా నవ్వుకు న్నారు. సాయంత్రం క్లాసు సంగీతాన్ని గురించి. ఆ లెక్చరర్ సినిమాలో సంగీతానికున్న ప్రాముఖ్యత గురించి వివరించాడు. కానీ రేణుకది సరిగా అర్థంకాలేదు. తనలాగే చాలా మందికి అర్థంకావటం లేదని గమనించింది.

క్లాసయిపోయాక తనకోసం ఎదురుచూస్తున్న సూర్యం దగ్గరకు వెళ్ళటానికి సంకోచించింది. కానీ వెళ్ళకతప్పలేదు. అతను రేణు కోసమే నిల్చున్నాడు.

"'పథేర్ పాంచాలి' గురించి తెలుసుకునే ఉద్దేశంలేదా? అలా నెమ్మదిగా వస్తున్నారు'' అన్నాడు కోప్పడుతున్నట్టు.

"రేపు రమేష్‌గారు చెబుతారుగా'' నవ్వింది రేణు.

"అయితే నా శిష్యరికం మానేశారన్నమాట'' నీరసపడిపోయాడు.

"ఊరికే అన్నానుగానీ చెప్పండి''

"ఇంత అవమానం జరిగాక ఇక చెప్పను లెండి-''

"మీకు పెళ్ళయిందా?'' హఠాత్తుగా అడిగింది రేణు.

"కాలేదు... ఎందుకలా అడిగారు. కొంపదీసి సంబంధాలు చూడరుగదా-'' భయపడ్డాడు.

"చూడమంటారా?''

" ఈ పూనా అమ్మాయిలను వద్దులెండి. మనదేశం వెళ్ళాక చూద్దురుగాని''

"అసలు ఇప్పటిదాకా మీరు పెళ్ళెందుకుచేసుకోలేదు?''

"ఇదేంటివాళ నా పెళ్ళిమీద పట్టించారు-నాకింకా ఇరవైయేడేళ్ళే... అప్పుడే పెళ్ళేమిటి?''

రేణు నవ్వి వూరుకుంది.



కాంటీన్‌లో టీ తాగుతుంటే అరవింద్ వచ్చి సూర్యాన్ని పిల్చుకెళ్లాడు. రేణు ఒక్కతే థియేటర్‌లో కూచుంది. సినిమా మొదలెడుతున్నా సూర్యం రాలేదు. సినిమా మొదలుపెట్టారు. ఉమ వచ్చి రేణు పక్కన కూచుంది.

"పథేరే పాంచాలీ'' సాగుతోంది. దుర్గా అపూ రేణు మనసంతా నిండిపోయారు. పిపీ పాత్ర వేసిన తొంభైఏళ్ళ ముసలావిడ అద్భుతంగా నటించి ప్రేక్షకులను ఏడిపిస్తోంది.

దుర్గ చచ్చిపోయింది. పద్నాలుగేళ్ళుంటాయేమో- ప్రకృతినీ, తమ్ముడినీ ప్రేమించే దుర్గ-

ప్రపంచంలో రంగులనూ రుచులనూ, రకరకాల వస్తువులనూ కోరుకునే దుర్గ-

స్నేహితురాలి పెళ్ళినీ, ఆ వైభవాన్నీ రెప్పవాల్చకుండా చూసిన దుర్గ-

తన పెళ్ళి గురించి కలలు కనాలోవొద్దో తేల్చుకోలేకపోయిన దుర్గ-

తన కోరికలనూ, ఉత్సాహాన్నీ అణిచిపెట్టా






లని చూసే పరిస్థితులతో పోరాటం చెయ్యాలని కూడా తెలియని పసి దుర్గ-

సరైన తిండిలేక, వర్షంలో తడిసి జ్వరం వస్తే సరైన మందులేక చచ్చిపోయింది.

ప్రతివస్తువునూ మెరిసే కళ్లతో చూసే దుర్గ కళ్ళు మరి తెరుచుకోనివిధంగా మూసుకుపోయాయి. దుర్గ చచ్చిపోయాక శ్రీడబ్బు సంపాదించాలని పట్నం వెళ్ళిన తండ్రి తిరిగొచ్చాడు.

ఇక ఆ పల్లెలో ఉండలేమని పట్నానికి ప్రయాణమయ్యారు. అక్క దుర్గ సేకరించిన గాజుముక్కలు, పూసలూ, గుడ్డపీలికలూ అపూకు కనిపించాయి.

ఒక చిన్న తాటాకుపెట్టెలో పూసలగొలును-దుర్గ దొంగిలించి తెచ్చి దాచిన గొలుసు.

దుర్గ ఆ గొలుసు చూడగానే ముచ్చటపడింది. స్నేహితురాలు సరిగా చూడనివ్వలేదు.

తర్వాత ఆ గొలుసు పోయిందనీ, దుర్గే కాజేసిందనీ గొడవచేశారు. దుర్గ తల్లి చేతిలో దెబ్బలు తిన్నది. ఆ గొలుసు మాత్రం దొరకలేదు.

ఇవాళ అపూ చేతిలో గొలుసు. అపూ మనసులో ఏమాలోచించాడో, ఎంత వేదనపడ్డాడో ఎవరికీ అర్థంకాదు. ఆ గొలుసు తీసుకెళ్ళి చెరువులో పడేశాడు. ఆ చెరువు ఆ గొలుసునీ, దుర్గ కోరికనీ, దుర్గ దొంగతనాన్నీ, అపూ జ్ఞాపకాలనీ భద్రంగా తనలో దాచుకుంది. ఒక్కసారి కలవరపడినట్లయినా మళ్ళీ ఏ ఎరగనిదానిలా నిశ్చలంగా, నిశ్శబ్దంగా వూరుకుంది.

రేణు దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. దుర్గ కోసం అపూకోసం ఆమె మనసు కొట్టుకుపోతోంది. అక్కకోసం అపూ మనసు పడే బాధని అర్థంచేకున్నకొద్దీ ఏడుపాగటంలేదు. సినిమా పూర్తయింది.

రేణు గదికి వెళ్ళి పడుకొంది. ఏమీ ఆలోచించాలని లేదు. మనసంతా నిరామయం. దుర్గ మరణం, అపూ పసిముఖం, రవి మరణం, శూన్యమైన తన జీవితం- అన్నీ కలగాపులగమైపోయాయి.

ఎవరో వస్తున్న అలికిడైె దిండులో ముఖందాచుకొని బోర్లా పడుకొంది.

ఎవరితోనూ ఏమీ మాట్లాడాలని లేదు. తొమ్మిదిన్నరదాకా అలాగే ఏడుస్తూ పడుకొంది.

తొమ్మిదిన్నరకు- "ఇక నిద్ర చాల్లే- సినిమాకు పోదాంరా" అంటూ గమన లేపింది.

ఎర్రగా ఉబ్బివున్న కళ్లను చూసి ఆశ్చర్యపడింది. "మళ్ళీ ఏడ్చావా?"

రేణు బాత్‌రూంకి వెళ్ళి ముఖం కడుక్కొని వచ్చింది. గమన బ్రెడ్డుకి జామ్‌రాసి ప్లేట్‌లో పెట్టి-

"మాట్లాడకుండా ఇవి తినండి. నేను టీ పెడతాను- తాగి థియేటర్‌కి నడవండి" అంది గంభీరంగా.

రేణు అవి తినేసి టీతాగి గమన వెంటే థియేటర్‌కి వెళ్ళింది.

సూర్యం ఎదురుచూస్తూ గేటు దగ్గరే ఉన్నాడు.

"మీ ఫ్రెండ్ ఇవాళ మళ్ళీఏడ్చింది. జాగ్రత్తగా చూసుకోండి- ధైర్యం చెప్పండి"

రేణును సూర్యానికి అప్పగించినట్లు నటించి తాను రజనీవాళ్లదగ్గరికి వెళ్ళింది.

"ఏడ్చావా... ఎందుకు? రవిగారి కోసమా?" సగంఆశ్చర్యంగా, సగం పరిహాసంగా అడిగాడు.

"కాదు, దుర్గకోసం- అపూకోసం"

'పథేర్ పాంచాలి' సినిమా చూసి ఆ పాత్రలకోసం అంతబాధపడిన రేణంటే ప్రేమతో నిండిపోయింది సూర్యం మనసు.

"ఔను- 'పథేర్ పాంచాలి' మనసునలాగే పట్టేస్తుంది. మీరు ఏడ్చి బరువు తగ్గించుకొన్నారు. నేను అలా ఏడవటం చేతకాక చాలాసార్లు పిచ్చెక్కినవాడిలా రోడ్లమీద తిరిగేవాడిని" సినిమా మొదలవటంతో మాటలాపేశారు. అది ఫ్రెంచ్ సినిమా చిన్న సినిమా.

13,14 ఏళ్ల పిల్లలు 19 ఏళ్లమ్మాయినీ, ఆమె ప్రియుడినీ వెంటాడి ఏడిపిస్తుంటారు. ఆ పిల్లలకు ఆ అమ్మాయంటే ఎంతో ఇష్టం. ఆ ఇష్టాన్ని ఎలా ప్రకటించాలో తెలియదు. ప్రేమని ప్రకటించటం చేతకాని ఆపిల్లలు యుద్ధాన్ని ప్రకటిస్తారు. వాళ్ళిద్దరి ఏకాంతాన్ని పాడుచేస్తారు. వాళ్లపేర్లు గోడల మీద రాస్తారు. నానా అల్లరీ చేస్తారు. ఒకరోజు ఆ అమ్మాయి ప్రియుడు యాక్సిడెంట్‌లో చనిపోతాడు. ఆ అమ్మాయి బాధనూ, ఒంటరితనాన్నీ చూసి వీళ్లంతా దుఃఖిస్తారు. ఆ పిల్లల ప్రవర్తనా, ఆ మనస్తత్వాలూ అన్నీ దర్శకుడు చాలా చక్కగా చిత్రీకరించాడు. ఆ చిన్న సినిమాతో రేణు కాస్త తేరుకొంది.

"చాలా బాగుంది గదా??? అంది సూర్యంతో.

"ఔను... చాలా చిన్న విషయాన్ని చిన్న సినిమాలో చక్కగా చెప్పాడు" అన్నాడు.

ఇంతలో హంగరీ చిత్రం 'రౌండ్ అప్' మొదలయింది.

"ఈ సినిమా అంతా ఇరవైఏడు షాట్లలో తీశారు. గొప్పసినిమా అంటారు. కానీ నాకు బోరనిపించింది" అన్నాడు సూర్యం.

అతనింతకుముందే ఆ సినిమా చూశాడని రేణుకర్థమైంది.

నిజంగానే సినిమా విసుగనిపించింది. షాట్ ఒక్కటే సాగుతూసాగుతూ ఎంతకూ తెగదు.

నిద్ర, తలనొప్పి రావటంతో మధ్యలో లేచి వెళ్ళి పడుకుంది రేణు.

రేణు వచ్చిన కాసేపటికి గమన, ఉమా వచ్చారు. పక్కగదుల సందడిని బట్టి అందరూ వచ్చినట్టున్నారనుకొంది.

మర్నాడు లేవబోతుంటే రేణూకు ఒళ్లంతా నొప్పులుగా అనిపించింది. లేస్తే కళ్ళు తిరిగినట్లయి అలాగే పడుకొంది.

గమన లేచి ఇంకా పడుకునే వున్న రేణు వంక ఆశ్చర్యంగా చూసింది.

"నాకు జ్వరం వచ్చినట్లుంది- క్లాసుకి రాను" అని కళ్ళు మూసుకుంది.

గమన టీ కలిపి- ఓ టాబ్లెట్ తీసి ఇచ్చింది.

ఆ మందు మింగి, టీ తాగి పడుకుంది రేణు.

పదకొండున్నరకు తలుపు తట్టినట్లనిపించి తెరిచిచూస్తే సూర్యం.—




"ఎలా వున్నారూ? గమనగారు చెప్పారు... మీకు జ్వరంగా వుందని" సూర్యం గదిలోకి వచ్చేశాడు.

"మందు వేసుకున్నాను. ఇప్పుడు బాగుంది- మధ్యాహ్నం క్లాసుకి వస్తాను"

"రాకపోయినా ఫరవాలేదులెండి... ఇవాళ విశ్రాంతితీసుకోండి. ఇక్కడ మనకు తిండీ నిద్రా రెండూ కరువయ్యాయి. తట్టుకోవటం చాలా కష్టం"

"మీరు క్లాస్ మిస్సవుతున్నారెందుకు... వెళ్ళండి" ఇబ్బందిగా కదిలింది రేణు.

"ఫరవాలేదులెండి- క్లాసులో ఆ రజనీవాళ్ళేదో అర్థంలేని చర్చ చేస్తున్నారు. వాళ్ళు తెలివి గలవాళ్ళేగాక తెలివిని ప్రదర్శించాలనే తపన గల వాళ్ళు. దాంతో చిరాకనిపిస్తుంది. తమకు ఇన్నివిషయాలు తెలును అని చెప్పటంకోసం క్లాసంతటినీ డిస్టర్బ్‌చేస్తారు"

రేణు నవ్వింది. ఒంటిగంటదాకా రేణుతో కబుర్లుచెప్పి భోజనంచేసి గదికి వెళ్లాడు సూర్యం.

వెళ్తూ వెళ్తూ-

"మధ్యాహ్నం క్లాసు మిస్సయినా ఫరవాలేదు- సాయంత్రానికి ఓపికతెచ్చుకోండి. సాయంత్రం సినిమా మిస్సయ్యాగంటే ఇక మీ జీవితం వృధా. చాలా గొప్ప సినిమా హిరోషిమా మై లవ్" అంటూ వెళ్ళాడు.

రేణు క్లాసుకు కూడా వెళ్దామనుకుని తయారయింది. మాధవి, మంజరి, దీప్తి ఇంకా నలుగురైదుగురు అమ్మాయిలొచ్చి పరామర్శించారు.

వాళ్ళతోపాటే క్లాసుకి బయల్దేరింది. అది హేమంత్ క్లాసవటంతో ఎవరూ రేణూను వారించలేదు.

"ప్రపంచ సినిమా చరిత్రలో మూకీయుగం పోయి టాకీయుగం వచ్చేసింది. సినిమాల్లోకి ధ్వనులూ, గొంతులూ సర్వ శబ్ద ప్రపంచం వచ్చేసింది. అంటే ఏమిటన్నమాట- పెట్టాల్సిన పెట్టుబడి పెరిగింది. తర్వాత సినిమాలోకి ప్రాంతీయత వచ్చేసింది. మూకీ సినిమాలో మనిషి తెలుగువాడా, మరాఠీనా అన్న మీమాంస పడనక్కర్లా. ఎవడైనా ఒకటే. మనుమలందరికీ వుండే అనుభూతులే అతనికుంటాయి. కానీ మాటలు ఎప్పుడైతే సినిమాల్లో జొరబడ్డాయో భావకూ, ప్రాంతీయతకూ, జాతీయతకూ ప్రాముఖ్యం పెరిగింది. అతను ఎవరు ఏ రాష్ట్రం ఏ భాష ఏ మాండలీకం ఏ యాస అనేది ముఖ్యమయింది. అలాగే మూకీ సినిమాల్లో కథ ఓ క్రమంలో కథలాగా చెప్పాలి. టాకీలలో ఆ అవసరంలేదు. మాటలద్వారా ముందు వెనకల గందరగోళం లేకుండా చెయ్యొచ్చు. సినిమా జీవితాన్ని చూపించటమే కాక భావాలను మోసేదిగా కూడా మారింది.

**1929** లో హిచ్‌కాక్ తీసిన 'బ్లాక్‌మెయిల్' అనే సినిమాలోనే సౌండ్‌ని వాడుకున్నాడు" అంటూ హేమంత్ ఆ సినిమాలోంచి కొన్ని భాగాలు చూపించాడు.

తర్వాత క్వీన్ క్రిస్టీనాలో కొన్ని భాగాలు చూపిస్తానని హేమంత్ అనగానే క్లాసులో కొందరు ఆనందంతో కేరింతలు కొట్టారు.

"ఏమిటి ఆ సినిమా గొప్ప?" సూర్యాన్ని మెల్లగా అడిగింది రేణు.

"గ్రీటా గార్బో నటించింది. ఓహ్.. మనం గ్రీటా గార్బోని చూడబోతున్నాం" సూర్యం కూడా ఆనందపరవశుడయ్యాడు. కెమేరా మూవ్‌మెంట్ దృష్ట్యా కొన్ని సన్నివేశాలు వివరించాడు. గ్రీటా గార్బో స్వీడన్‌కి చెందినది. ఆమె మొదటి చిత్రం 'గోస్టా బెర్లింగ్'. స్టిల్లర్‌తో కలిసి ఒక కాంట్రాక్టుతీసుకుని అమెరికా వచ్చింది. అప్పటి హాలీవుడ్ అధినేత సి.బ్రౌన్ ఆమెను తిండిమానేసి చిక్కిపోక పోతే అమెరికాలో వుండటం అనవసరమన్నాడు.

అప్పటికి హాలివుడ్‌లో గిల్బర్ట్ పెద్ద స్టార్. గ్రీటా గార్బోలీ గిల్బర్ట్‌లు ప్రేమించుకున్నారు. ఐతే ఇంతలో టాకీలయుగం ప్రారంభమై వీళ్ళ ప్రేమకు విఘాతం కలిగించింది.

"టాకీలకూ వీళ్ళ ప్రేమకూ సంబంధమేమిటి సార్?"

మనోహర్ కుతూహలం ఆపుకోలేక అడిగేశాడు.

"గిల్బర్ట్ ప్రొడ్యూసర్ల దగ్గరనుంచి బాగా డబ్బు పిండేవాడు। అందుకని వాళ్లకు గిల్బర్ట్ అంటే కోపం. టాకీలు రాగానే స్టూడియో ఓనర్ల

దే పైచెయ్యి అయింది. నీగొంతు రికార్డింగ్‌కి పనికిరాదని గిల్బర్ట్‌ని నెట్టేశారు. అతనికి సినిమా ఛాన్సులుపోయాయి. క్రమంగా పతన మయ్యాడు. అదే సమయంలో గ్రీటా గార్బో పెద్ద స్టారయింది. గిల్బర్ట్ తాగీతాగీ శానిటోరియం పాలయ్యాడు. ఆ సయయంలో గార్బోకి క్వీన్ క్రిస్టీనా స్క్రిప్ట్ దొరికింది. ప్రేమ కోసం, ప్రియుడికోసం సింహాసనాన్ని త్యజించింది క్రిస్టీనా. స్వీడన్‌దేశపు రాణి. ఆమె తండ్రి ఆమెను కొడుకులాగానే పెంచాడు. ఆమెకూడా అట్లాగే పెరిగి రాజ్యాన్ని పాలిస్తుంది. ఒకరోజు స్పెయిన్ దేశపు రాయబారి ఆమెలోని స్త్రీని నిద్రలేపుతాడు. వాళ్ళిద్దరూ ప్రేమించుకుంటారు. కానీ ఆ రాజ్యానికి వారసుడు స్వీడిష్ రక్తంతోనే పుట్టాలనే నియమంవుంది. అందుకని క్రిస్టీనా రాజ్యాన్ని వదిలెయ్యటానికి నిశ్చయించుకుంటుంది. రాజ్యం వదిలేసి అతనితో కలిసి స్పెయిన్ వెళ్ళాల్సిన రోజు ఈవిడ నౌక దగ్గరకు వచ్చేసరికి అతను ఎవరితోనో ద్వంద్వ యుద్ధంచేసి చనిపోయిపడి వుంటాడు- అదీ కథ.

హాలీవుడ్ క్వీన్ అయిన గార్బో క్వీన్ క్రిస్టీనా తానే అనుకుంది. శానిటోరియంలోవున్న గిల్బర్ట్‌ని పిలిపించి తన ప్రేమికుని పాత్ర ఇచ్చింది. ఇద్దరూ అద్భుతంగా నటించారు'' అని చెప్పి కాస్త ఆగి ''రామాయణ్'' అని పిల్చారు హేమంత్. క్లాస్‌రూం చీకటయింది. క్వీన్ క్రిస్టీనా సినిమాలో చివరి సన్నివేశాలు చూశారు.

గ్రీటా గార్బో విషాదం అందరి మనసుల్లోకి పాకింది.

ఆ సన్నివేశం అవగానే హేమంత్- మళ్ళీ రేపు కలుద్దాం అంటూ బైటికి నడిచారు.

''సార్... ఈ సినిమా తర్వాత గిల్బర్ట్ ఏమయ్యాడు. వాళ్ళ ప్రేమ ఏమయింది- చెప్పకపోవటం అన్యాయం సార్?'' మనోహర్ వెంటబడ్డాడు.

''కొన్ని విషయాలు తెలియకపోతే వున్న ఆనందం తెలుసుకున్న తర్వాతవుండదు'' చిరునవ్వుతో అంటూ వెళ్ళిపోయారు హేమంత్.

అందరూ థియేటర్ బయటా చెట్లకిందా కాంటీన్‌లో చేరారు.

రజనీ మాధవీ వాళ్ళతో ఏదో చెప్పి గేటువైపు వెళ్ళిపోయింది.

'ఈ సినిమా చూడకుండా వెళ్తోంది. పూర్ ఫెలో' అంటూ మాధవి థియేటర్‌వైపు నడిచింది.

రేణు సూర్యం ఏమీ మాట్లాడుకోకుండానే థియేటర్‌లోకి నడిచారు. సినిమా ఇంకా ప్రారంభంకాలేదు.

''ఇవాళ ఉదయం మీరు క్లాసుకి రాకపోవటం చాలా మంచిదయింది. వచ్చివుంటే మీ జ్వరం మరికాస్త పెరిగేది''

''ఎందుకు? ఏమయింది?''

'''పథేర్ పాంచాలి' మీద చర్చ. మనవాళ్ళు ఎలాంటి ఎలాంటి కామెంట్స్ చేశారో చెప్పలేం.

''ఒకాయన అంటాడు 'పథేర్ పాంచాలి' బాగుంది... కాదనను. రే నేనొక క్లాసిక్ సినిమా తియ్యాలి, తీస్తున్నాను అనే స్పృహతో తీశాడు. అందువల్ల ఇందులో కలవుంది గానీ సహజత్వం లేదు.

అది కావాలని కూచుని శ్రద్ధగా అలంకరించిన ఓ ముంగిలిలా వుంది. నిజమే... చాలా శ్రద్ధగా శుభ్రంచేశారు. ఒత్తుగా కల్లాపి చల్లారు.

అందంగా పొందికగా ముగ్గులు వేశారు. పూలతో అలంకరించారు. ఏది ఎక్కడ ఎలా వుండాలో అక్కడే వుంది. కానీ ఇదంతా కావాలని అమర్చిపెట్టినట్లు లేదూ -- రినోయర్ 'రూల్స్ ఆఫ్ ది గేమ్' లా సహజంగా జీవితంలా చిందరవందరగా తొందర తొందరగా లేదెందుకని అంటాడాయన. నాకైతే ఆయన అజ్ఞానానికి చాలా కోపం వచ్చింది'' సూర్యానికి అది గుర్తొస్తే కూడా చాలా కోపం వచ్చింది.

రేణు నవ్వి ''మరి రమేష్‌గారు ఏం సమాధానం చెప్పారు?''

''ఎవరైనా ఏం చెబుతారు. ఫ్రాన్సు నాగరికతకూ, భారతీయ నాగరికతకూ వున్న తేడా చూడమన్నారు. ఏ దేశ నాగరికతను ఆ సినిమాలు ప్రతిబింబించుతాయి. మీకు రినోయర్ సినిమా సహజంగానూ, రే సినిమా అసహ




జంగానూ కనిపించిందంటే మీరు ఆ నాగరికతతో ఐడెంటిఫై అయినట్లుగా ఈ నాగరికతతో సంస్కృతితో ఐడెంటిఫై అవలేకపోతున్నారన్న మాట. అని ఘాటుగా చెప్పారు. అది సరే... ఒకరకం అజ్ఞానం మన మలయాళ మాంత్రికుడు లేడూ –''

''ఎవరూ.'' రేణూ అయోమయంగా అడిగింది?

''అదే – కేరళ అతను - పిల్లిగడ్డం, భూతద్దాలూ –''

''అతనా - ఏం చేశాడు?''

''అపూని కడుపుతో ఉన్నప్పుడు అదే సినిమా ప్రారంభంలో సర్వజయాదేవి పొట్ట ఎత్తుగా చూపించలేదు. అది పెద్ద లోపం అని వాదించాడు''

''ఏమిటీ'' రేణూ ఆశ్చర్యపోయింది.

''ఔను – దత్ అనే అతనేమో ఈ సినిమా ఒక గ్రామంలో ఒక కుటుంబం కథ. రాజకీయ సామాజిక సమస్యల చిత్రణలేదని ఓ ఉపన్యాసం కొట్టాడు. నన్నడిగితే 'పథేర్ పాంచాలి' కంటే రాజకీయ సామాజిక సమస్యల్ని చిత్రించిన చిత్రం లేదంటాను'' సూర్యం ఆవేశం పట్టలేకపోయాడు.

''మీరిక ఆ ఎక్స్ట్రీమ్‌కి వెళ్తారా? ఆ సినిమాలో రాజకీయ సమస్యలేమున్నాయి?''

''మైగాడ్ – మీకేమీ తెలియదు. కాలేజీలో పంతుళ్ళు చెప్పిన పాఠాన్ని చిలకలాగా వల్లె వేసి డిగ్రీలు తీసుకున్నారు. 'పథేర్ పాంచాలి'లో సమస్య ఇప్పటికీ సమస్యగానే వుంది. అయినా మనకు ఆ సమస్య కనిపించటంలేదు. పల్లెల్లో రోజురోజుకీ దరిద్రం పెరిగిపోతోంది. జనం అక్కడి ఆకలికి తట్టుకోలేక నగరాలకు వలసవస్తున్నారు. అక్కడి సమస్యల విషవలయాల్లో చిక్కుకుంటున్నారు. గ్రామాల దుర్భిక్షంలో దరిద్రంలో రాజకీయాలు లేవా? పథేర్ పాంచాలి'లో రాజకీయ సమస్యలు లేవా – రాజకీయాలని తీయటమంటే మీ దృష్టిలో ఏమిటి? నినాదాలివ్వాలా – ఉపన్యాసాలుండాలా – అవి లేకపోతే రాజకీయాలని గుర్తుపట్టలేరా? అందుకే మీ దృష్టి జీవితం మీద నుంచిపోయి నినాదాల మీద నిలబడబట్టే మన కళలలో రాజకీయాలూ అన్నీ ఇంత దరిద్రంగా వున్నాయి, ఇలా తగలబడుతున్నాయి''

రేణు బిత్తరపోయి సూర్యం వంక చూస్తోంది.

సినిమా మొదలయింది.

''మనమొక అద్భుతమైన ప్రేమగాథను చూడబోతున్నాం'' మైమరపుగా అన్నాడు సూర్యం.

జపాన్‌కి వచ్చిన ఒక ఫ్రెంచ్ ఆవిడకూ, జపాన్ దేశపు ఆర్కిటెక్ట్‌కీ మధ్య ఏర్పడిన ఒక ఎఫైర్‌తో సినిమా ప్రారంభమయింది. రేణు కాస్త ఇబ్బందిపడింది. సూర్యం పక్కన కూచుని ఆ సెక్స్ దృశ్యాలు చూడటానికి - క్రమంగా ఆ దృశ్యాలలోనుంచి సినిమావాళ్ళ జీవితాల మీదకు మళ్ళింది. ఇద్దరూ యుద్ధాన్ని చూసినవాళ్ళే - వాళ్ళ జీవితాల గురించి మాట్లాడుకుంటున్నారు.

అతను హిరోషిమా మీద బాంబుపడ్డరోజుల్నీ ఆ భయంకర దినాలనీ గుర్తుతెచ్చుకున్నాడు. ఆ బాంబు ఫలితం భవిష్యత్తులో ఇంకెన్ని విషఫలితాలనిస్తుందోనని భయపడుతున్నాడు.

ఆమె తన ప్రేమగాథ మొదలెట్టింది. యుద్ధం చిదిమేసిన తన ప్రేమ పుష్పాన్ని ఒక్కసారి అన్ని రంగులతో, కాంతులతో, పరిమళాలతో ఈ జపాన్ యువకుడి ముందుంచసాగింది.

అవి మాటలు కావు- విషాద జలపాతాలు; అవి అనుభూతులు కావు - చావు బతుకుల సంధ్యాసమయాల ఆరాటాలు - ఇదేమిటిది... ఇది సినిమానా - మన గుండెల్ని సున్నితంగా బైటికి లాగి విషాదంతో నింపటమా? ఎందుకిలా... ఎందుకిలా వుంటుంది జీవితం.

ఆవిడ చెబుతోంది -

తన తొలి యవ్వనపురోజులు - ఫ్రాన్సు దేశ శివారు ప్రాంతాలను జర్మన్ సేనలు ఆక్రమించుకున్నరోజులు. ఒక జర్మన్ సైనికుడిని ప్రేమిస్తుంది. తొలి వలపు వేడినుంచి బైటపడకముందే, తన మనసులో గాఢంగా హత్తుకున్న అతని రూపాన్ని ఇంకా తనివిదీరా చూడకముందే ఆ జర్మన్ సైనికుడిని చంపేస్తారు

ఫ్రెంచ్‌సైనికులు. ఆ పట్టణం జర్మనీ ఆక్రమణ నుంచి విముక్తమవుతుంది. జర్మన్ వాడిని ప్రేమించినందుకు ఈమె తల గొరికి అవమానించి పిచ్చెక్కించి పిచ్చాసుపత్రి పాలుచేస్తారు. ఒక గదిలో ఒంటరిగా ప్రియుడి కోసం దుఃఖించాలో లేదో, చనిపోయింది తానో ప్రియుడో తెలియని అయోమయంలో ఆమె భయంకర అనుభవాలతో నలిగిపోయింది. కొన్నాళ్ళకు ఆమె పిచ్చితగ్గిందని ఇంటికి తీసుకొస్తారు. ఆమె మళ్ళీ ఊపిరిపీల్చడానికి పారిస్ వస్తుంది. ఆమె పారిస్ చేరినరోజే హిరోషిమా మీద బాంబుపడిన వార్త వస్తుంది. అప్పుడామె వయసు 22 యేళ్ళు–

ఇప్పుడీ కథ చెబుతున్నపుడు నలభై యేళ్ళు వచ్చాయి. హిరోషిమాను తన ప్రేమ సంకేతంగా గుర్తించిందామె.

తన ప్రేమ జీవితంలో ప్రియుని మరణం ఎలాంటిదో ప్రపంచ చరిత్రలో హిరోషిమా వినాశనం అలాంటిదని కావచ్చు.

ఇన్నాళ్ళకు కూడా ఆమెకు సందేహం – నేను నిజంగా బతికున్నానా – అతను చనిపోయాడా – మా ప్రేమ లేదా - ఏది నిజం, ఏది అబద్ధం? ఈ మనుమలిలా ఎందుకున్నారు?

ఆమె- నా ప్రియుడు చనిపోలేదు. బతికే వున్నాడు.

అని ఆమె ప్రేమగాథను విపరీతమైన భావావేశంతో చెబుతుంటే, ఆ మాటలు ఒక ఎడతెగని హోరులా అందరి మనసుల్నీ అల్లకల్లోలం చేస్తున్నాయి. "నేను భరించలేను - అమ్మా -"

సూర్యం ఆశ్చర్యంగా పక్కకు చూశాడు.

రేణు రెండు చేతుల్లో తలపట్టుకుంది. వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"రేణుగారూ... ఏంటిది –"

రేణు చటుక్కున లేచి బైటికి నడిచింది. సూర్యం హడావుడిగా రేణు వెనకే బైటికి నడిచాడు. రేణు థియేటర్ ఎదురుగా వున్న సిమెంటు బెంచీ మీద కూలబడి వెక్కివెక్కి ఏడుస్తోంది.

"రవీ – రవీ–" అని.

సూర్యం రేణు పక్కనే కూచున్నాడు - మోకాళ్ళలోపెట్టుకున్న ఆమె తలను పైకెత్తాడు.

పిచ్చిగా ఏడుస్తోంది రేణు.

"రవి - రవి కావాలి - రవి చచ్చిపోలేదు" పిచ్చిగా ఏడుస్తోంది రేణు.

"రవి చచ్చిపోయాడా?" సూర్యం నిర్ఘాంతపోయాడు.

"రవి చచ్చిపోలేదు"

హృదయవిదారకంగా ఏడుస్తున్న రేణుపై జాలితో సూర్యం కరిగిపోయాడు.

ఆమెను దగ్గరకు తీసుకుని ఓదార్చాలనే కోరికను బలవంతాన నిగ్రహించుకుని--

"ఊరుకోండి. – రవి చచ్చిపోలేదు. బతికే వున్నాడు - మీరు వూరుకోండి" అని అనునయించాడు. రేణు దుఃఖావేశం క్రమంగా తగ్గింది. కాసేపు మౌనంగా కూచుని హఠాత్తుగా అంది–

"రవి చచ్చిపోయాడు"

"రేణూ..." మళ్ళీ ఏమవుతుందోననే భయంతో వారించబోయాడు.

రేణు అతన్ని పట్టించుకోకుండా చెప్పుకుపోతోంది. "రవి– నా రవి- నన్ను తన ప్రాణంగా ప్రేమించిన రవి చచ్చిపోయాడు–"

తను ప్రేమ, వివాహం, జీవితం, రవి మరణం, శిరీష స్నేహం- అన్నీ చెప్పుకుపోయింది.

సూర్యం సర్వం మరిచి విన్నాడు.

సినిమా అయిపోయి అందరూ బైటికి రావటం, అంతగొప్ప సినిమా చూడకుండా బైటికొచ్చేసి కూచున్న వీళ్లను వింతగా చూస్తూ వెళ్లటం ఇవేవీ ఇద్దరికీ తెలియవు.

రేణు చేతులు తన చేతిలోకి తీసుకుని ఆమె చెబుతున్న మాటల్లోంచి, ఆమె విషాదపు కళ్లల్లోంచి ఆమె హృదయపు లోతుల్లోకి తొంగి చూస్తున్నట్లు కూచున్నాడు సూర్యం.

తన లోపలి వేదనంతా వెళ్లగక్కి మౌనంగా కూచుంది రేణు.

రేణు మౌనాన్ని భంగపరిస్తే ఆమె ఆవేదనను అవమానించినట్లవుతుందని కదలకుండా నిశ్శబ్దంగా కూచున్నాడు సూర్యం. తొమ్మిదిన్నరకు మళ్లీ సినిమాకు వచ్చిన గమన వీళ్లనలా




గే చూసి ఆశ్చర్యపోయింది.

"రేణూ... భోజనం చెయ్యవా? సినిమాకు రావా?"

రేణు మెల్లగా లేచి "రాను" అంటూ హాస్టల్‌వైపు వెళ్లింది.

సూర్యం ఆమె వెనక ఆ రాత్రి ఆమె గదిలోకి వెళ్లాలా వద్దా అనే సంశయంతో వెళ్లకపోతే ఆమె ఇంత బాధలో ఒంటరిగా ఏం చేస్తుందో అనే భయంతో నిలబడిపోయాడు.

అయిదునిమిషాల తర్వాత రేణు గది దగ్గరికి వెళ్లి కిటికీలోంచి లోపలకు చూశాడు సూర్యం. రెండు టాబ్లెట్స్ మింగి మంచంమీద పడుకున్న రేణూను చూసి వెనక్కు వచ్చేశాడు. సినిమాకుగానీ, గదికిగానీ వెళ్లబుద్ధిగాక ఆ బాటవెంటే తిరుగుతూ వుండిపోయాడు. సినిమా చూసివస్తున్న అరవింద్‌వాళ్లు సూర్యాన్ని పలకరించి తమతో లాక్కెళ్లారు.




ఉదయం ఆరింటికి గమన గట్టిగా కుదిపి లేపుతుంటే మత్తుగా కళ్ళు తెరిచింది రేణు.

"ఇవాళ ఆదివారం గుర్తుందా– మనకు ఇక్కడికొచ్చాక దొరికిన మొదటి సెలవు. లే... అందరం పూనా అంతా తిరిగి వద్దామని బయల్దేరుతున్నాం"

"ఇంత పొద్దున్నేనా?" బద్ధకంగా లేచి కూచుంది.

"మరి ఏడున్నరకు బస్ వుంది. పూనా అంతా తిప్పి చూపించి పన్నెండింటికంతా ఇక్కడ దించుతారు. హాయిగదా"

ఉమ అప్పటికే తయారై మేకప్‌కు తుదిమెరుగులు దిద్దుతోంది.

రేణుకు వెళ్లాలనిపించలేదు. ఈ ఉమ ఆపకుండా మాట్లాడే మాటలు వింటూ నిరాసక్తంగా అన్నీ చూడాలి. అదేదో డ్యూటీలా గబగబా చూడటంకంటే అసలు చూడకపోవటం నయం అనిపించింది.

"నేను రాను... మీరు వెళ్లిరండి" అంది మళ్లీ పడుకుంటూ.

"ఏం... మీరు సూర్యంగారితో వెళ్తారా?" వ్యంగ్యంగా అడిగింది ఉమ.

"ఔను... మేమిద్దరం వెళతాం. మీతో రాను" కోపంగా అని ముసుగు పెట్టేసింది.

గమన ముసుగుతీసి తమాషాగా నవ్వి "బెస్టాఫ్‌లక్" అంది.

"మీరు కూడా ఎందుకిలా మాట్లాడుతున్నారు?" అంది రేణు లేచికూచుంటూ.

"ఏమన్నాను– మీరిద్దరూ పూనా తిరుగుతుంటే విషెష్ చెప్పటం తప్పా" చిరునవ్వుతో అంది గమన.

రేణూకు ఏం మాట్లాడాలో తెలియక కళ్లు మూసుకుని పడుకుంది. పదింటివరకూ అలాగే పడుకుని అప్పుడు లేచి స్నానంచేసి బ్రెడ్ తిని టీ తాగి లైబ్రరీకి వెళ్లింది. అక్కడ సూర్యం తప్పకుండా కనిపిస్తాడని ఆమెకు తెలుసు. సూర్యం రేణూను చూస్తూనే లేచి దగ్గరకు వచ్చాడు.

"ఎలా వున్నారు?"

"బాగున్నాను-" కళ్లు దించుకుని సమాధానం చెప్పింది.

"ఏం బాగు... రాత్రి భోజనంలేదు. పొద్దున టిఫినైనా తిన్నారా?"

"తిన్నాను"

"మీరింతవరకూ ఆర్కైవ్స్‌కు రాలేదుగా- రండి వెళదాం" అంటూ లేచాడు సూర్యం.

ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌కి కొద్దిదూరంలో వుంటుంది ఆర్కైవ్స్ భవనం. చక్కని పూలమొక్కలూ, చెట్లూ వున్న ఆవరణ మధ్యలో ఠీవిగా వుంటుంది.

లోపలంతా నిశ్శబ్దం. ప్రపంచ సినిమా చరిత్రనంతా పోగుచేసుకుని వుందా ఆ కళానిలయం. ప్రపంచంలో గొప్ప సినిమాలన్నింటినీ

పోగుచెయ్యటమే పనిగా పెట్టుకున్న నాయర్ గారి ఆధ్వర్యంలో పనిచేస్తోంది.

కాసేపు లైబ్రరీ అంతా చూసి రెండు పుస్తకాలు తీసుకున్నాడు సూర్యం.

"మనం పూనా చూడటానికి వెళదాం. మావాళ్లంతా వెళ్లారు. మీకేంపని లేకపోతేనే-"

"పనేముంది- భోజనంచేసి బయల్దేరదాం. రాత్రికెలాగూ ఇక్కడ భోజనం వుండదు. రాత్రి భోజనం వేళదాకా తిరిగి బైట భోజనంచేసి రావచ్చు" ఉత్సాహంగా రేణుతోపాటు హాస్టల్‌కి నడిచాడు.

ఆదివారం స్పెషల్‌గా వెజిటెబుల్ బిర్యానీ, పాయసం చేశారు.

వేడివేడిగా తిన్నారు.

"ఎన్నాళ్లకు పూనాలో కాస్త ఇష్టంగా భోంచేశాం" అంది రేణు.

"ఇది భోజనమా- ఏదో ఇంత ఫలహారం తిన్నట్టుంది. నాకు భోజనమంటే అన్నం, పప్పు, నెయ్యి, గోంగూరపచ్చడీ- గోంగూర పచ్చడి, గోంగూరపచ్చడి" ఏ ప్రియమైన వ్యక్తి నామాన్నో జపిస్తున్నట్లుగా మైమరచి అంటున్న సూర్యం మాటలకు పకపకా నవ్వింది రేణు.

రేణు నవ్వును చూస్తూ ఆనందించాడు సూర్యం. ఇద్దరూ బస్‌స్టాండ్‌కెళ్లి సిటీ అంతా తిప్పి చూపించే బస్‌లేమన్నా వున్నాయేమోనని కనుక్కున్నారు.

ఉన్నాయిగానీ టిక్కట్లు లేవన్నారు అక్కడి జనం. దగ్గర్లో ఏమన్నా చూడదగిన ప్రదేశాలున్నాయా అని అడిగితే కేల్కర్ మ్యూజియం వుందని చెప్పారు. ఆటో ఎక్కి మ్యూజియంకి వెళ్లారు.

"అదుగో ఆయన కేల్కర్-" వరండాలోంచి కనబడుతున్న హాల్లో కూచునివున్న ఒక ముసలాయన్ని చూపించాడు సూర్యం. "ఆయనే ఈ మ్యూజియం కట్టించి, వస్తువులు సేకరించి అభివృద్ధి చేస్తున్నది"

"మీకెలా తెలును?" రేణు ఆశ్చర్యంగా అడిగింది.

"మన క్లాసులో వున్న జర్మన్ ఫ్రెండు చెప్పారు. ఆ జర్మనీ ఆయన ఈ క్లాసుకి రావటం భలే విచిత్రం. నాకాయన పూనా గురించి చెబుతుంటారు. పూనాగురించి పూనా వాళ్లకే తెలియనన్ని సంగతులు తెలుసాయనకు"



ఆ మ్యూజియం ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతోంది మరీ గొప్ప విశేషాలేమీ లేవు.

రాతితో చేసిన వస్తువుల్ని చూస్తూ ఏ వస్తువుల్ని ఎందుకు వాడేవారో వూహిస్తూ సరదాగా మాట్లాడుకుంటూ మ్యూజియం చూశారు.

కాళ్లు పీకుతుంటే ఓ పార్కుకి వెళ్లి అక్కడ కూచున్నారు. సాయంత్రానికి మళ్ళీ ఇన్‌స్టిట్యూట్ దగ్గరకు చేరారు.

"ఈ ఇన్‌స్టిట్యూట్‌లో ఒక తెలుగు ప్రొఫెసరున్నారని అరవింద్ చెప్పాడు. రామచంద్రరావు గారట. వాళ్లింటికి వెళదామా?" అన్నాడు సూర్యం.

"వాళ్ళిల్లెక్కడో?"

"అదుగో- అవే ప్రొఫెసర్ల క్వార్టర్స్ - అక్కడ డిగితే ఎవరైనా చూపిస్తారు"






"ఒక్క నిముషం - నేను కాస్త ముఖం కడుక్కొని వస్తాను"

"ఒక్క నిముషం కాదు- ముప్పయి నిముషాలు తీసుకోండి. నేను శుభ్రంగా స్నానంచేసి వస్తాను" సూర్యం తన గదివైపు నడిచాడు. హడావుడిగా గది తలుపు తెరిచిన రేణు ఒక్క క్షణం కంగారుపడింది. అది తన గదేనా అని అనుమానం వచ్చింది.

మూడు మంచాలమీదా కొత్త దుప్పట్లు- తన మంచంమీద దుప్పటి తనది కాదు.

బైటికొచ్చి గదినెంబరు చూసింది. ఇదే చిత్రం అనుకుంటూ తన అల్మారా తెరిస్తే అందులో తన సూటుకేసూ, చీరెలు అన్నీ వున్నాయి.

"ఇది తనగదే" మళ్లీ గదంతా కలయజూసింది. టేబుల్‌మీద గాజుగ్లాసులో అందంగా అమర్చిన లిల్లీపూలు రేణు ఆశ్చర్యాన్ని చూసి పరిహాసంగా నవ్వాయి. ఆ పరిహాస పరిమళాలతో గదంతా నిండిపోయింది.

రెండు టేబుల్సూ చక్కగా సర్దివున్నాయి. ఎప్పుడూ టేబుల్‌మీద చిందరవందరగా వుండే టీ సామానూ, పళ్ళు, బిస్కట్లూ, గ్లాసులూ, పుస్తకాలూ, కాగితాలూ అన్నీ మాయమయ్యాయి. లైబ్రరీనుంచి గమన తెచ్చిన ఖరీదైన పుస్తకాలు, ఉమ కొనుక్కున్న హిందీ మాగజైన్లూ పొందికగా ఒక పక్కన పెట్టి వున్నాయి.

"ఏమిటీ చిత్రం—?"

"హలో—" గమన బాత్‌రూం నుంచి గదిలోకి వచ్చింది.

"ఇదేమిటీ గది" రేణు అడిగింది.

"ఉమ మాయ. ఒంటిగంటనుంచీ గదంతా సర్దింది. మన క్లాసులో హర్ష లేడూ? ఇవాళ అతన్ని పలకరించిందీవిడ"

"హర్ష అంటే—"

"అదే... సన్నగా, పొడుగ్గా, పాలబుగ్గలతో వుంటాడే చిన్నకుర్రాడు - క్లాసులో ముందువరసలో కూచుంటాడు"

"ఆ- ఆ- గుర్తొచ్చాడు"

"పాపం ఆ పిల్లాడు కాస్త మంచిగా ఈవిడ డిగిన వాటికి సమాధానం చెప్పాడు. అతను కూడా లక్నో నుంచే వచ్చాడట. అది తెలవగానే ఉమ ఇక అతన్ని వదల్లేదు. ఆమె అతి ధోరణి తెలుసుగా- ఇవాళ సాయంత్రం ఆరు గంటలకు అతన్ని మన గదికి ఆహ్వానించింది. అతని కోసమన్నమాట ఇంత అర్భాటం"

"అతనీవిడ అతిథి కాబట్టి మర్యాద చెయ్యాల్సిందే కాని- ఈ అలంకరణంతా ఎందుకు- ఇదేం స్వంత ఇల్లా - హాస్టల్‌రూం ఎలావుంటే యేమిటి?" నవ్వూ, ఆశ్చర్యం కలగలిసిన స్వరంతో అంది రేణు.

"ఇంతకీ ఆరయిపోయిందిగా- అతనేడి- ఈవిడేది?"

"ఇప్పటిదాకా అతనికోసం చూసి పిల్చుకొస్తానని వెళ్ళింది. ఉమ హడావుడి చేస్తున్నప్పుడే అనిపించింది అతను రాడు అని"

"పాపం వస్తాడులే... ఇంత ఆర్భాటం చేశాక రాకపోతే ఆమెకెంత నిరాశ"

రేణు స్నానంచేసి హాస్టల్ దాటి చెట్ల దగ్గరకు వచ్చేసరికి సూర్యం ఆమెకోసం ఎదురు చూస్తున్నాడు.

"ఒక్కనిమిషం చాలన్నారు - నలభైఅయిదు నిమిషాలు చేశారు" నిష్టూరంగా అన్నాడు.

"మీరు ముప్పయి నిమిషాలు ఇస్తానన్నారు. ఆ టైమ్ సరిపోయేదే కానీ మా గది మారిపోయింది. వెతుక్కునేసరికి పదిహేను నిమిషాలు పట్టింది"

"గది మారిపోవటమేమిటి?"

"అదే తమాషా" తమాషాగా నవ్వింది.

"అరే- విషయం చెప్పండి"

ఉమచేసిన హడావుడి అంతాచెప్పి, "పాపం ఉమ- అతనొస్తాడో రాడో" అంది జాలిగా.

"పాపం హర్ష... తప్పించుకోగలుగుతాడో లేదో" జాలిగా అన్నాడు సూర్యం.

"వస్తే ఏమవుతుంది- చక్కగా అలంకరించిన గదిలో ఓ పది నిమిషాలు కూచుని వళ్ళు తినటానికేం కష్టం?"

"వళ్ళు తినటం కాదు- ఉమగారి మాటలు వినటం కష్టం. మైగాడ్- ఆవిడ మాట్లాడటం మొదలెడితే ఆపాలని మర్చిపోతుంది"

భయం నటించాడు.

ఇద్దరూ కలిసి ప్రొఫెసర్‌గారిల్లు వెతుక్కుంటూ ఆ క్వార్టర్సులో ఓ అరగంట తిరిగారు. చివరికి ఆ ఇల్లు దొరికింది.

కాలింగ్‌బెల్ నొక్కితే ఒకావిడ వచ్చి తలుపు తీసింది.

ఎవరు కావాలన్నట్టు చూసింది.

"రామచంద్రరావుగారున్నారాండీ?" అనుకోకుండా రేణు తెలుగులోనే ప్రశ్నించింది. ఇది తెలుగు వాళ్ళిల్లు అని తెలియటంవల్ల తనకు తెలియకుండానే తెలుగులో మాట్లాడింది.

ఆ ప్రశ్న వినగానే ఆవిడ ముఖం వికసించింది.

"రండి... రండి - లేరుగానీ ఇప్పుడే వచ్చేస్తారు అలా షికారెళ్ళారు"

ఆవిడ ఆనందంగా వీళ్ళనాహ్వానించి డ్రాయింగ్ రూంలో కూచోబెట్టింది. తెలుగు మాట్లాడే మూడో మనిషిని వీళ్ళిద్దరూ దేవతను చూసినట్లే చూశారు.

"మంచినీళ్ళు తాగుతారా?"

వాళ్ళకు దాహం కాకపోయినా ఆమె 'మంచినీళ్ళు' ఇస్తానంటే వద్దనబుద్ధికాలేదు.

మంచినీళ్ళు తాగుతూ తమ గురించి, తామొచ్చిన కోర్సు గురించి చెప్పారు.

"రామచంద్రరావుగారు తెలుగువారని నిన్ననే తెలిసింది. కాసేపు మాట్లాడదామని వచ్చాం" అన్నాడు సూర్యం.

"రామచంద్రరావుగారికంటే వాళ్ళ నాన్నగారు మీకు బాగా తెలిసి వుంటారు" అందావిడ నవ్వుతూ.

"ఎవరండీ?" ఇద్దరూ ఆశ్చర్యంగా అడిగారు.

"కొడవటిగంటి కుటుంబరావుగారు"

"ఏమిటి" సూర్యం ఆనందం, ఆశ్చర్యం పట్టలేకపోయాడు.

"ఔను- కొడవటిగంటి కుటుంబరావుగారు మా మామగారు" ఆవిడెవరో కూడా తెలిసింది.




రేణు హైద్రాబాదునుంచి వచ్చిందని విని అనిడన్నారు - "హైద్రాబాదులో మావాళ్ళున్నారు. రెండుమూడేళ్ళకోసారి వస్తాం. కానీ నాకెందుకో హైద్రాబాదు వస్తే తెలుగుదేశం వెళ్ళినట్టుగా వుండదండి--"

"అదేమిటండి?"

"ఏమో... రైలు దిగగానే ఆ ఆటోవాళ్ళు కహా(జానా కహా(జానా అంటూ మూగుతారు-- అదే మన గుంటూరో, విజయవాడో వెళితే - "రండమ్మా రండి" అంటూ ఆహ్వానం పలుకుతారు. మేం తెలుగుకి ముఖంవాచి వెళతామేమో అ రిక్షా అబ్బాయే ఎంతో ఆత్మీయుడుగా అనిపిస్తాడు. అతని పిలుపుతోనే సగం ఉత్సాహం వచ్చేస్తుంది. హైదరాబాదులో ఇంటికెళ్ళి మనవాళ్ళతో మాట్లాడేదాకా ఆగాల్సిందే-" ఆవిడ ఫీలింగుకి రేణూ, సూర్యం మనస్ఫూర్తిగా అనందించారు. ఆవిడింకా మాట్లాడుతున్నారు--

"ఐనా ఏంతెలుగులెండి-- మేమింత కష్టపడి వస్తామా అక్కడ మనవాళ్ళే తెలుగు మాట్లాడరు. మా బంధువులింట్లో పిల్లలందరూ ఇంగ్లీషే-- ఇంగ్లీషు మీడియం స్కూళ్ళలో చదివారు. ఇంట్లోకూడా ఇంగ్లీషు మాట్లాడకపోతే సరిగాదని చిన్నప్పటినుంచీ ఇంగ్లీషే అలవాటు చేశారు. మమ్మీ, డాడీ అని తప్ప అమ్మా, నాన్నా అని పిలవరు. మేం ఇక్కడుంటున్నా మా పిల్లలు అమ్మా, నాన్నా అనే అంటారు. మా పిల్లలిద్దరిచేతా నీతిచంద్రిక దగ్గర్నుంచీ మొదలెట్టి తెలుగు కావ్యాలు, ఆధునికసాహిత్యం అన్నీ చదివించాను. వాళ్ళ తాతగారి కథలంటే వాళ్ళకు చాలా ఇష్టం."

తెలుగుభాషకోసం ఆవిడ పడుతున్న తపన, తెలుగు భాషా మాధుర్యాన్ని ఆవిడ అనుభవిస్తున్న తీరూ చూస్తుంటే వీళ్ళకు ముచ్చటేసింది.

"మీది గుంటూరాండీ?" సూర్యం అడిగాడు.

"ఔను... ఎలా కనుక్కున్నారు"

"మీ మాటలు అలా అనిపించాయి?"

" నా స్కూలు చదువంతా గుంటూరేనండి" అంది రేణు ఉత్సాహంగా.

"నేను సెయింట్ జోసెఫ్స్ స్కూల్లో చదివానండి" అన్నారావిడ.

"నేనూ అక్కడే-- మీరే సంవత్సరం?" రేణు అనడం.

రేణుకంటే ఆవిడ పదిపన్నెండేళ్ళు ముందు చదివినా అప్పటి టీచర్లే రేణు చదివినప్పుడు కూడా కొందరున్నారని తేలింది. ఇద్దరూ కలిసి ఓ పావుగంట--

జానకి టీచరుగారి ఇంగ్లీషు పాఠాలు--

ఇగ్నేషియస్ అమ్మగారి తెలుగు పాఠాలు

శ్యామలా టీచరుగారి సైన్సు పాఠాలూ-- ఆ స్కూలూ - ఆ వాతావరణమూ వాటిల్లో మునిగిపోయారు. గతంనుంచి వాళ్ళు పొందుతున్న అనందాన్ని చూస్తూ కూచున్నాడు సూర్యం.

మళ్ళీ సంభాషణ తెలుగుమీదికి మళ్ళింది.

"కుటుంబరావుగారి "చదువు" నాకు చాలా ఇష్టం" అంది రేణు.

"ఏది- మళ్ళీఅనండీ. ఏమిష్టం మీకు?" ఆవిడ ఉత్సాహంగా అడిగారు.

"చదువు... కుటుంబరావుగారి నవల"

"అమ్మయ్య-- తెలుగులో రెండు 'చ' లున్నాయని మీకు తెలిసినట్లే వుంది. నేను చూస్తున్నాను గదా- తెలుగువాళ్ళే భాషను నాశనంచేస్తున్నారు. చంద్రుడు అనేటప్పుడు 'చ'ని ఎలా పలుకుతారో చందమామ అనేప్పుడుకూడా అలాగే పలుకుతారు దంతాలతో పలికే 'చ' వుందని మర్చిపోయారు. చదువు చదుపు అంటూ దవడలతో పలుకుతుంటే ఎంత ఛండాలంగా వుంటుందీ--"

ముగ్గురూ కలిసి తెలుగు భాష ఎలా ఖూనీ అయిపోతోందో, గౌరవాన్ని ఎలా పోగొట్టుకుంటోందో వివరంగా మాట్లాడుకుంటుండగా రామచంద్రరావుగారు వచ్చారు. వీళ్ళను పలకరించి కూచుని - "మాకు కాస్త కాఫీ ఇవ్వగూడదూ?" అనడిగారు ఆవిడను

"ఇప్పుడెందుకండీ- ఎనిమిదవుతోంది" మొహమాటపడ్డారు వీళ్ళు.

"మంచి కాఫీకి వేళేమిటి... భోజనం చెయ్యగానే కూడా తాగొచ్చు"

"ఫరవాలేదు... మీరు కాఫీ తాగి ఓ గంట కబుర్లు చెప్పుకునేసరికి నే వంట చేసేస్తాను. కాఫీ తాగిన గంటకి అన్నం తినొచ్చు. అన్నం తిని వెళ్దురుగాని"

"వద్దండి— మీరు శ్రమపడకండి- మేం వెళ్ళిపోతాం" అంటూ వాళ్ళు పడుతున్న కంగారుని చూడకుండానే ఆవిడ వెళ్ళిపోయారు.

"పెద్ద శ్రమేముంది. అన్నం కుక్కర్‌లో అదే వుడుకుతుంది. ఓ కూర చేస్తే సరిపోతుంది. అన్నట్టు ఇవాళ ఆదివారం- మీకా మరాఠీ తిండికూడా దొరకదుగా— మెస్ మూసేస్తారు గదూ—"

ఔనన్నారు.

"మరింకేం... శుభ్రంగా అన్నం తిని వెళ్ళండి. ఆఁ... ఏమేం సినిమాలు చూశారు— క్లాసులెలా వున్నాయి—"

రామచంద్రరావుగారు ఎడిటింగ్ శాఖ ప్రొఫెసరు. ప్రపంచ సినిమాని బాగా అధ్యయనం చేసిన మనిషి. ఆయన మామూలు విషయం మాట్లాడినట్టుగా సినిమాల గురించి గొప్ప గొప్ప విషయాలు చెబుతుంటే వీళ్ళు ఆసక్తిగా విన్నారు.

"మన తెలుగు వాళ్ళకిక్కడ గౌరవం లేదు. తెలుగువాళ్ళిక్కడ చదవటమే తక్కువ. వచ్చిన వాళ్ళుకూడా నార్త్ వాళ్ళతో పోటీ పడలేరు. బెంగాలీ, కేరళ వాళ్ళున్నంత చురుగ్గా మనవాళ్ళెందుకుండరో అర్థంకాదు. ఏమైనా మన రాష్ట్రంలో మనకు ఇన్‌స్టిట్యూట్, ఆర్కైవ్స్ వుంటే బాగుంటుంది"

"ఔనండి— భారతదేశ సినిమా చరిత్ర గురించి పాఠం చెబుతున్నారు. ఆ పాఠం వింటే భారతీయ సినిమా అంటే మరాఠీ, బెంగాలీ, హిందీ సినిమా మాత్రమే అనిపిస్తుంది. మొన్న ఉదయశంకర్ పిక్చర్‌కి కాపీ అని మాత్రం వాసన్ చంద్రలేఖ సినిమాలో డాన్సుని చూపించారు. ఉదయశంకర్ సినిమా కంటే ఇదెంతో బాగుంది. అయినా సౌత్‌ఇండియన్ సినిమా అన్నప్పుడుకూడా తెలుగు సినిమా గురించి మాట్లాడరేం— మన రామబ్రహ్మం, కె.వి.రెడ్డి, బి.ఎన్.రెడ్డి, భానుమతి ఎవరి గురించీ మాట్లాడరు. ఆ రాజ్‌కపూర్ సినిమాల్లో పాటలు తప్ప ఏముందండి— చోరీ చోరీ చూపించారు. పాటలు తప్ప ఏమీ అర్థంలేని సినిమా— మన మిస్సమ్మ, మల్లీశ్వరి, పాతాళభైరవి— అరరే— ఒక్క సినిమా చూపించలేదు"

సూర్యం అక్కసు పట్టలేక ఆపకుండా మాట్లాడుతున్నాడు.

"గురుదత్ సినిమాల గురించి క్లాసు వుండటగదా— ఆ గురుదత్ సినిమాల ఫొటోగ్రాఫర్ మూర్తి మన తెలుగువాడే. చెప్పారా ఆ సంగతి" రామచంద్రరావుగారడిగారు.

"చెప్పరండీ... 'కాగజ్‌కేఫూల్' ప్రారంభ సన్నివేశంలో ఆ ఫొటోగ్రఫీ ఎంత అద్భుతంగా వుందండి—"

"ఇక భోజనానికి రండి" అని పిలిచారావిడ.

టేబుల్‌మీద రకరకాల పదార్థాలని చూడగానే ప్రాణం లేచొచ్చింది ఇద్దరికీ.

"ఎక్కువేం చెయ్యలేదండీ- దోసకాయ పచ్చడి నూరి, పప్పుచారు కాచాను. గోంగూరా ఆవకాయ పచ్చళ్ళు ఎలాగూ అడుగుతారని వాటిలోకి కాస్త ముద్దపప్పు విడిగా వుంచాను. ముద్దపప్పులో వూరమిరపకాయలు కూడా బాగుంటాయని నాలుగు వేయించాను"

ఆ పదార్థాలను చూస్తూ వుండలేక సూర్యం అన్నంలో పప్పు కలిపేశాడు. ఆవిడ నెయ్యి వడ్డించారు.

"పొద్దున గోంగూర పచ్చడిని జపిస్తే ఆ పుణ్యం ఎలా ఫలించిందో చూశారుగా—" అన్నాడు సూర్యం రేణుతో.

"మా నాన్నగారు వంట బాగానే చేసేవారు. ఆయనకు దేనిలోనైనా సైంటిఫిక్ పద్ధతి ఇష్టం. వంటయినా అంతే- ఎంతసేపు ఉడకాలి ఏవేవి ఎంత వెయ్యాలి అన్నీ సైంటిఫిక్‌గా ఆలోచించేవారు. విపరీతంగా కారాలూ, మసాలాలు వెయ్యటం ఇష్టం వుండేది కాదు"

రామచంద్రరావుగారు కుటుంబరావుగారి గురించి విశేషాలు చెబుతూ భోజనపు రుచిని మరికాస్త పెంచారు.

రేణుకూ, సూర్యానికి అది మరోలోకంలా వుంది. పెరుగన్నంలో ఆవకాయముక్క నంజుకుని తృప్తిగా భోజనం ముగించారు.




వేపుడుకో పాన్
నిండు నూనెలో వేయంచటానికో బాణలీ
మగ్గ వెట్టటానికో పాత్ర
ప్రెషర్ కుక్ చేయటానికి మరో నాల్గవ పాత్ర
ఉపయోగించే ప్రతి గృహిణికి

ముచ్చటైన మూడు ముక్కల సలహా

# ప్రెస్టీజ్
## ప్రెషర్ పాన్

ఎంత చేయగల్గుతుందో
ఎంత త్వరితంగా
చేయగల్గుతుందో కనిపెట్టండి

ఇది వేపుతుంది.





ఇది నిండు నూనెలో
వేపుతుంది




ఇది మగ్గ పెడుతుంది.



ఇంతే కాకుండా మామూలుగా
ప్రెషర్‌కుక్ చేస్తుంది.

**Prestige**
PRESSURE
PAN ©

సాధారణమైన మరియు ఎత్తైన మూతలలో లభ్యమవుతుంది.
మీవద్ద ప్రెస్టీజ్ ప్రెషర్‌కుక్కర్ ఉంటె మూత
అక్కరలేకుండా మీరు ప్రెషర్‌పాన్ మాత్రం కొనుక్కోవచ్చు

ttk తయారి

MAA COMMUNICATIONS PP 287D TEL

"ఆదివారం మళ్ళీ గండీ" అన్నారావిడ వీళ్ళు వెళ్ళబోతుంటే.

"ఇంతకీ మీ పేరు?" సంకోచంగా అడిగింది రేణు.

"అన్నపూర్ణ" అంటూ చల్లగా నవ్విందామె.

ఆ ఇంటినుంచి బైటికొచ్చినా హాస్టలుకి వెళ్ళబుద్ధికాలేదు ఇద్దరికీ—

ఆ రాత్రి పన్నెండింటివాకా కర్వే రోడ్డుమీద పచార్లుచేస్తూ, నయన హోటల్లో టీ తాగుతూ సూర్యం తన కిష్టమైన పుస్తకాలు, మనుషులు, పాటలు, ఆదర్శాలు అన్నీ రేణుకి చెప్పాడు.

పన్నెండు గంటలకు నిర్మానుష్యంగా వున్న ఆ రోడ్డుమీద వెన్నెల్లో నీడల్ని చూసుకుంటూ, కుటుంబరావుగారి 'నీకేం కావాలి' నవలలో కస్తూరి గురించి మాట్లాడుకుంటూ స్నేహంతో నిండిన మనసుల్తో ఇద్దరూ హాస్టల్‌కి వచ్చారు.

★ ★ ★

రేణు తలుపు తడితే గమన తీసింది.

"నువ్వేదో బుద్ధిమంతురాలివనుకుంటే-- అర్ధరాత్రి దాటాక రూంకి వస్తున్నావే?" అంది తమాషాగా.

"పిచ్చి మాటలు మాట్లాడకు గమనా— ప్రొఫెసర్ రామచంద్రరావు గారింటికి వెళ్ళాం- నేనూ సూర్యం"

బట్టలు మార్చుకుంటూ ఆ రోజు తిన్న భోజనాన్ని వర్ణించింది. "ఇంతకూ హర్ష వచ్చాడా?" హఠాత్తుగా గుర్తువచ్చి అడిగింది.

ఉమ నిద్రపోతున్నట్లు పడుకుంది గాని నిద్రపోలేదు.

"రాలేదు" అంది మెల్లిగా.

రేణు నాలుక కొరుక్కుంది ఇంకా ఎక్కువ మాట్లాడలేదు నయం అనుకుందిగానీ ఉమంటే జాలనిపించింది.

ఒకసారి వచ్చి వెళితే ఏంపోయింది. ఇంత ఆర్భాటం చేసి ఎంత నిరాశ పడిందో--

దుప్పటి ముసుగు పెడుతుంటే గమన-

"అప్పుడే నిద్రా?" అంది.

"పన్నెండున్నర అవుతోంది" ఆవులించింది.

"ఇవాళ మా అమ్మా, నాన్నా- చెల్లెళ్ళూ అందరూ గుర్తొస్తున్నారు. దిగులుగా వుంది"

"కొత్తగా అత్తవారింటి కొచ్చిన అమ్మాయికి మల్లే" రేణు నవ్వింది.

"అత్తగారింట్లో దిగులుకంటే భయం ఎక్కువేమో. నా పెళ్ళి గురించి ఆలోచిస్తే నాకు భయంగా వుంటుంది. అతనెలాంటివాడో, అత్తమామలెలా వుంటారో, వాళ్ళందరితో నేనెలా ఎడ్జస్టు అవాలో—" భారంగా నిట్టూర్చింది.

"అతన్ని గురించి బాగా తెలుసుకుని చేసుకోవా? అమ్మా, నాన్నా కుదిర్చినతన్ని చేసుకుంటావా?" రేణు గమనవైపు తిరిగింది.

"ఎవర్ని ప్రేమించాలి? నాకు చిన్నప్పటి నుంచీ నాకంటే పెద్దవాళ్ళతో స్నేహం చెయ్యటం అలవాటు. నాకు నా వయసు మగస్నేహితులెవరూ లేరు. ఆడ స్నేహితులూ లేరు. నా ప్రాణ స్నేహితురాలెవరో తెలుసా?"

"ఎవరు?"

'అమృతాప్రీతమ్- వాళ్ళమ్మాయిలతో స్నేహం లేదు. ఆవిడతో స్నేహం. అలాగే కాలేజ్ ప్రొఫెసర్లతో స్నేహం- నా వయసు మగాళ్ళంటే నాకు భయం. కొన్నేళ్ళ క్రితం జరిగిన సంఘటన చెబుతాను. మా అమ్మ ఒ కాలేజీలో లెక్చరర్. ఒక లెక్చరర్ మా ఇంటికి వచ్చేవాడు. ఇంట్లో అందరితో స్నేహంగా మాట్లాడేవాడు. ఒకరోజు మధ్యాహ్నం నేనూ, చెల్లెళ్ళూ మాత్రం ఇంట్లో వున్నాం. అతనొచ్చాడు. నేను మంచినీళ్ళు ఇచ్చాను. తాగేసి వెళ్ళిపోతాడనుకున్నాను. ఎందుకో భయమనిపించింది. చెల్లెళ్ళు డాబామీద ఆడుతున్నారు. "అమ్మలేదు" అన్నాను. "తెలిసే వచ్చాను" అని నవ్వాడు. ఆ నవ్వు చూస్తే ఎంత భయం వేసిందో. "మీరు వెళ్ళండి" అని వెనక్కు తిరిగాను. అతను నన్ను పట్టుకున్నాడు. నా ముఖం వెనక్కి వంచి పెదవులమీద ముద్దు పెట్టుకున్నాడు. నేను వెర్రికేక ఒకటి పెట్టి చేతికందిన విసనకర్ర తీసుకుని ముఖంమీద కొట్టాను. ఆ విసనకర్ర కంట్లో తగిలి నన్నొదిలాడు. నేనదే పనిగా అరుస్తూ, కొడుతూ వుంటే మా చెల్లెళ్ళు వచ్చారు. అతను పారిపోయాడు. నాకు మగాళ్ళంటే వున్న భయం




మరింత పెరిగింది. తర్వాత అమ్మ అతన్ని బాగా చివాట్లేసి ఇంటికి రావొద్దని చెప్పింది. నన్ను పెళ్ళి చేసుకోవాలని వుందట అతనికి. నాకిష్టంలేదని అమ్మతో చెప్పాను. అతను మళ్ళీ కనిపించలేదు. ఆ ముద్దు మాత్రం నాకు ఎంతభయంకరమైన అనుభవమో— ఐ హేట్ ఇట్' గట్టిగా అంది గమన.

"మనం ఆడవాళ్ళం అని క్రమక్రమంగా తెలిసివస్తుంది. చిత్రం— మగాళ్లందరూ మనల్ని తోటిమనుషులుగా కాకుండా ఆదృష్టితో చూడడం— మనం జాగ్రత్తగా మసులుకోవాల్సి రావటం. ఒక ఆడపిల్ల పదేళ్లవయసు నుంచి పెళ్లయ్యేదాకా తాను ఆడదాన్ననే విషయం ఎన్నిరకాలుగా ఎన్ని అనుభవాల ద్వారా నేర్చుకుంటుందో గదా— ఇదంతా మగాళ్ల సమాజం. ఈ సమాజం మనదికాదు అనిపిస్తుంది చాలా సార్లు. ఎవరిదో పరాయింట్లో స్వతంత్రం లేకుండా మసిలినట్లుగా వుండాలి. ప్రతిఅడుగూ ఆలోచించి వెయ్యాలి ప్రతిమాటా జాగ్రత్తగా మాట్లాడాలి. ఎంతవరకు పెదవులు సాగదియ్యాలో అంతవరకు మాత్రమే సాగదీసి నవ్వాలి— ఎక్కువయిందో ఏదో ముంచుకొస్తుంది. జీవితాంతం మనదికాని ఈ సమాజంలో బతకటం పెద్దబోరు— మగసమాజాన్ని మనుషుల సమాజంగా చెయ్యాలి. ఎప్పటికి మనుషుల సమాజం వస్తుందో గాని—" గమన మాటల్లోని ఆవేదననీ, నిజాయితీనీ అర్థంచేసుకోవాలని ప్రయత్నిస్తున్న రేణుకు తను ఉద్యోగంలో చేరిన కొత్తరోజుల్లో జరిగిన ఒక సంఘటన గుర్తొచ్చింది.

పక్కసీటాయన ఏదో జోకేస్తే అందరూ నవ్వారు. తనూ గట్టిగా నవ్వింది. ఆఫీసర్ అది చూశాడు. మర్నాడు కూడా ఆఫీసర్ వెళ్తున్నప్పుడు తను నవ్వుతూ ఎవరితోనో మాట్లాడుతోంది. ఆరోజు తను సంతకాలకోసం అతని దగ్గరకు వెళితే "ఊరికే నవ్వుతుంటారెందుకూ?" అన్నాడతను.

తనకు విపరీతంగా కోపం వచ్చింది.

"ఊరికే నవ్వక... డబ్బులిస్తారా నవ్వినందుకు?" అని అడిగింది. అతను మర్యాద, మన్నన గురించి ఐదునిమిషాలు మాట్లాడాడు. అతనెవరు నన్ను కంట్రోలుచెయ్యటానికి? అమ్మా నాన్నా భర్తా అన్నా వీళ్లు సరే— ఏదో ఓబంధం అధికారం ఉన్నాయి. తన నవ్వును కంట్రోలు చెయ్యటానికి ఇతనెవరు. ఏధైర్యంతో తన నవ్వు గురించి ప్రస్తావించాడు- తాను ఆడదాన్ని కాబట్టేగా—! ఆడదాన్ని కంట్రోలు చేసే అధికారం ప్రతిమగాడికీ వుంటుంది. ఆ మగాడెవరో మనకి తెలియనవసరం లేదు. బజార్లో, బస్‌లో, సినిమాహాల్లో ఎక్కడైనా ఎవరైనా మనల్ని భయపెట్టగలుగుతారు; కంట్రోలు చెయ్యగలుగుతారు. అతన్ని అంత కోపగించుకున్నా మర్నాడు నవ్వబోతే గట్టిగా నవ్వలేక పోయింది. తనకిష్టం లేకపోయినా పరోక్షంగా ఇంకోపద్ధతిలో అతని కంట్రోలు తన మీద పనిచేసింది.

తన ఆలోచనలన్నీ గమనకు చెప్పి ఆమె అనుభవాలు వింటూ తెల్లవారుతుండగా నిద్రలోకి జారింది రేణు.

★ ★ ★

తొమ్మిదిన్నర కావస్తున్నా హేమంత్ ఇంకా క్లాసుకు రాలేదు. క్లాసంతా గోలగోలగా వుంది. రేణు అందరినీ చూస్తూ కూచుంది. మంజరి క్రితం రోజు రాసుకున్న నోట్సు చదువుకుంటోంది. గమన నెమ్మదిగా క్లాసులోకి తొంగి చూసి హేమంత్ లేకపోవటంతో వికసించిన ముఖంతో క్లాసులోపలికి అడుగుపెట్టింది. గమన చేతిలో ఆమె ముఖంలాగే అందంగా వికసించిన ఎర్రని పువ్వొకటి వుంది.

"భలే తమాషా జరిగింది తెలుసా" అంది వాళ్లదగ్గరికి వస్తూ.

"ఏం జరిగిందంటూ" రజనీ మాధవీ బీనా మంజరీ ఇంకా ఆదగ్గరలో వున్న పదిమంది అమ్మాయిలూ హడావుడి పడ్డారు.

"నేను క్లాసుకి వస్తుంటే ఆ బోధివృక్షపు గట్టుమీద కూచున్న ఒకతను వచ్చి ఈ పువ్వు ఇచ్చాడు. ఎందుకు అని నేను కాస్త అయోమయంగా అడిగాను. పొద్దున్నుంచీ ఈ పువ్వు పట్టుకుకూచున్నాను. ఎవరైనా అందమైన అమ్మాయి కనిపిస్తారా ఈ పువ్వు ఇద్దామని. మీరు కనిపించారు. ఈ ఉదయం ఉషకన్యలా వున్నారు. అంటూ ఇచ్చాడు. నేను పువ్వు తీసుకుని వచ్చేశాను"

"ఓ— లక్కీగర్ల్— ప్రేమకానుక" అంటూ నవ్వారు.

"ఇంతకీ ఎవరతను?" రజనీ అడిగింది.

"ఇన్‌స్టిట్యూట్ అతనే— ఫైనల్ ఇయర్ అయిపోయిందట. డిప్లొమా సినిమా డబ్ చేసుకునే పని మిగిలిందిట" అంది గమన.

"చాలా వివరాలు సేకరించావే" అంటూ నవ్వింది మాధవి.

"అతనిపేరేమిటో—?"

"తెలియదు. నేనడగలా"

హేమంత్ రావటంతో క్లాసంతా నిశ్శబ్దమైపోయింది. తీరా హేమంత్ తానారోజు క్లాసు మర్నాడు తీసుకుంటాననీ, ఇప్పుడింకో క్లాసు జరుగుతుందనీ చెప్పి కొత్త లెక్చరర్ ఆకాష్‌ని పరిచయం చేశారు. అతను సినిమాలకు సంబంధించిన సిద్ధాంతాలేవో చెబుతానన్నాడు. ఐకనోగ్రఫీ మీద ప్రత్యేకంగా మీకు జ్ఞానం కలిగిస్తానన్నాడు. పాఠం మొదలెట్టాడు. మంజరి ఏదో అడగటంతో ఉలిక్కిపడింది రేణు.

"నీకేమన్నా అర్థమవుతోందా?" మంజరి మళ్లీ అడిగింది.

"ఏమీ తెలియటంలా... అసలు నేనింకేదో ఆలోచనలోపడిపొయ్యాను"

మాధవీ, రజనీ లేచి అసలు ఐకన్స్ అంటే ఏమిటో చెప్పమన్నారు.

ఆయన తన ముందున్న నాలుగైదు పుస్తకాల్లోంచి ఓ లావాటి పుస్తకంతీసి అందులోంచి ప్రపంచమేధావులందరూ ఈ విషయం గురించి ఏం మాట్లాడారో చదవసాగాడు.

హేమంత్‌గారేమనుకుంటున్నారా అని రేణు అటువైపు చూస్తే ఆయన తల పట్టుకు కూచున్నారు. క్లాసులో ఎవరూ పాఠం వింటున్నట్టు లేరు.

వెనక కుర్చీలలో వాళ్లు నవలలు పైకి కనిపించేలా పట్టుకుని మరీ చదువుతున్నారు.

నిమిషమొక యుగంగా గడిచీ గడిచీ ఒంటిగంటయింది. ఆకాష్ పాఠం ఆపలేదుగానీ ఇక సహించలేని విద్యార్థులు ఒక్కసారిగా లేచి బైటికి నడిచారు.



"ఆకాష్ కాదు... రాకాస్ అని పెట్టుకోవాల్సింది" మంజరి కచ్చిగా అంది.

"ఎంత జిడ్డో- ఒక్క ముక్క అర్థమైతే ఒట్టు"

"క్లాసయిపోగానే పెద్దబరువేదో దించినట్టయింది"

"మధ్యాహ్నం కూడా ఈ మహానుభావుడు రాడుకదా"

-రకరకాలుగా తమ విసుగుని వ్యక్తంచేశారు.

మధ్యాహ్నం పొద్దున తలనొప్పికి విరుగుడా అన్నట్లు భారతీయ చలనచిత్ర చరిత్రలో మొదటి సినిమాలలో కొన్ని దృశ్యాలు చూపిస్తూ లెక్చర్ ఇచ్చారు నాయర్‌గారు.

దాదాసాహెబ్ ఫాల్కే సినిమాలు— కాళీయ మర్దనంలో ఆయన కూతురు మందాకిని చిన్ని కృష్ణుడుగా నటించటం.

హరిశ్చంద్రలో కొన్ని దృశ్యాలు, బాలగంధర్వ పాటలు, నటనా హిమాంశురాయి, దేవికారాణీల జంట, చిన్నపిల్లగా దుర్గాఖోటే.



నారాయణరావు టాంబే నంగీతం– అన్నింటినీ ఆనందంగా చూశారు.

అచ్యుతకన్యలో అశోక్‌కుమార్‌ని చూసి కేరింతలు కొట్టారు.

'ఎంత ముద్దుగా వున్నాడో అంది రజని. గట్టిగా సైగల్ సినిమాలు చూసి ఆ పాటలకు పరవశించారు. నాడియా ఫైటింగు చూసి. ఆడవాళ్లందరూ చప్పట్లు కొట్టి కేకలేశారు. మాధవి ఈల వేసింది.

పృథ్వీరాజ్‌కపూర్‌నటన, సంభాషణలూ చూసి పడీపడీ నవ్వారు.

ఈ సినిమాలన్నీ సాంకేతికంగా అభివృద్ధి చెందనివే! సెట్టింగులలో, వేషధారణలో, నంభాషణలు పలకటంలో, పాటల సన్నివేశాలలో, నటనలో కృత్రిమత్వం కనిపిస్తూనే వుంది. ఇంతకుముందు వరకూ వీళ్లు చూసిన ప్రపంచసినిమాల స్థాయితో పోటీ పడలేని సినిమాలే– కానీ ఈ సినిమాలు చూస్తూ వీళ్లనుభవించిన ఆనందం మరే ఇతర సినిమాల వల్లా రాలేదు. ఎందుకంటే- అవి భారతీయ సినిమాలు. మన అభివృద్ధి వికాసాలను తెలియజేసే సినిమాలు. తల్లి తన పిల్లల బాల్యచేష్టలను చూస్తూ అనుభవించే అవ్యక్తానందమే వీళ్లూ అనుభవించారు. ఆ సినిమాలను ఆ లోపాలన్నింటితో సహా ప్రేమించారు. ఉత్సాహంగా కళకళలాడుతున్న వాళ్ల ముఖాలలో ఎంతో తృప్తివుంది.

రేణు, సూర్యం టీతాగి బాల గంధర్వపాటల గురించి కుటుంబరావుగారు రాసిన వ్యాసం గురించి మాట్లాడుకుంటున్నారు. మాట్లాడుకుంటున్నారనటం కంటే సూర్యం మాట్లాడుతున్నాడు - రేణు వింటోంది అనటం సరైంది.

"ఇన్ని బాలగంధర్వ పాటలు నేను వినగలనని- అదే- సినిమాలో చూడగలనని అనుకోలేదు. కుటుంబరావుగారు బాలగంధర్వ పాటలలో భావాన్ని ఎంత బాగానో పలికిస్తాడని రాస్తు ఒక పాటలో శిశుపాల శిశునమ అనే మాటలు పలికిన విధం గమనించమంటారు.

ఆ పాట నాటకాలలోది అనుకుంటాను. ఆ పాట కూడా వినాలనిపిస్తోంది'' అంటూ ఇంకో లోకంలోంచి మాట్లాడుతున్నాడు.

రేణు సూర్యం వంక చిత్రంగా చూస్తూకూ ుంది. సంగీతంలో, సాహిత్యంలో, సినిమాలలో, చిత్రకళలో - అన్నింటిలోనూ అభిరుచి వుంది. అభిరుచి వుండటమే కాదు - మంచి జ్ఞానం కూడా వుంది. ప్రపంచ రాజకీయాలూ, ఆర్థిక విషయాలూ కరతలామలకం అన్నట్టు వుంటాడు. మనిషెప్పుడూ జ్ఞానదాహంతో తపించిపోతుంటాడు. మళ్ళీ గంభీరంగా ఎవరితో కలవకుండా వుండడు. చిన్నపిల్లాడిలా నవ్వుతూ నవ్విస్తూ స్నేహం చేస్తూ వుంటాడు.

సూర్యం అంటే, అతని వ్యక్తిత్వం అంటే రేణుకు రోజురోజుకీ గౌరవం పెరిగిపోతోంది. అతనిలో జ్ఞానంతో సమానస్థాయిలోవున్న భావుకత రేణును ఆకర్షిస్తోంది. అరవింద్ వచ్చి సారీ అంటూ సూర్యాన్ని పిల్చుకెళ్ళాడు. ఆరోజు సినిమా ఆరున్నరకు. ఆరయింది. రేణు హాస్టల్ వైపు నడిచింది. మెట్లెక్కుతుండగా హర్ష విసురుగా మెట్లు దిగుతూ ఎదురయ్యాడు. అతని ముఖమంతా కోపంతో విసుగుతో వివర్ణమయింది. ''మైగాడ్... చస్తే ఇటుకేసి రాను'' అని గొణుక్కుంటూ రేణును గమనించకుండానే వెళ్ళిపోయాడు.

రేణు గదిలోకి వెళ్ళింది. ఉమ దిగులుగా మంచంమీద కూచునివుంది. రేణుకు బాగా జాలేసింది. కానీ హర్షను అంత చిన్న పిల్లాడిని ఈవిడ ఆ రకంగా చూడటమెందుకు. ఆమెకు ముప్పయ్యేనిమిదేళ్ళు - పెళ్ళి కాలేదనే దిగులువుండవచ్చు. ఆ దిగులుతో ఉచితానుచితాలు మర్చిపోతే ఎలా? పైగా ఆమె అలంకరణ, ఆమె మాటలధోరణీ అందరికీ విసుగనిపిస్తోంది. అది అందరూ పరోక్షంగా చెబుతున్నారు కూడా- అయినా మార్చుకోదు.

ఆరోజు ఉమమీద జాలితో ఆమెతో కలిసి థియేటర్‌కి నడిచి ఆమె పక్కనే కూచుంది. చాలారోజుల్నించి ఉమ ఒక్కతే కూచుని సినిమాలు చూస్తోంది. అరవింద్ ప్రహసనం తర్వాత ఆమెనందరూ దూరంగా వుంచారు.

సూర్యం రేణువక్కకు రాబోయి ఉమను చూసి ఆగాడు. రేణు నవ్వి రమ్మన్నట్టు చూసింది. కానీ అరవింద్, మనోహర్‌లు సూర్యాన్ని లాక్కెళ్ళి తమ దగ్గర కూచోబెట్టుకున్నారు.

ఆ రోజు 'సువర్ణరేఖ' సినిమా. ఋత్విక్ ఘటక్ తీసిన సినిమా.

భారత - పాకిస్థాన్‌లుగా దేశం విభజించబడినప్పుడు జరిగిన కల్లోలాలకి బలైపోయిన కుటుంబాల కథ. ఒకతను చిన్న వుద్యోగంలో స్థిరపడి చెల్లెల్నీ, మతకల్లోల సమయంలో అనాథగా తారసపడిన పిల్లాడినీ పెంచి పెద్ద చేస్తాడు. ఆ పిల్లల బాల్యాన్ని అద్భుతంగా తీశాడు ఘటక్. సువర్ణరేఖ నదీ తీరం, పొలాలూ, రెండవ ప్రపంచయుద్ధకాలంలో విమానాలు దిగటానికి ఉపయోగపడిన మైదానం, ఆ ప్రదేశాల్లో ఈ పిల్లల పరుగులు- మధురాతి మధురమైన సంగీతం- హృదయపు లోతుల్లోకి సూటిగా చొచ్చుకుపోయే భావాలు గల మాటలూ పాటలూ-

'ఈరోజు వరిపొలాల్లో ఎండా నీడా దాగుడుమూతలాడుతున్నాయి. తుమ్మెదలు యివాళ తేనెతాగటం మానేసి వెలుతుర్నే తాగుతున్నా' యంటూ పాటా, ఆ పాటకు ప్రాణం పోసే ప్రకృతీ- క్రమంగా పిల్లలు పెద్దవాళ్ళయ్యారు. ప్రేమించుకున్నారు. అన్న ఒప్పుకోకపోవటంతో కలకత్తా పారిపోయారు. అక్కడ దుర్భర దరిద్రం- యాక్సిడెంట్‌లో అతని మరణం. చిన్న పిల్లాడితో ఆమె దయనీయ జీవితం. విచిత్ర పరిస్థితిలో ఉన్న ఆ చెల్లెల్ని అనుభవించి ఆనందం పొందుదామని రావటం- చెల్లెల్ని చూసి నిర్ఘాంతపడటం-

విషాదం మనసుని కమ్మేయగా పిచ్చెక్కినట్లనిపించింది రేణుకు.

సినిమా అయిపోయాక ఎవరితో ఏమీ మాట్లాడకుండా బైటికి నడిచింది. అలా నడుస్తూనే వుంది. గేటు దగ్గరకు వెళ్ళాక నడుస్తూనే తలఎత్తిపైకి చూసింది. రెండు పెద్దచెట్లు పందిరి వేసినట్టుగా కలిసిపోయాయి. ఆ చెట్ల ఆకుల సందుల్లోంచి ఆకాశంలో వెన్నెల ముక్కలు కనిపిస్తున్నాయి. అలా ఆకాశాన్ని ఆ చెట్ల మధ్యలోంచి చూడటం అద్భుతమైన అనుభవంలా ఒకసారి ఒళ్ళంతా పులకరించింది. రెండు నిమిషాలలా ఆగి మళ్ళీ తనకు తెలి




యకుండా నడవటం ప్రారంభించింది.

మనసు ఏం ఆలోచిస్తోందో గమనించే స్పృహ కూడాలేదు. నిరామయంగా వున్న మన సులాగే వుంచి నడుస్తూనేవుంది. ఇంకా యింకా - కర్వే రోడ్డుమీద జనాల్నీ వాహనాల్నీ తప్పించుకుంటున్నాననే స్పృహలేకుండా నడుస్తోంది. "ఇక చాలు ఆగండి" సూర్యం గట్టిగా కేకపెట్టాడు.

రేణు ఈ లోకంలోకి వచ్చింది.

"ఎక్కడికలా వెళ్ళిపోతున్నారు?"

అయోమయంగా చూసింది.

"ఇక పదండి- వెనక్కు"

రేణు మళ్ళీ నడక మొదలెట్టింది.

"సినిమా గురించే ఆలోచిస్తున్నారా?"

రేణు తలూపింది

"నిజంగా సినిమా గురించేనా?"

తలెత్తి చూసి "నిజంగా" అంది - నమ్మబ లుకుతున్నట్టు అమాయకంగా దీనంగా వున్న రేణు ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని ఆ రెండు కళ్ళనూ ముద్దాడాలనిపించింది సూ ర్యానికి.

తన ఆలోచనకు తానే ఉలిక్కిపడి రేణుకేసి చూడటం మాని నేలని చూస్తూ నడుస్తున్నాడు. "సినిమా అయ్యాక నాకేమయిందో నాకే తెలి యదు. సినిమాలో అక్కడక్కడా ఏడ్చానుగానీ సినిమా పూర్తయ్యేసరికి ఏడుపు కూడా రాలేదు. ఇప్పటికీ నేనా స్థితినుంచి బైటపడలేకపోతు న్నాను. మనసు మొద్దుబారిపోయినట్లుంది. నేనింతదూరం నడుస్తున్నానని కూడా నాకు తెలియదు. మీరు నా వెనకాలే వస్తున్నారా?" రేణు సంజాయిషీ చెప్తున్నట్లు చెప్పింది.

"మీరు ఒక్కరే నడవటం చూసి మీ వెనకే బయల్దేరాను. ఈ సినిమా చూసి మీలాగా నడవకపోతే తప్పుగానీ- నడిచిన మీరెందుకు సంజాయిషీ చెప్తున్నారు?" అన్నాడు సూర్యం.

"అదేంటి... నడవటం ఎందుకు?" అంది రేణు.

"మరి సినిమా చివర ఆ పిల్లవాడు వాళ్ళ మామను ముందుకి నడవమని లాక్కెళతాడు చివరలో ఆ సంగీతం—

చరయేతి చరయేతి అంటే ఏమిటనుకు న్నారు 'కదలండి- నడవండి' అని. అదే సినిమా థీమ్. మీరు దానిలో పూర్తిగా లీనమై ఆ దర్శకుడు చరయేతి చరయేతి అని వెనక నుంచి చెబుతున్నట్లే నడిచి వెళ్ళిపోయారు. మిమ్మల్ని చూస్తే ముచ్చటేసింది. చాలా నిర్మ లంగా సెన్సిటివ్‌గా వున్నారు. అనుభూతికి పూర్తిగా వశులైపోతున్నారు. మేం చూడండి - అక్కడ దర్శకుడు మన గుండెల్ని పిండినా సరే నిమిషంలో సరిచేసుకుని మామూలు మనుషులమవుతాం"

"ఆగండి" అంది రేణు ఇద్దరూ పెద్ద గేటు దాటిలోపలికి నాలుగడుగులు వెయ్యగానే- ఆగి ఏమిటన్నట్టు చూశాడు సూర్యం.

రేణు చెయ్యెత్తి ఆకాశంవంక చూపించింది. చెట్ల ఆకుల సందుల్లోంచి వెన్నెల వర్షంలా కురుస్తోంది. ఆకులు మెల్లిగా కదిలినప్పుడు వెన్నెల అలలు కలవరంగా కదిలినట్లుంది.

నిశ్శబ్దంగా వున్న ఆ వెన్నెల రాత్రిలో మహా వృక్షాల నీడలో, వెన్నెల జల్లులో ఏకాంతంగా నిలబడి పక్కనున్న రేణును దగ్గరకు తీసుకో కుండా వుండటం సూర్యంవల్ల కాలేదు.

రేణు భుజాలమీదుగా చెయ్యివేసి తన దగ్గరగా తీసుకున్నాడు. ఇంకో చేత్తో ఆమె గడ్డంపట్టుకుని ముఖం పైకెత్తి కళ్ళలోకి చూశా డు. ఒక్క నిమిషం అలా గడిచింది-

రేణూ ఆ అచేతనావస్థలోంచి బైటపడి ఒక్క వుదుటన హాస్టల్ వైపు పరిగెత్తుతున్నట్టే నడి చింది.

హడావుడిగా తలుపు తీసుకుని గదిలోకి వచ్చిన రేణును చూసి "అమ్మయ్యా- వచ్చావా." అంది గమన. "ఎన్ని విషయాలు న్నాయో- ఎప్పుడొస్తావా ఎప్పుడు చెబుదామా అని కాచుక్కూచున్నాను"

రేణు పరిస్థితిని గమనించకుండా మంచంమీద ఆమె పక్కనే కూచుంది గమన.

రేణు గమన మాటల్ని వినకుండా తలను రెండుచేతుల్లో పట్టుకు కూచుంది.

గమన ఆ రెండు చేతులూ తీసి-

"నీ తలనొప్పి మర్చిపోయే కబుర్లు చెబుతా

నుండు

"మన క్లాసులో జరుగుతున్న డ్రామా నీకు తెలుసాతెలియదా- ముందు చెప్పు" రేణును గట్టిగా కుదిపింది

"డ్రామా ఏమిటి-" విసుగ్గా అడిగింది రేణు.

"డ్రామా అంటే డ్రామాకాదులే- ప్రహసనం- ప్రేమ ప్రహసనం" నవ్వింది గమన.

రేణు ముఖం తెల్లగా పాలిపోయింది. నూర్యాన్నీ తననూ వుద్దేశించి అంటోందా- గుండెల్లో ఏదో పిరికితనం ప్రవేశించింది. "ప్రేమ ప్రహసనమా?"

"ప్రేమంటే ప్రేమకాదులే- ఆకర్షణ"

"గమనా- నాకసలే తలనొప్పిగా వుంది. చెపితే సరిగ్గా చెప్పు- లేకుంటే లేదు" గట్టిగా విసుక్కుంది.

"సంజయ పురాణం చెబుతాను- సావధానంగావిను"

గమన మంచంమీద రెండుకాళ్ళూ పెట్టుకుని చెబుతోంది.

మాధవీ, రజనీ బీనా- వీళ్ళ ముగ్గురికీ సంజయ్ విషయంలో పోటీ పడుతోంది. ముందు మాధవే గదా మమ్మల్ని అతనికి పరిచయం చేసింది. తర్వాత రజని బాగా ఎడ్వాన్స్ అయింది. సాయంత్రం రాత్రీ సినిమాలకు రాకుండా సంజయ్‌తో బైటికి వెళ్తోంది. సంజయ్ కూడా రజనీ అంటేనే ఎక్కువ ఆసక్తి చూపిస్తున్నాడు. దాంతో బీనాకి కోపం వచ్చి అతనితో మాటలు పూర్తిగా బంద్ చేసింది. మాధవి మాత్రం అలా చెయ్యలేక పోతోంది. ఇవాళ సాయంత్రం మాధవీ, రజనీ, సంజయ్ ముగ్గురూ కలిసి కాంటిన్‌లో టీ తాగారు. టీతాగగానే రజనీ లేచి మేమిద్దరం దక్కన్ జింఖానా దాకా వెళ్తున్నాం. మీరు పిక్చర్‌కి వెళ్తారుగా- బై అన్నదట. పాపం మాధవి చాలా అఫెండయిపోయింది. వాళ్ళిద్దరూ వెళ్లగానే నా దగ్గరకొచ్చి గొడవ- రజనీ చూడు, సంజయ్‌ని నా దగ్గర్నించి లాక్కుపోతుందని. రజనీ లేకపోతే సంజయ్ మాధవికే దక్కేవాడు. అదే ఆమె బాధ-" ఆగింది గమన.

"ఏమిటా మాటలు గమనా- దక్కటమేమిటి- మాధవిగారి గురించి ఎందుకలా మాట్లాడుతున్నావు పెద్దావిడ"

"పెద్దావిడా- మాధవి వయసు ఎంతుంటుందనీ?"

"ఎంతుంటుంది?"

"నలభై"

"మరి- పెద్దావిడ కాదా-"

"నలభైఏళ్ళకే పెద్దావిడా- ఇకయినట్లే- నలభైఏళ్ళ వయసుకే ఎఫైర్స్ ఏమీలేకుండా వుండాలంటే-"

"ఎఫైర్స్ లేవూ, ఏమీలేవు. చెత్తమాటలు మాట్లాడకు"

"నేనటం కాదు రేణూ! మాధవి స్పష్టంగా చెప్పారు. తనకో ఎఫైర్ కావాలని- సంజయ్‌తో ఎఫైర్ మొదలైవుంటే ఆవిడ కోరిక తీరేది"

"నిజమా- నలభై ఏళ్ళావిడ. పెరిగిన పిల్లలున్నారు. ఇదేం కోరిక?"

"మాధవి గురించి నీకు ఆ వివరాలే తెలుసు- నీకు తెలియని వివరాలు చాలా వున్నాయి"

"గమనా, రేణూ ఇద్దరూ ఉలిక్కిపడి అటు వైపు చూశారు. ఎప్పుడు వచ్చిందో మాధవి అక్కడ నిలబడి వుంది. వీళ్ళు కంగారుగా చూస్తుంటే నెమ్మదిగా వచ్చి వీళ్ళకెదురుగా గమన మంచం మీద కూచుంధి.

"రేణూ- నిజంగా నువ్వన్నదే నా జీవితం. నాపేరు మాధవీముఖర్జీ. వయసు నలభైఏళ్ళు. పిల్లలు ఇద్దరు. 18, 16 ఏళ్ళ వయసుగలవారు. ఇప్పుడివాళ నేను చచ్చిపోతే నాగురించి చెప్పుకోటానికి ఏమీలేదు. నాకు పదహారేళ్ళకే పెళ్ళయింది. పెళ్ళయ్యాక ఇంటిదగ్గరే చదివి బి.ఎ- ఎం.ఎ. డిగ్రీలు సంపాదించాను. నాభర్త ధనవంతుడు. మూడు ఫ్యాక్టరీలకు యజమాని. తలమునకలయ్యే పనులు. నెలకు పదిహేనురోజులు టూర్లలో వుంటాడు. కానీ నేను మాత్రం అతని ఇల్లు కనిపెట్టుకుని వుండాలి. పిల్లల్ని పెంచుతూ వుండాలి. పిల్లలకీ నా అవసరం తీరిపోయింది. నేను ఉద్యోగం చెయ్యటం ఆయనకిష్టంలేదు. నాకు సినిమాలంటే ఇష్టం. ఫిలింక్లబ్‌లో మెంబరయ్యేంతవరకు మాత్రమే నా యిష్టం కొనసాగు




తుంది. నేను సినిమాలో నటిస్తానంటే- సినిమాని డైరెక్ట్ చేస్తానంటే కుదరదు వీల్లేదు.

నా పెళ్ళయిన తర్వాత నేను కలకత్తా వదిలి ఒక్కదాన్ని రావటం యిదే మొదటిసారి. నాభర్త నెలకి పదిహేనురోజులు ఎక్కడెక్కడో తిరుగుతాడు. ఎన్ని ఎఫైర్లు పెట్టుకుంటున్నాడో అని నా మనసులో నేనే దహించుకు పోయేదాన్ని. ఇది నా జీవితంలో వచ్చిన మొదటి అవకాశం. బహుశా చివరి అవకాశం కూడానేమో. నాకు ఇక్కడ ఎన్ని గొప్ప విషయాలో తెలుస్తున్నాయి. నా మెదడు వికసిస్తోంది. నా శరీరం కూడా కొత్త అనుభవాన్ని కోరుకుంటోంది. ఒక గొప్ప ఆవేశంతో, ఆకర్షణతో, కోరికతో నేను సెక్స్ అనుభవించి ఎన్నిఏళ్లయింది.-

నా భర్తకు లేని నిషేధం నాకెందుకు? సంజయ్ నాకు నచ్చాడు. అతనితో ఎఫైర్ కావాలనుకున్నాను- తప్పేమిటి? చెప్పండి''

మాధవి కళ్ళల్లో సన్నటి నీటిపొర.

రేణూ, గమన మాట్లాడకుండా కూర్చున్నారు.

''చెప్పండి నేను ఎఫైర్ కావాలనుకోవటం నేరమా, పాపమా- సంఘ విద్రోహమా-

మీరనుకోవచ్చు ఇలాంటివాళ్ళతో సమాజం చెడిపోదా అని, మరి సమాజం నాగురించి- మనలాంటి స్త్రీల గురించి ఏమాలోచించింది. మనలో శక్తులన్నీ వ్యర్థమైపోతున్నాయని మనం గిలగిలాడుతుంటే మన ఉత్సాహం, చురుకుదనం, తెలివీ అన్నీ ఆ ఇళ్ళకే అంకితమైపోతుంటే సమాజానికేమీ పట్టలేదేం- నాకు ఈ సమాజం, ఈ నీతులూ నా భర్త నా సంసారం అందరూ అన్నీ ద్రోహమే చేశారు. ఆ ద్రోహానికి ప్రతీకారం చెయ్యాలనే కోరికతో జ్వలించి పోతున్నాను. అర్థమవుతున్నానా నేను?'' మాధవి చెక్కిళ్ళమీద కన్నీరు చిందటంచూసి గమన లేచింది.

మాధవి కన్నీరు తుడిచింది.

''మిమ్మల్ని అర్థంచేసుకోటానికి మాశక్తి సరిపోతుందా? ఐనా ప్రయత్నిస్తాం- మాధవీ... ప్లీజ్‌కంట్రోల్'' అంటూ అనునయించింది.

''మీరు నాలా తయారవకండి. మీరు చిన్న పిల్లలు. పెళ్ళికీ, ఇంటికీ మీ జీవితాలని అంకితం చెయ్యకండి. మీ శక్తులన్నిటినీ వెలికితెచ్చుకోండి. మీ వునికిని సార్థక పరుచుకోండి'' మాధవి మాటలు పూర్తికాకుండానే ఉమ పెద్ద చప్పుడుతో తలుపు నెట్టుకుంటూ లోపలికి వచ్చింది. ''మీరెవరూ డిన్నర్‌కి రాలేదేం- తొమ్మిదిన్నర అయింది- ఎప్పుడు తింటారు- ఎప్పుడు సినిమాకి వస్తారు?''

''ఇంకేం డిన్నర్- థియేటర్‌కి పోతాను'' అంటూ మాధవి లేచింది.

రేణుకూ, గమనకూ కూడా ఏమీ తినాలనిపించలేదు. భారమైన మనసులతో మాధవి వెంటే థియేటర్‌కి నడిచారు. థియేటర్‌లోకి అడుగుపెట్టగానే అప్రయత్నంగా సూర్యం కోసం వెతికాయి రేణు కళ్ళు.

''అడుగో సూర్యం- నేను మీనా దగ్గర కూచుంటా'' అంటూ గమన ముందుకి వెళ్లింది.

అతిప్రయత్నం మీద సూర్యం వైపు నడిచాయి రేణుకాళ్ళు. అంతకు ముందు జరిగిన విషయాన్ని గురించి ఆలోచించుకోలేదు. మళ్ళీ సూర్యం పక్కన కూచోవాల్సి వచ్చిందనే కంగారులో మాట్లాడకుండా కూచుంది.

''ఈ గంటసేపూ ఏం చేశారు?'' మామూలుగా ఏమీ జరగనట్లే అడిగాడు సూర్యం.

''రేణు మాట్లాడలేదు.

''బాగా ఏడ్చారా?''

రేణు చురుగ్గా సూర్యంవైపు చూసింది.

''ఏడవటం దేనికి?''

''అమ్మయ్య-- మీకళ్ళు ఏడ్చినట్లు లేవు. రేణూ - ఆ నిమిషం నేనేమయ్యానో నాకే తెలియదు. నేనలా చెయ్యటం తొందరపాటని నాకిప్పటికీ అనిపించటంలేదు. ఆ సమయంలో మీరు చూపించిన ప్రకృతిని చూస్తూ, అంతకు ముందే మీలోని భావుకత చూసి మీకు దగ్గరైన నేను మిమ్మల్ని దగ్గరకు తీసుకోకుండా వుండటం అసాధ్యం. మీకు ఇష్టంలేకపోతే-- అయాం సారీ- నేనేం చెయ్యలేను. నాకు మాత్రం మీకంత దగ్గరగా జీవితమంతా గడపాలని వుంది''

ఏ తడబాటూ లేకుండా తన నిర్ణయాన్ని చెప్పాడు సూర్యం.

సర్వశక్తులూ కోల్పోయినట్లు నీరసంగా కుర్చీలో వెనక్కు జారగిలబడి కూచుంది రేణు.

సినిమా మొదలయింది.

"సినిమా చూస్తున్నారా?"

రేణు మాట్లాడకుండా చూస్తోంది.

అది కార్టూన్ సినిమా. ఒక చిన్న గ్రామం. పదిపదిహేను గుడిసెలు కనిపిస్తుంటాయి. ఏవో కీటకాలు ఆ గుడిసెలలోకి ప్రవేశించి చికాకు పెడుతుంటాయి. ఆ గ్రామ ప్రజలు ఆలోచించి ఓ పాముని తీసుకొస్తారు. ఆ పాము కీటకాలని మింగేస్తుంది. కానీ కాసేపట్లో ఆ పాము పదిపాములై జనాన్ని ఇబ్బంది పెడుతుంది. ఆ పాముల బారినుంచి తప్పించుకోటానికి ఓ ముంగీసను తెస్తారు. ఆ ముంగీస పాముల్ని తినేస్తుందిగానీ మళ్ళీ అదే సమస్య జనానికి ఎదురవుతుంది. ముంగీసల్ని చంపటానికి నక్క– నక్కల్ని చంపటానికి సైనికులు. సైనికులు వీళ్ళని బైటికి తరిమి గుడిసెల్ని ఆక్రమిస్తారు. ఆ సైనికుల్ని చంపటానికి మళ్ళీ పాముని తీసుకొస్తారు. ఇరవై నిమిషాల సినిమా అది.

"చాలా బాగుంది కదా?" సూర్యం అడిగాడు.

"ఔను" అంది.

"జనం ఒక సమస్యని పోగొట్టుకుందామని ఇంకొక సమస్యని ఎలా తెచ్చిపెట్టుకుంటారో చాలా బాగా తీశాడు దర్శకుడు. బ్రిటీష్ వాళ్ళను తరిమి, కాంగ్రెసునెక్కించాం, కాంగ్రెస్‌ని తరిమి కొన్నాళ్ళు జనతాని తెచ్చాం. అదీ లాభంలేదని మళ్ళీ కాంగ్రెస్‌ని ఎక్కించాం– మనవైతే కాంగ్రెసుని పంపించి తెలుగుదేశాన్ని నెత్తినెక్కించుకున్నాం. ఒకదాన్నిమించి మరొకటి సమస్యలు తెచ్చిపెడుతున్నాయి. సమస్యలు ఎవరో ఒకరొచ్చి పరిష్కరించరనీ, మనమే పరిష్కరించుకోవాలనీ జనం తెలుసుకునేవరకూ సమస్యలు తీరవు. సమస్యలకు తాము కాకుండా ఇంకేదో పరిష్కారం వుందని జనం నమ్మినంతకాలం పరిష్కారాలనుకున్నవే సమస్యలవుతాయి"

చిన్న కార్టూన్ సినిమాని విశ్లేషించి దేశరాజకీయాలకి అన్వయించి చెబుతున్న సూర్యంమీద కోపం తెచ్చుకోవటం, అతనితో మాట్లాడకుండా, ముభావంగా వుండటం రేణూకు చేతకాలేదు.

ఆ విషయం ప్రస్తావించకుండా, సూర్యాన్ని నొప్పించకుండా మామూలు స్నేహం కొనసాగించాలని రేణు అనుకుంది. తరువాత సినిమా స్పెయిన్ దేశపు నావికులు మొదటిసారిగా అమెరికా రావటం, అక్కడి జాతులను ఓడించి నాశనం చెయ్యటం - ఈ కథతో నడిచింది.

మరీ ఆసక్తిగా లేకపోయినా ఫొటోగ్రఫీ అద్భుతంగా వుంది. కొలంబస్ అమెరికాని కనుక్కోవటంతో అక్కడి రెడ్ఇండియన్ల సంస్కృతికీ, వాళ్ళ ఉనికికీ ఏర్పడిన ప్రమాదాన్ని గురించీ, తెల్లజాతులు ఆ ప్రజలమీద చేసిన అత్యాచారాల గురించీ సూర్యం రేణూకు చెప్పాడు.

'ఎన్నివిషయాలు– ఎన్నిఅనుభవాలు ఒక్కరోజులో' అనుకుంటూ నిద్రపోవటానికి ప్రయత్నించింది రేణు.




మర్నాడు క్లాసులో సందడిసందడిగా మాట్లాడుకుంటున్న విద్యార్థులంతా ఆకాష్, హేమంత్‌లు రావటంచూసి స్తంభించిపోయారు. హేమంత్ వీళ్ళ భయాన్ని గమనించినవాడిలా ఇదే ఆఖరి క్లాసనీ, ఆకాష్ ఈరోజే ఢిల్లీ వెళ్ళిపోతున్నాడనీ ఆయన పాఠం విని సందేహాలన్నీ తీర్చుకోవటానికి ఈ ఒక్కపూటే అవకాశం వుంటుందనీ చెప్పారు. హేమంత్‌మీది గౌరవంతో అందరూ నిశ్శబ్దంగా కూచున్నారు.

మళ్ళీ మొదలైంది ఆకాశపురాణం. అసలు విషయం వదిలి ఎటెటో వెళ్ళిపోతున్నాడు. హేమంత్, రమేష్, రజనీ, మాధవీ అందరూ ఎవరిస్థాయిల్లోవాళ్ళు ఆకాష్‌ని పాఠం దారికి మళ్ళించాలని చూశారుగానీ యజమానిమాట వినని మకురుఎడ్లని కట్టిన బండిలా ఆ పాఠం ఎటెటో ముళ్ళల్లోకి, తుప్పల్లోకి వెళ్ళింది.

"థాంక్ గాడ్... ఇవాళ అతను ఢిల్లీ వెళ్ళకుండా వుండి రేపు మళ్ళీ క్లాను తీసుకుంటానంటే నేనేం చేసేదాన్నో నాకే తెలియదు"

రజని మాటలకు అందరూ నవ్వారు.

ఆ తరువాతి క్లాను సంజయ్‌ది. అదే అతని ఆఖరు క్లాను. తరవాత అతనుకూడా బొంబాయి వెళ్ళిపోతాడు. అతను పెయింటింగ్స్ చూపిస్తూ, వాటిల్లో వాడిన రంగుల విశిష్టతను చెబుతూ, కొన్ని జపాన్, అమెరికన్ సినిమాల నుండి సన్నివేశాలను చూపించి వాటిలో రంగుల అంతరార్థాన్ని విశ్లేషిస్తూ అద్భుతంగా పాఠం చెబుతున్నాడు.

పక్కన కూచున్న మాధవి తన కుర్చీలో అశాంతిగా కదలటం గమనించింది రేణు.

పాఠంలోంచి ధ్యానను మరల్చి ఓరగా మాధవి వంక చూసింది. ఆమె పెదవులకు లిప్‌స్టిక్ రాసుకుంటోంది.

రేణు మనసు జాలితో నిండిపోయింది.

"నా బొట్టు సరిగా వుంది కదూ?" జుట్టు సరిచేసుకుంటూ అడిగింది.

'సరిగానే వుంది' అన్నదిగాని రేణుకు చిరాకేసింది. పాఠం వినకుండా సంజయ్‌కోసం క్లానుకొచ్చినట్లు ఇంత గొడవ పడటమేమిటి. మళ్ళీ పాఠం మీదకు ధ్యానను మళ్ళించింది.

క్లానయ్యాక భోజనంచేసి గదికి వెళ్ళింది. గమనతో మాట్లాడాలనుకుంది.

గమన రేణును చూస్తూనే పెద్దగా నవ్వుతూ—

"ఇవాళ సంజయ్ నన్ను బుట్టలో పడెయ్యాలని చూశాడు తెలుసా?" అంది.

"ఎలా... ఏంజరిగింది?" ఆశ్చర్యంగా అడిగింది రేణు.

"క్లానయ్యాక రజనీ, మాధవీ సంజయ్ టీ తాగుతున్నారు. నేనటు వెళ్తుంటే మాధవి పిల్చింది. సరేనని వెళ్తే సంజయ్ నా గురించి మాట్లాడటం మొదలుపెట్టాడు. నేను మితభాషినట. మౌనగీతంలా నిశ్శబ్ద సంగీతంలా వుంటానట. నా శరీరచ్ఛాయను అతనింతవరకూ ఎక్కడా చూడలేదట" గమన సంజయ్‌ని అనుకరిస్తూ చెప్పి పగలబడి నవ్వింది.

"ఐతే ఇక నువ్వుకూడా సినిమాలు మానేసి షికార్లు చేస్తావన్నమాట?" రేణుకూడా నవ్వింది.

"ఆ సంజయ్ మాటలకు మురిసిపోయి అతని వెనకాల పడేంత తెలివితక్కువదాన్నికాదు. నాకలాంటి షికార్లు ఇష్టం వుండవు" అంది గమన.

"ఐతే రజనీ, మాధవీ తెలివితక్కువవాళ్ళే నంటావా?"

"రజని తెలివినీ, మాధవి తెలివినీ రోజూ క్లానులో చూస్తూ వాళ్ళని తెలివితక్కువని ఎలా అంటాను? ఎంత కష్టమైన థీరీనైనా వాళ్ళు చాలా బాగా అర్థం చేసుకుని ఇంకా లోతుకు తీసుకెళ్ళే ప్రశ్నలు వేస్తుంటారు. వాళ్ళు నిజంగా మేధావులు. కానీ ఈ విషయంలో నా అభిప్రాయాలు, వాళ్ళ అభిప్రాయాలు వేరు" అంది గమన.

"మరి మాధవిని అర్థంచేసుకుంటానన్నావా?"

"అర్థంచేసుకోవటం వేరు, నేను మాధవిలా ప్రవర్తించటం వేరు. మాధవి జీవితం, అణిచిపెట్టబడిన ఆమె శక్తులూ - కోరికలూ, భర్త నిరాదరణ ఇవన్నీ ఆమెనొక ఆలోచనవైపు నెట్టాయి. దాన్ని అర్థంచేసుకోటానికి ప్రయత్నిస్తాను. కానీ నా పరిస్థితులు వేరు. నాకు ఏంకావాలో నాకిప్పుడు తెలుసు. నా ప్రేమకు అర్హుడైన వ్యక్తికోసం వెతుకుతాను. అంతవరకూ అతనికోసం వేచివుంటాను. అంతేకాని అందమైన అమ్మాయి కనిపించగానే వెంటబడే సంజయ్‌లాంటివాళ్ళను నా చిటికిన వేలు కూడా తాకనివ్వను" గమన స్థిరంగా అంది.

"అసలు మాధవికి సంజయ్‌మీద ఆకర్షణ కంటే ఆమె భర్తమీద ప్రతీకారం తీర్చుకోవాలనే కోరికే ఎక్కువనిపిస్తోంది" అంది రేణు ఆలోచనగా.

"ఇవాళ క్లాసులో పాఠం ఒక్క ముక్క వినలేదు. లిప్‌స్టిక్ దిద్దుకుంటూ, జుట్టు రేపుకుంటూ, పమిట సరిజేసుకుంటూ కంగారుగా కూచుంది"

"ఇవాళ సంజయ్ వెళ్ళిపోతాడుగా. పాపం మాధవి! రజనీ ఇవాళ రాత్రంతా సంజయ్‌తో గడుపుతానని చెప్పింది"

"నిజంగానా... వాళ్ళ స్నేహం అంత దూరం వెళ్ళిందా"

"ఇప్పుడేం– ఎప్పుడోవెళ్ళింది."

"రజనీకి పెళ్ళి కాలేదా?"

"అయింది... ఏడాది క్రితం విడాకులు తీసుకుందిట."

"ఎందుకు రజనీ ఇలా చేస్తోంది?" రేణు ముఖంలో చిరాకు.

"రజని కారణాలు రజని కుంటాయి... ఉన్నాయికూడా. నిన్న రజనీని అడిగాను - ఏదో పరిచయం, స్నేహం, సినిమాలూ, షికార్లు ఒకరకం. ఎందుకింత దూరం వెళుతున్నావని"

"ఏమన్నది?"

"సంజయ్ తనకు నచ్చాడట– అతని అందం, తెలివీ ఈమెను; ఈమె అందం, తెలివీ అతన్ని ఆకర్షించాయి. అతనికి పెళ్ళయిందని ఈమెకూ, ఈవిడ సంగతి అతనికీ తెలుసు. తమ ఈ స్నేహం నాలుగు రోజులవరకే అనికూడా తెలుసు. ఈ నాలుగురోజులు మాకు ఆనందం దొరుకుతుంటే వద్దనుకోవటం ఎందుకు? దీనివల్ల ఎవరికీ ఏ సమస్యలూ రావు. ఇదంతా చిన్న ఎఫైర్. కాస్త తమాషా తర్వాత ఎవరిదారి వాళ్ళది. ఎవరికీ నష్టం లేనివల్ల... అంటుంది నేనేం చెప్పగలను?"

"ఛీఛీ... ఏ ప్రేమాలేకుండా ఎవరితోబడితే వాళ్ళతో గడపటం ఎలా సాధ్యం. అనుకోకుండా తెలియని మగాడి శరీరం తగిలితేనే కంపరం పుడుతుందే! రజని ఇలా ఎలా వుండగలుగుతోంది" రేణు ముఖం చిట్లించింది.

"ఎవరితోబడితే వాళ్ళతో రజనికూడా తిరగదు. సంజయ్ అన్నివిధాలా ఆమెకు నచ్చాడు గనకనే అతనితో స్నేహంచేసింది. తెలియని మగాడు తగిలితే ఆమెకూ నీలాగే చిరాకు. ఆమె భావాలు– ఆలోచనలూ వేరు, మనవి వేరు. అంతమాత్రాన ఆమెని చీదరించుకోవటం ఎందుకు?"



గమన మాటలకు రేణు మాట్లాడకుండా కూచుంది. మధ్యాహ్నం హేమంత్ నియోరియలిస్టు సినిమాల గురించి పాఠం చెప్పారు. హేమంత్ క్లాసయ్యాక రేణుకు సూర్యం ఇంకో క్లాసు తీసుకుని రెండవ ప్రపంచయుద్ధం, దాని ప్రభావం సినిమా రంగంమీద ఎలా పడింద అదంతా మరికాస్త వివరంగా చెప్పాడు. ఆరోజు సాయంత్రం సినిమాకోసం అందరూ చాలా జుల్సింటీ ఎదురుచూస్తున్నారు. ప్రఖ్యాత స్టేజి ఆర్టిస్టు విజయ్ మెహతా దర్శకత్వంలో తీసిన 'రావ్ సాహెబ్' సినిమా అది. విజయ్ మెహతా కూడా ఆ సాయంత్రమే వచ్చేశారు. ఇన్‌స్టిట్యూట్‌వాళ్ళే కాకుండా పూనాలో సినిమారంగంతో సంబంధంవున్న కొందరు పెద్దలుకూడా సిని



మాకు రావటంతో థియేటర్ నిండిపోయి కొందరు నిల్చుని చూడాల్సివచ్చింది.

1920-30 సం॥ మధ్యకాలంలో జరిగిన కథ. ఆంగ్లేయుల భావాలతో ప్రభావితుడైన రావ్‌సాహెబ్ కథ. అతనొక ఆంగ్లో ఇండియన్ యువతిని పెళ్ళాడాలనుకుంటాడు. కుదరదు. అతని అన్న స్వదేశీ ఉద్యమంలో పనిచేస్తాడు. కథ జరిగేనాటికి పిచ్చివాడవుతాడు. వీళ్ళ కుటుంబంలో పిచ్చితనం వుంది. వీరి బంధువు ఒకామె వితంతువు - వీళ్ళద్దర్నీ చూస్తూ ఆ ఇంట్లో వుంటుంది. ఆ లాయరుదగ్గర పనిచేసే బాబూరావుకి కొత్తగా పెళ్ళవుతుంది. భార్య రాధక్కను తీసుకొచ్చి లాయర్‌కి పరిచయంచేస్తాడు. లాయర్‌కి ఆమెమీద ఇష్టంకలుగుతుంది. ఆమెంటే అభిమానంగా వుంటాడు. తన ఒంటరితనంతో బాధపడుతూ, వాళ్ళిద్దరి దాంపత్యంచూసి తనలో కలుగుతున్న కోరికలను అణుచుకుంటూ యాతనపడుతుంటాడు. ఆమెకు కొడుకు పుడతాడు. భర్త జబ్బుచేసి చచ్చిపోతాడు. మామ వచ్చి రాధక్కను వితంతువుగా చెయ్యాలనీ జుట్టు కత్తిరించాలనీ ప్రయత్నించి అనుకోకుండా అతనూ చనిపోతాడు. లాయరు ఆమెను జుట్టు పెంచుకోమనీ, మామూలుగానే తిండి తినమనీ, మళ్ళీ పెళ్ళిచేసుకోవచ్చనీ అది తప్పుకాదనీ చెబుతాడు. లాయరంటే ఆమెకి గౌరవం, యిష్టం. అతను చెప్పినట్లే చేసి అతని దగ్గర చదువు నేర్చుకుంటుంది. లాయర్ తనను పెళ్ళిచేసుకుంటాడని ఆశపడుతుంది. ఎన్నిరోజులు గడిచినా అతనా ప్రస్తావన తీసుకురాడు. పెద్దావిడ ఒకరోజు ఈమెను వివాహం సంగతి ప్రస్తావించమని చెబుతుంది. ఈమె లాయర్‌ని తనను పెళ్ళిచేసుకోమని అడుగుతుంది. లాయర్ అవీ ఇవీ చెప్పి తప్పించుకుంటాడు గానీ ఆమెలో నమ్మకాన్ని కలిగించలేకపోతాడు. ఆమె మర్నాడు ఉదయమే జుట్టుతీయించుకుని వితంతువులా మారిపోతుంది.

ఈ కథావస్తువుని విజయ్ మెహతా అద్భుతంగా చిత్రించింది. ఆ లాయర్ కోరికలు,

వాటిని అణుచుకునే విధమూ— వీటిని చాలా చక్కగా చిత్రీకరించింది.

ఆ లాయర్‌కి ఒకరోజు కంటికలక వస్తుంది. చనుబాలు పిండితే తగ్గుతాయని పెద్దావిడ రాధక్కనడిగి చనుబాలు చిన్న గిన్నెలో తెచ్చిస్తుంది. అతను ఆ గిన్నె పట్టుకుని చెప్పలేని ఆవేశంతో సతమతమై హఠాత్తుగా ఆ పాలు తాగేస్తాడు.

అలాగే రాధక్కకి లాయర్‌మీద ఇష్టం, గౌరవం కలిగే సన్నివేశాలను సహజంగా చిత్రీకరించింది.

ముగింపు అద్భుతం. చేతలలోకి రాని ఆదర్శాలూ, ఆచరణ లేని సంస్కరణ వాదాలూ కల్పించే భ్రమలనీ; వాటివల్ల కలిగే బాధనీ ఎంత సున్నితంగానో, ఎంత సటిల్‌గానో చూపించింది.

మర్నాడు ఉదయం విజయ్ మెహతాతో సమావేశానికి అందరూ ఎదురుతెన్నులు చూశారు.

మగవాళ్ళకు చాలామందికి ఆ సినిమా నచ్చలేదని సూర్యం చెబితే రేణు ఆశ్చర్యపోయింది.

మర్నాడు క్లాసులో ప్రశ్నల పరంపరలతో అందరూ సిద్ధంగా కూచున్నారు. ఎంత పెద్ద దర్శకులకైనా ఈ క్లాస్‌రూం ఒక గండంలాంటిదే. తాము తమ శక్తులన్నీ పెట్టితీసిన సినిమాని చీల్చిచెండాడటానికి సిద్ధంగా కూర్చున్న ఈ మేధావులంటే, విమర్శకులంటే భయపడటంలో అసహజంఏమీ లేదు.

విజయ్ మెహతా చిరునవ్వుతో వచ్చి కుర్చీలో కూచుంది. రేణూ, మంజరీ . గమనా పక్కపక్కనే కూచున్నారు.

"ఎంత బాగుందీవిడ— అందమనే కాదు. ఆమె నవ్వు, కళ్ళలో ఆత్మవిశ్వాసం, ఒకరకమైన హుందాతనం - చాలా ప్లెజెంట్‌గా ఆవిడని చూడటమే ఒక సంతోషప్రదమైన అనుభూతిలా అన్పిస్తూ— ఎంత బాగుందీవిడ" అనుకున్నారు.

ఆవిడ ప్రశ్నలకు చాలా చక్కగా నవ్వుతూ ఎంతో ఓపిగ్గా సమాధానం ఇచ్చింది. తన అభిప్రాయాలు చక్కగా చెప్పింది. మలయాళ మాంత్రికుడు లేచి—

"రావు సాహెబ్ చనుబాలు తాగిన దృశ్యం అసభ్యంగా, వల్గర్‌గా లేదా! మగవాడు ఆడదాని పాలు తాగుతాడా?" అంటూ కోపంగా ప్రశ్నించాడు.

విజయ్ మెహతా తియ్యగా నవ్వింది.

ఆ సీన్‌వల్ల అతని సెక్సువల్లీ రిప్రెస్‌డ్ కండిషన్‌ని లైంగిక అణచివేతను శక్తివంతంగా చూపించానని పించింది. అతనికి ఆమెమీద కోరికవుంది. దానిని అణిచివేసుకున్నాడు. ఆమె చనుబాలను చూడగానే అతని లోపల అణచబడ్డ కోరికలన్నీ బైటికొచ్చాయి. ఆ తీవ్రతకు తట్టుకోలేక అతను తాగేశాడు. అది అసభ్యంగా, వల్గర్‌గావుందా లేదా అనేది ఒక్కొక్కరి దృక్పథాన్నిబట్టీ ఆలోచనా ధోరణిని బట్టీ వుంటుంది కదా?

"నాకది వల్గర్‌గా అనిపించలేదు.

ఒక్కొక్క దర్శకుడు ఒక్కోరకంగా ఒక్కొక్క భావానికి రూపకల్పనచేస్తాడు. ఇదే రిప్రెస్‌డ్ కండిషన్‌నీ, అణిచివేతనీ తియ్యమంటే మరో దర్శకుడు అతను మాస్టర్ బేట్ చేసుకున్నట్లు తియ్యొచ్చు. అది మీకు మరింత వల్గర్‌గా కనిపించవచ్చు. నాకు అదికూడా సహజంగా తీశాడనే అనిపించవచ్చు. ఇట్ డిపెండ్స్"— అసలే హడలిపోతున్న వాళ్ళను మరింత హడలగొడుతూ తియ్యగా నవ్వింది. ఆవిడ నవ్వు సమ్మోహనాస్త్రమే అనిపించింది రేణుకి.

ఇంకొకతను లేచి—

"రావు సాహెబ్‌కి రాధమీద ప్రేమ, కోరికవున్నాయి. సరే... రాధ కెందుకుండాలి? భర్త వున్నప్పుడుకూడా రావుసాహెబ్ గురించి ఆసక్తి చూపుతుందెందుకు? రావ్‌సాహెబ్ జేబురుమాలు పడిపోతే దానినీ, దానినుంచి వస్తున్న సెంటు వాసననూ వదల్లేనట్టు ఎందుకు ఫీలవుతుంది? అది అసహజం కాదా? పెళ్ళయి భర్తతో కాపురంచేసుకుంటున్న స్త్రీ ఏదో ఒక లెవెల్లో పరపురుషుడంటే ఆసక్తి చూపినట్లు ఎందుకు చిత్రించారు?" అనడిగాడు.

ఆమె నవ్వుతూ సమాధానం ఇచ్చింది—

"స్త్రీ పురుషులు ఒకసారి మిగిలిన పరిస్థితుల, పరిసరాల ప్రభావం ఏమీలేకుండానే





కేవలం మానవ శరీరంలో జరిగే రసాయనిక చర్యలకారణంగానే ఆకర్షితులవటం జరుగుతుంది. కేవలం కెమిస్ట్రీ ఆఫ్‌ది హ్యూమన్ బాడీ అది. అది చూపించాను నేను. నిజంగా ఐలవ్‌దట్ కెమిస్ట్రీ'' అని చల్లగా మధురంగా నవ్వింది.

ఆమె ధైర్యానికి ఆమెకున్న స్పష్టతకీ, ఆమె ఒక విషయాన్ని నవ్వుతూ నవ్వుతూ వివరించే తీరుకీ క్లాసంతా ముగ్ధులైపోయారు. రేణు ఆమెను గాఢంగా ప్రేమించింది.

ఆమె క్లాసయ్యాక సూర్యంతో ఆ మాటే చెప్పింది. సూర్యం తానంతకన్నా ఎక్కువగానే ప్రేమిస్తున్నానని చెప్పాడు. ఆమె మాటల్ని మళ్ళీమళ్ళీ చెప్పుకున్నారు.

''ఆ కెమిస్ట్రీ గురించి ఆవిడ అంత చక్కగా, ధైర్యంగా చెప్పటం ఎంత బాగుంది. ఒక స్త్రీ ఆ విషయాన్ని అలాచెప్పాలంటే మనిషిగా ఎంతో ఎదిగివుండాలి. చాలా ఇన్‌హిబిషన్స్ పోగొట్టుకోవాలి. కొడవటిగంటి కుటుంబరావుగారు ''కురూపి'' నవలలో చాలాసార్లు చెబుతారు – ఈవిడ మాటలు వింటుంటే నాకు ఆ ''కురూపి'' గుర్తొచ్చింది''

''బహుశ రజనీ - సంజయ్‌ల విషయంకూడా అంతేనేమో?'' అంది రేణు.

''రజనీ - సంజయ్‌ల విషయం ఏమిటి?'' ఆశ్చర్యంగా అడిగాడు సూర్యం.

రేణు నాలుకకొరుక్కుంది. గమనతో మాట్లాడాల్సిన మాటలు సూర్యంతో మాట్లాడినందుకు నెత్తిమీద చేత్తోకొట్టుకుంది. ఆ తర్వాత మాట్లాడకుండా కూర్చున్న రేణును చూసి సూర్యం

''నటన బాగానే కుదిరిందిగానీ డైలాగ్స్ మర్చిపోయారు'' అన్నాడు సీరియస్‌గా.

రేణు నవ్వి వూరుకుంది.

''ఎంత అన్యాయం. నేను అన్ని సంగతులూ మీతో చెబుతాను. మీకేమో నాదగ్గర రహస్యాలున్నాయి''

''రహస్యంకాదు - అదేదో ఆడవాళ్ళ గొడవ పోనిద్దురూ'' తీసెయ్యబోయింది.

''మీకిష్టం లేకపోతే చెప్పొద్దుగాని – ఆడవాళ్ళ గొడవ, మగవాళ్ళ గొడవ అని రెండుంటాయన్నట్లు మాట్లాడి నాకు కోపంతెప్పించకండి''

''అబ్బ – ఏం లేదండీ... రజనీ సంజయ్‌ల మధ్య ఎఫైర్ జరుగుతోంది – దాన్ని గురించి అన్నాను. ఆ విషయం వినగానే నాకు రజనీ మీద కోపం వచ్చింది, చీదరనిపించింది. నేను చీదరించుకున్నట్లు మాట్లాడితే గమన విమర్శించింది. విజయ మెహతా మాటలు వింటుంటే వాళ్ళిద్దరిమధ్యా ఆకర్షణ కలిగిందేమో, ఆ కెమిస్ట్రీ ప్రభావమేమో అనిపించింది. అసలీగోలంతా నాకెందుకు? ఇంక అసలు ఆలోచించను'' తలవిదిలించుకుంది రేణు.

''ఆలోచిస్తే ఏమవుతుంది? ఆలోచనలకు భయపడటం దేనికి?''

''ఏమో – ఇలాంటి విషయాల గురించి ఆలోచించాలంటేనే భయంగా వుంటుంది'' అంది సీరసంగా.

''ఆ భయం వున్నంతకాలం ఈ విషయాల గురించి మీకు అజ్ఞానం, అస్పష్టత వుంటూనే వుంటుంది. ఆలోచించటానికే భయపడుతున్నారంటే సమాజం స్త్రీపురుషసంబంధాల విషయాన్ని ఎంత నిషేధవస్తువుగా వుంచిందో అర్థమవుతోంది'' రేణు కాసేపు మాట్లాడకుండా కూర్చుంది. ఇదివరకు తన సంకోచాన్ని వదిలి సందేహాలను తీర్చుకుందామని నిశ్చయించుకున్నట్లుగా అడిగింది --

''రజని ఈ నాలుగు రోజులకోసం సంజయ్ గురించి ఏమీతెలియకుండా సంబంధంపెట్టుకోవటం మంచిదేనా?''

''మంచి అంటే -- ఎవరికి మంచి?''

''అందరికీ - రజనికీ, మనకీ -- సమాజానికి'' వివరించింది రేణు.

''అంటే రజనీ చేసిన పని రజనీ ఒక్కదానికేగాక మనందరికీ, సమాజానికీ సంబంధించిన విషయం అంటున్నారా?''

''కాదా మరి? అందరూ రజనీలాగా వుంటే –?'' ఈ విషయం తెలియదా అన్నట్టు అడిగింది.

''ఉంటే – ?'' రెట్టించాడు సూర్యం.

''సమాజం ఏమవుతుంది? పతనమైపో

దూ?" ఈ విషయంలో సందేహమేమిటన్నట్టు అడిగింది.

"సమాజం సంగతలావుంచండి. రజనీ - సంజయ్‌ల సంబంధంవల్ల ఆమె చుట్టుపక్కలవున్న మనకేం నష్టమో ముందది చెప్పండి?"

"మనకేం నష్టం లేదు" ఆలోచనగా చెప్పింది.

"మరి ఇక్కడ జరిగిన ఒక సంఘటనవల్ల ఇక్కడున్న మనకే లేనినష్టం సమాజానికంతటికీ ఏముంటుంది?"

"సంజయ్ భార్యకిది తెలిస్తే ఆమె ఎంత బాధపడుతుంది" ఇక దీనికి తిరుగులేదన్నట్టు చెప్పింది రేణు.

"ఆమెకు అభ్యంతరం లేదనుకోండి-అప్పుడు?"

"బాగానే వుంటు. ఆమెకే లేనిబాధ మనకెందుకు?" పిసుక్కుంది.

"చూశారా - ముందు సమాజానికంతా సంబంధంవుందన్నారు. తర్వాత సంజయ్ భార్యకి బాధలేనపాతే మనకేం బాధ అన్నారు. అంటే ఇది సంజయ్ - రజనీల వ్యక్తిగత సమస్య అన్నమాట"

"కావచ్చు... ఇలా చాలామంది రజనీలూ - సంజయ్‌లూ తయారైతే సమాజానికి సమస్య అవుతుందా లేదా?" రేణు తనకు సరియైన పాయింటు ఇప్పుడు దొరికిందన్న ఉత్సాహంతో అడిగింది.

"సమాజంలో చాలామంది రజనీలూ - సంజయ్‌లూ ఎందుకు తయారవుతారనేది మనం ఆలోచించాలి... ఆలోచిద్దాం. ముందు సమాజంలో ప్రస్తుతం చాలామంది రజనీలూ - సంజయ్‌లూ లేరనుకుందాం. ఎందుకు లేరు? ఆలోచించి చెప్పండి -" విద్యార్థిని కఠినమైన ప్రశ్న అడిగి సంతోషించే గురువుగారిలా సూర్యం సంతోషంగా సిగరెట్ వెలిగించి తీరిగ్గా నవ్వాడు.

"ఎందుకు లేరంటే -- అవినీతిపనులు చెయ్యటం అందరికీ కష్టంవుంటుదు"

"అవినీతి అంటే ఏమిటి?" చిద్విలాసంగా అడుగుతున్న సూర్యాన్ని చూస్తుంటే రేణుకు ఒళ్ళుమండిపోయింది.

"అవినీతి అంటే - అవినీతి అంటే - చెడ్డపనులు చెయ్యటం" అంటూ తడబడుతున్న రేణునుచూసి నవ్వాడు సూర్యం.

"నీతి - అవినీతుల గురించి మంచి నిర్వచనం నేను చెప్పనా?"

"చెప్పండి"

"అది నా నిర్వచనం కాదు - కుటుంబరావుగారు చెప్పింది. మనిషి నుంచి మనిషికి సాధ్యమైనంత తక్కువ అపకారమూ, సాధ్యమైనంత ఎక్కువ ఉపకారమూ జరిగేలా చూసుకోవటమే నీతి - దాన్నిబట్టి అవినీతి అంటే ఏమిటో కూడా తెలుస్తుంది కదా -"

"అంటే ఎవరికీ అపకారం జరగకపోతే అది అవినీతి కాదా?" సూర్యం చెప్పిన విషయాన్ని నమ్మలేనట్టు అడిగింది.

"ఎలా అవుతుందో చెప్పండి?"

"అంటే రజనీ చేసిన పనిని మీరు సమర్థిస్తున్నారా?"

"సమర్థించను"

"మరి ఏం చేస్తారు... ఖండించనైతే ఖండించరుగా"

"మీకీబాష ఎక్కడనుంచీ వచ్చిందండీ -- అయినా సమర్థించటం, ఖండించటం ఈ రెండేనా మనం చెయ్యగలిగిన పనులు?"

"మరేం చెయ్యాలి... చెప్పండి... ఏం చెయ్యాలో" రేణుకు అసహనం పెరిగిపోతోంది.

"అర్థంచేసుకోవటానికి ప్రయత్నించాలి"

"అదే -- ఎలా అర్థంచేసుకోవాలో తెలియకే ఈ బాధంతా. మాధవిని అర్థంచేసుకోవచ్చుగానీ రజనీనెలా అర్థంచేసుకోవాలో తెలవకే బుర్రబద్దలు కొట్టుకుంటున్నా"

"బుర్రబద్దలు కొట్టుకుంటే ఏమీలాభంలేదు. బుర్రని ఉపయోగించి ఆలోచించండి. మీరు పరిణామవాదాన్ని ఒప్పుకుంటారా. జంతుదశనుంచి మానవుడు పరిణామం చెందాడని --"

ఒప్పుకుంటానన్నట్టు తలవూపింది.

"జంతువులు కలవటానికి వాటికి ప్రేమా, స్నేహం, అవగాహన అక్కర్లేదు. వాటికి అర్థం

# రెండులో ఒకటిని
# ఈ రోజే ఎన్నుకోండి



మా CAT 1000 సిరీస్. అవి కంప్యూటర్ సాంకేతిక సహకారంతో తయారుచేయబడినవి. ప్రతిసారి మీరు టి.వి. చూసే సమయంలో మీకు దీని విశేష ప్రయోగాలు తెలుస్తుంది. చక్కటి, సున్నితమైన, నిజజీవితంలోలా రంగుల దృశ్యం. జపనీస్ కంప్యూటర్ సహకార డిజైను, కంప్యూటర్ సహకార ఉత్పత్తి విధానం, పూర్తిగా కొరత నివేశించబడిన ఎల్‌టిటి, ఎస్ఎమ్‌పిఎస్, ఎమ్‌టిఎస్ఎఫ్‌బిటి, ఎలక్ట్రానిక్ ట్యూనర్, కలర్ పనిలు అన్నియు ప్రపంచ ఖ్యాతిగాంచినవారిచే ఉత్పత్తి చేయబడినవి వాడటం.

## ◄CAT 1000 SE

**అతి అందమైన హుందాగా అగుపించే రంగుల టి.వి.**



## CAT 1000 DX ►

**(రిమోట్ మోడల్)**

**డిజిటల్ సింతసైజర్ ట్యూనింగ్ మరియు 39 ప్రోగ్రాం జ్ఞాపకశక్తి**

వేరుగా అమర్చిన CAT 1000 DX చేతి స్విచ్ సెట్టుకు ప్రోగ్రాం, బ్యాండు, ఛానలు, శబ్దం, రంగుల విచక్షణ, పరిశుభ్రత, మీకు ఏది కావలిస్తే అది మీరు ఉన్న చోటునుంచే సరిచేసుకునేందుకు మైక్రో ప్రోసెసరు కంట్రోల్ కలదు.




# సాలిడైర్

Insight DE 780

జంతువులకు తెలియదు. తెలియనందుకు మనం వాటిని తప్పుపట్టలేం. మనిషి మనిషిగా పరిణామం చెందుతున్న క్రమంలో ప్రేమా, స్నేహం వీటి గురించి తెలుసుకున్నాడు. ఈ గుణాలని అభివృద్ధిచేసుకున్నాడు. వీటి గురించి జ్ఞానం సంపాదిస్తున్నాడు. మొదట కళ్ళకు కనబడే అందాన్నే ప్రేమించగలిగేవాడు. తర్వాత వాళ్ళలో గుణాన్ని ప్రేమించ గలిగాడు. ఇప్పుడు అందం, గుణం కాకుండా తన భావాలవంటి భావాలు వున్నవాళ్ళను ప్రేమించటం అభివృద్ధి అని తెలుసుకుంటున్నాడు''

''ఈ అభివృద్ధిని అర్థంచేసుకోలేని కొందరు ఇంకా జంతుదశలోనే వుంటారనుకో - ఏం చెయ్యాలి?''

''వాళ్ళకు ఉన్నతమైన ప్రేమ తెలియటంలేదని జాలిపడాలి. తెలుసుకునే అవకాశం ఉండీ తెలుసుకోనందుకు కోపం తెచ్చుకోవచ్చు. కానీ అది అవినీతి అనుకోవటం, పాపం అనుకోవటం, వాళ్ళను అసహ్యించుకోవటం - ఇదంతా నాన్సెన్స్ కదూ-''

రేణు సూర్యం మాటలని లోతుగా అర్థంచేసుకోటానికి ప్రయత్నిస్తున్నట్లు ఆలోచిస్తూ మౌనంగా వుంది. ''స్త్రీ పురుషుల మధ్య కలిగే ఆకర్షణబట్టి కెమిస్ట్రీ - నిజమే. కానీ ఆ కెమిస్ట్రీని అర్థంచేసుకుని, ఆ కెమిస్ట్రీతోనే తృప్తిపడకుండా దానిని మించి మానవులుగా మనం సాధించిన విలువలకోసం వెదకటం మంచిది.

అలా వెతకలేకపోతే అది అవినీతి అని అసహ్యించుకోవటం కాదు మనం చెయ్యాల్సింది.

ప్రేమ స్నేహాల విలువ మనుషులందరికీ అర్థం కావాలి. అది సులభం కాదు... చాలా కష్టం. వాటిని అర్థంచేసుకోవాలి - అర్థం చేయించాలి. ఆ విలువలు అర్థంకాకా, అర్థమైనా అవి దొరకకా మనుషులిలా ప్రవర్తిస్తుంటారు.

రజనికే నిజమైన ప్రేమ దొరికివుంటే ఇలా ప్రవర్తించేదికాదని నా కనిపిస్తోంది.

కనీసం ప్రేమ విలువ తెలిసినా ఆ ప్రేమ కోసం వెతికేది. ఆ రెండూ తెలియని అమ్మాయి తనకిష్టమైనట్లు తను వుంటోంది. దానివల్ల వచ్చే కష్టనష్టాలు ఆమే భరిస్తుంది.

నిజానికి సమాజంలో నూటికి తొంభైమంది ప్రేమ తెలియకుండానే దానికోసం ఆరాటపడకుండానే, వెతకకుండానే బతుకుతున్నారు. వాళ్ళలో కొందరు తమకే తెలియని అశాంతితో రజనీలా ప్రవర్తిస్తే అది మానవులందరి తప్పు అవుతుంది''

''మాధవి విషయంలో నాకు సమాజం తప్పు స్పష్టంగా తెలిసింది'' అంటూ రేణు మాధవి విషయం కూడా సూర్యంతో చెప్పింది.

''ఔను -- అన్నిరకాలుగా అణిచిపెట్టబడిన స్త్రీలు ఎలాగోలా ప్రతీకారం తీర్చుకోవాలని చూడటంలో తప్పేముంది. వాళ్ళనలా అణిచిపెట్టిన సమాజానిది తప్పు''

సూర్యం - రేణూ మాట్లాడుకుంటూనే థియేటర్‌కి వెళ్ళారు. 'జూలియట్ అండ్ జిమ్' అనే ఫ్రెంచ్ సినిమా.

వీళ్ళు మాట్లాడుకున్న విషయానికి దగ్గరగానే వుందా సినిమా. నిజమైన ప్రేమ ఏమిటో, తనకేం కావాలో తెలియని జూలియట్ ఇద్దరు స్నేహితుల్ని ప్రేమిస్తుంది. ముందు ఒకతన్ని పెళ్ళాడి కొడుకుని కంటుంది.

తర్వాత రెండవ అతనికి దగ్గరవుతుంది. మొదటి స్నేహితుడు బాధపడినా అభ్యంతర పెట్టడు.

కానీ ఇద్దరిలో 'ఏదో సంకోచం - కొన్నాళ్ళు దూరమవుతారు. తర్వాత ఆమె ప్రేమను అంగీకరించటానికి ఇతను ఇష్టపడడు. ఆమె అతన్ని కారులో ఎక్కించుకుని యాక్సిడెంట్ చేస్తుంది. ఇద్దరూ చచ్చిపోతారు-

ఆ అమ్మాయికి ఏం కావాలి? ఎవరిని ప్రేమించింది? ఎందుకు ప్రేమించింది?

పెళ్ళికాకముందు ఆ అమ్మాయికి బోలెడు శక్తివుంది. పరిగెత్తటం, దూకటం, ఈత- ఎన్నో వచ్చు. వీళ్ళిద్దరినీ ఆశ్చర్యంలో ముంచేసేది.

పెళ్ళయ్యాక ఒక భార్యగా ఇల్లు దిద్దుకోవటం, ఇంటికే పరిమితమవటం, పిల్లని పెంచటం - ఇవి ఆమెకు విసుగేశాయా?

ఇవికాక ఏం చెయ్యాలో తెలియక నలిగిపో




యిందా – తన అసంతృప్తికి కారణం తాను తన శక్తులను వుపయోగించి ఫలవంతమైన పనేదీ చెయ్యకపోవటమేనని గుర్తించలేకపోయిందా?

అలా గుర్తించలేక ప్రేమ, సెక్స్ వీటి గురించి ఆలోచించిందా?

వీటివల్ల మాత్రమే స్త్రీకి శాంతీ, తృప్తి దొరుకుతుందనే భ్రమలో అలా ప్రవర్తించిందా?

రేణు ఆలోచనల్లోనే గదికి వెళ్ళి పడుకుంది. గమన స్నానం ముగించి వచ్చింది.

“అర్ధరాత్రి స్నానమేమిటి?” అంది రేణు ఆవలిస్తూ.

“నా అలవాటది... లేకపోతే నిద్రపట్టదు...”

“రజనీ విషయం సూర్యంతో మాట్లాడాను” అంటూ తనకూ - సూర్యానికీ జరిగిన సంభాషణంతా చెప్పింది.

గమన శ్రద్ధగా వింది.

“అదంత సింపుల్ విషయం కూడాకాదు రేణూ - జనరల్‌గా సూర్యం చెప్పింది కరెక్టే. కానీ మానవస్వభావాలలో ఎంత వైవిధ్యం, సమాజంలో ఎన్ని వైరుధ్యాలు - ఏమైనా ప్రేమ సాయంతోనే స్త్రీపురుష సంబంధాలు మెరుగుపడతాయి. కొత్త సమస్యలొస్తే కొత్తపరిష్కారాలు దొరుకుతాయి”

ఇద్దరూ తమతమ ఆలోచనల్లో మునిగి ఎప్పటికో నిద్రపోయారు.

“అయిదు వారాలలో మూడు వారాలు కరిగిపోయాయి. ఇంకా రెండు వారాలు. మొదటి వారమంతా మిగిలిన నాలుగువారాలూ తొందరగా గడిస్తే బాగుండే అనిపించింది. ఇప్పుడేమో ఈ రెండు వారాలూ పూర్తయితే ఎలాగా అనిపిస్తోంది - నిజంగా పూనా జీవితం నా జీవితంలో అందమైన కల... నిజమైన కల”

సోమవారం ఉదయం మంచం మీద నుంచి లేస్తూనే కవిత్వం మొదలుపెట్టింది గమన.

రేణుకు ఒక్కసారి మెలకువ వచ్చినట్లనిపించింది. రెండు వారాల్లో తను హైద్రాబాదు వెళ్ళిపోతుంది.

ఈ పూనా జీవితం, గమన, మంజరీ, మాధవీ, వీళ్ళ స్నేహం, సినిమాలూ, సిద్ధాంతాలు, ఉపన్యాసాలు - ఏమీ వుండవు. సూర్యం స్నేహం వుండదు.

మళ్ళీ తన ఒంటరితనం. తన వుద్యోగం, ఆఫీసుకీ - ఇంటికీ మధ్య నిశ్శబ్ద ప్రయాణాలు, తల పగిలిపోయే ప్రశ్నలు... రవి జ్ఞాపకాలు... ఇవే మిగులుతాయి.

ఈ జ్ఞాపకాలు క్రమక్రమంగా మాసిపోతాయి.

రేణుకు ఎక్కడలేని నీరసం వచ్చేసింది.

క్లాసుకెళ్ళి సూర్యాన్ని చూస్తే ఇంకా దిగులనిపించింది.

“రెండువారాల్లో మన కోర్సు అయిపోతుంది”

అంది కొత్త సత్యమేదో చెబుతున్నట్టుగా.

“ఔను... నాకూ అదే దిగులుగా వుంది” అన్నాడు సూర్యం. అంతలో హేమంత్ - రమేష్‌లు ఇంకో కొత్తాయనతో వచ్చారు. హేమంత్ ఆయన్ని పరిచయం చేశారు.

“ఈయన ఆనంద్ - దర్శకుడు. పొలిటికల్ సినిమా గురించి మీకు రెండు క్లాసులు తీసుకుంటారు.”

ఆనంద్ చాలా సూటిగా ఏ మొహమాటాలూ, అడ్డదారులూ లేకుండా విషయంలోకి వచ్చాడు.

“రాజకీయాలు లేనిసినిమా, రాజకీయాలకు అతీతంగా వుండే సినిమా ఏదీలేదు. ప్రతి సినిమాలోనూ రాజకీయాలు వుంటాయి. అయితే రాజకీయాలను ప్రత్యక్షంగా చూపించే సినిమాలు విప్లవాలనూ, యుద్ధాలను, ప్రభుత్వ పతనాలనూ, ప్రజల తిరుగుబాట్లనూ యధాతథంగా చూపించే సినిమాలు కొన్ని వుంటాయి - వాటిని మీకు పరిచయం చేస్తాను” అని మొదలెట్టాడు.

రజనీకి ఆనంద్ ధోరణి నచ్చలేదు.

“రాజకీయాలను గురించి తీసిన సినిమాలను చూపించి వాటి గురించి చెప్తారు బాగానే వుంది. కానీ ప్రతి సినిమాలోనూ రాజకీయాలున్నాయంటే, రాజకీయాలకు అతీతంగా కళ వుండదంటే ఎలా కుదురుతుంది. కళ, దాని స్వభావం, దాని ప్రయోజనం వేరుకదా- రాజకీ

యాలకు కళను ఉపయోగించుకోవచ్చు కానీ కళే రాజకీయమంటే ఎట్లా" అంటూ చర్చ లేవదీసింది.

ఆనంద్ ఏమీ తొణక్కుండా సమాధానం చెప్పాడు.

"మనం పీల్చేగాలి, తాగేనీరూ, తినే తిండి వీటన్నిటిలోనూ ఇవాళ రాజకీయాలున్నాయి. అంటే రాజకీయాలకు అతీతంగా మనం వూపిరి తీసే అవకాశమే లేదు. ఏ కళకైనా మనం ఊపిరిపోయవలసిందేగదా- మన వూపిరితో జీవం పోసిన కళ మన రాజకీయాలకు అతీతంగా ఎలావుంటుంది. రాజకీయాలకు అతీతంగా కళ వుంటుంది అనుకోవటం నా దృష్టిలో పెద్ద రాజకీయం. ప్రజా వ్యతిరేక రాజకీయం"

రజనీకి, ఆనంద్‌కీ పెద్దవాదన జరిగింది. క్లాసులో కొందరు రజనీకి అనుకూలంగా, కొందరు ఆనంద్‌కి అనుకూలంగా మాట్లాడారు. చివరకు హేమంత్ జోక్యం చేసుకుని ఆ వాదన ఆపించి పాఠం మొదలుపెట్టించారు. ఆనంద్ నికారాగువా విప్లవాన్ని గురించిన సినిమా చూపించి రాజకీయాలను చిత్రించిన సినిమాగా దాని ప్రత్యేకతలేమిటో చెప్పాడు. తరువాతి క్లాసులో దక్షిణాఫ్రికా పోరాటాల గురించి తీసిన సినిమాలు చూపిస్తానని చెప్పాడు. అప్పటికే ఒకటిన్నర అయింది. లంచ్‌కి గంట మాత్రమే టైముంది.

డైనింగ్‌హాల్లో కూడా తీవ్రంగా చర్చలు జరిగాయి. సూర్యం, రేణూ ఇద్దరూ ఆనంద్‌తో ఏకీభవించటంతో మిగిలినవాళ్ళు మాటలు వింటూ భోజనం చేశారు.

మధ్యాహ్నం క్లాసు అడ్వర్‌టైజ్‌మెంట్ సినిమాల గురించి. సూర్యం కాసేపు ఆ సినిమాలు చూసి విసుగేసి బైటికి నడిచాడు.

సూర్యం బైటకి వెళ్ళటం చూసి రేణు కూడా బైటికి వచ్చేసింది.

"నాకూ మొదటినుంచీ విసుగ్గానే వుంది. కానీ వెళ్ళిపోదామంటే వెళ్ళి ఏం చెయ్యాలనేది ఒక సమస్య- మీరు వచ్చేస్తే కనీసం మీతో కబుర్లు చెప్పుకోవచ్చని వచ్చేశాను" అంది.




ఇద్దరూ కలిసి క్లాస్‌రూం కి కాస్త దూరంగా మెన్స్‌హాస్టల్‌కి దగ్గరగా వున్న స్విమ్మింగ్‌పూల్ దగ్గరకు వెళ్ళి ఆ గట్టుమీద కూచున్నారు.

పక్కనే దట్టంగా పెరిగిన చెట్లు- లోపలంతా అడవి. నిశ్శబ్దంగా వుంది ఆ ప్రదేశమంతా.

ఇద్దరూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళు మునిగిపోయారు.

రేణూకి తన ప్రేమని ఎలా తెలపాలి. తన ప్రేమని అంగీకరించేలా ఎలా చెయ్యాలి అని సూర్యం ఆలోచిస్తుంటే సూర్యం ఆ ప్రస్తావన తెస్తాడేమో ఎందుకిలా ఇతనితో కలిసి ఒక్కత్తినీ వచ్చానా అని రేణూ ఆలోచిస్తోంది- ఏదో పిట్ట అరుస్తూ వాళ్ళ తలల మీదుగా ఎగిరిపోయింది.

"ఏమన్నా మాట్లాడండి" అన్నాడు సూర్యం.

"ఏం మాట్లాడను" అంది రేణు తల వంచి నీళ్ళల్లోకి చూస్తూ.

"రవిగారి గురించి చెప్పండి"

రేణు ఆశ్చర్యంగా తలెత్తింది.






"అతన్ని గురించి తెలుసుకోవాలని వుంది. మీరతన్ని ఎంత ప్రేమిస్తున్నారో అర్థమయ్యాక అతను చాలా గొప్పవ్యక్తి అనిపిస్తోంది. అతని అభిరుచులూ, ఆసక్తులూ ఇవన్నీ చెప్పండి"

"ఎందుకిప్పుడవన్నీ - తల్చుకుని బాధపడటం తప్ప ఏంచెయ్యగలం" దిగులుగా అంది రేణు.

"తల్చుకుని బాధపడటం మాని సంతోషపడటం నేర్చుకోవాలి. ఆయన నుంచి నేర్చుకోవాల్సినవి నేర్చుకోవాలి. బాధపడుతూ కూచుంటే ప్రయోజనమేముంది- మీరు సంతోషంగా రవిగారి కబుర్లు చెబుతారని అడిగాను కానీ మిమ్మల్ని మళ్ళీ దిగుళ్ళలోకి నెట్టాలనికాదు"

రేణు కుడిచేతిని తన రెండు చేతులతోనూ పట్టుకున్నాడు.

రేణు మనసు అల్లకల్లోలంగా వుంది.

సూర్యం ఎంత మంచివాడు. ఎందుకిలా చేస్తున్నాడు. అతని ప్రేమను ఎలా అంగీకరించటం-

రవిని మర్చిపోయి ఇతన్ని ప్రేమించటమూ, రవిని గుర్తుతెచ్చుకుంటూ ఇతన్ని ప్రేమించటమూ రెండూ అసాధ్యంగానే అనిపిస్తున్నాయి.

సూర్యం నొచ్చుకోకుండా అతనికి తన అసమ్మతి తెలియజేయాలి.

తనమీద జాలితో, సానుభూతితో ఒక ఆవేశపు ఆదర్శాల ప్రేరణతో తనను ప్రేమిస్తున్నాడు.

ఈ పదిహేనురోజులూ గడిచి ఎవరి ఊళ్ళకు వాళ్ళు వెళ్ళితే క్రమంగా తనను మర్చిపోగలుగుతాడు.

జాలీ సానుభూతీ, ఆవేశం అన్నీ తగ్గి యథాస్థితికి వస్తాడు. వివేకంతో ఆలోచిస్తాడు. అప్పటివరకూ అతన్ని నొప్పించకుండా తప్పించుకోవాలి.

తనమీద అతనికి జాలి కలగటం సహజం. అతని సహృదయతకు చిహ్నం- దానికి అతని మీద కోపం తెచ్చుకోకూడదు. ఒక మంచి ఆదర్శం వుండటం తప్పుకాదు.

దానికోసం అతన్ని అపార్థంచేసుకోవటం, నిందించబూనుకోవటం అవివేకం.

నెమ్మదిగా అతని చేతిలోంచి తన చేతిని తీసుకుంటూండగా 'హలో- అని గమన పిలుపు వినబడితే వెనక్కుతిరిగింది.

"క్లాస్ బోరు కొడుతోంది - అలా వెళ్ళి వస్తాం" అంటూ అడవిలోపలికి మాయము య్యారు గమన, ఇంకో అబ్బాయి.

"అతనెవరూ- మన క్లాసా?" రేణు అడి గింది.

"కాదు... ఇక్కడ చదువు పూర్తయి డిప్లొమా ఫిల్మ్ చేస్తున్నాడు. కుమార్ అని మంచి మనిషి. అతని డిప్లొమా ఫిల్మ్ కూడా బాగుంది" అన్నాడు సూర్యం.

"ఐతే గమనకి పువ్వు ఇచ్చింది ఇతనే అయుంటాడు" అంది ఉత్సాహంగా.

"ఔను- ఇతనే"

"గమనకి మంచి ఫ్రెండు దొరికాడన్నమాట. అతను నిజంగా మంచివాడైతే గమనకు నచ్చితే ఆమె సమస్య పరిష్కారమైనట్లే- పూనా గమనకు మంచి సాయం చేసినట్లే" గమనకు ప్రేమ దొరుకుతుందంటే రేణుకు చాలా సంతో షంగాఅనిపించింది.

"పూనా నాకు కూడా సాయం చేసింది"

సూర్యం హుషారుగా అన్నాడు.

"ఏంసాయం?"

"మీపరిచయం, స్నేహం, ప్రేమ కూడా దొరుకుతుందని నా ఆశ. మీరు ఆలోచించు కునే చెప్పండి. నేను తొందరబడుతున్నాననో, ఒత్తిడి చేస్తున్నాననో అనుకోకండి. మీరు నా మాటలు ఆషామాషీగా తీసెయ్యకుండా ఆలో చించాలనే మళ్ళీ ఆ ప్రస్తావన తెచ్చాను. మళ్ళీ మీరు మీ నిర్ణయం తెలిపేంతవరకూ నేనా విషయం ఎత్తను. మీరుమాత్రం ఆవేశప డకుండా శాంతంగా బాధ్యతగా ఆలో చించండి" సూర్యం మాటలు వింటూ కూచుంది రేణు.

ఓ అరగంటలో గమనా, ఆమె స్నేహితుడూ వచ్చి వీళ్ళపక్కనే కూచున్నారు.

"గమనా... పాటపాడగూడదూ- నీ పాట వినాలని వుంది. రూంలో ఎన్నిసార్లు అడిగినా ఆ ఉమ కుదరనివ్వదు"

"పాడండి" అన్నాడు సూర్యం.

గమన ఎక్కువ బతిమాలించుకోకుండానే-

"బాబుల్ మోరా" అంటూ పాడింది.

మధ్యాహ్నం సాయంత్రంగా మారబోతున్న ఆ సమయంలో నిశ్శబ్దంగా తలలూగిస్తున్న చెట్లకింద- అలల చేతుల్ని అలవోకగా కదిలి స్తున్న నీళ్ళపక్క గమన పాడిన ఆ పాట ఆ నలుగురి మనస్సుల్లోను ఏదో దిగులు రేపింది.

ఎక్కడో పరాయిచోట ఒంటరిగా వున్న స్పృహ, ఏదో ఎక్కడినుంచో ఓ తోడు కావాలనే ఆర్తి తన ఆత్మీయులకోసం తపనా-

అన్నింటినీ పలికించిన గమన గొంతులోని మాధుర్యానికి వశులైపరవశులై పోయారు. పాట ఆగినా ఆ ప్రదేశాన్నీ వారి మనసుల్నీ కమ్మిన విషాదం అలాగే నిలబడిపోయినట్లూ, ఆ విషాదపు పొగమంచు చీల్చుకుని బైటికి రావటం కష్టమైనట్లూ అనిపించింది.

క్లాసు పూర్తయి బిలబిలలాడుతూ మెన్స్ హాస్టల్‌వైపు పిల్లలు రావటంతో అయిష్టంగా లేచి థియేటర్‌వైపు నడిచారు.

గొడార్డ్ పేరు ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌కి వచ్చిన మొదటిరోజునుంచీ వింటూనేవుంది రేణు.

ఇప్పటి మంచి సినిమాల గురించి చర్చించిన ప్రతిసారీ గొడార్డ్ పేరు ఎవరో ఒకరు చెప్పేవారు.

ఆ గొడార్డ్ సినిమా 'వీకెండ్' కోసం వారం మొదటి నుంచీ అందరూ ఎదురుచూస్తున్నా రు. సూర్యం అయితే గొడార్డ్ గొడార్డ్ అని ఒకటే జపం. బాబుల్‌మొరా విషాదంలోంచి గొడార్డ్ సినిమాలోని ఆధునికతలోకి రావటం కష్టమని పించింది.

"గొడార్డ్ మనల్ని సినిమాలో లీనం కానివ్వ డు. మాటిమాటికీ డిస్టర్బ్‌చేస్తాడు. ఒక విషయం చాలా శక్తివంతంగా చెప్పి మనం అయ్యో అని కళ్ళనీళ్ళు పెట్టుకునే సమ యంలో దాంతో బొత్తిగా సంబంధంలేని మహా అనవసరమనిపించే విషయానికి వెళ్తాడు. మనకొక్కొక్కసారి పిచ్చెక్కిపోతుంది. అసలీ పద్ధతి బ్రెక్ట్ అనే జర్మన్ నాటకరచయితా, కవీ




మొదలుపెట్టాడు. బ్రెక్ట్ ఏమంటాడంటే యదార్ధజీవితాన్ని – మీరు రోజూ చూస్తున్న జీవితాన్ని చూడటానికి మీరు నా నాటకాలకు రాకండి. మీరు నా నాటకాన్ని కేవలం నాటకాన్ని చూడటానికి రండి – నాటకంలో మీరు ఒకరై లీనం కావటంకాదు. నాటకాన్ని దూరం నుంచి చూసి ఆలోచించండి అంటాడు. బ్రెక్ట్ నాటకాలలో అలాంటి దశను సాధిస్తే గొడార్డ్ సినిమాలలో అలాంటి కొత్త పద్ధతులు మొదలెట్టాడు. ఒక సన్నివేశం వుందనుకోండి. ఆ సన్నివేశాన్ని ఎక్కడినుంచి చూస్తే మనకు హాయిగా, సుఖంగా వుంటుందో అక్కడినుంచి చస్తే చూపించడు. కెమేరాని రాంగ్‌ప్లేస్‌లో పెడతాడు. మనల్ని విసిగిస్తాడు. డిస్టర్బ్ చేస్తాడు – దాని ద్వారా ఆలోచింపచేస్తాడు.

సూర్యం ఉపన్యాసం ఇస్తున్నాననే స్పృహలేకుండా ఉపన్యాసం మొదలెట్టాడు. గొంతు కూడా పెరిగింది. ఎవరైనా వింటున్నారా అని అటూఇటూ చూసింది రేణు.

వెనకాల హేమంత్ నిలబడి సీరియస్‌గా వింటున్నారు.

సూర్యం భుజంమీద కొట్టి వెనకనిలబడ్డ హేమంత్‌ని చూపించింది. సూర్యం చటుక్కునలేచి నిలబడ్డాడు.

"చాలా బాగా చెబుతున్నారు చెప్పండి. మిమ్మల్ని డిస్టర్బ్ చేశానా?" అంటూ నవ్వారు.

"లేదు సార్ – నేనేమన్నా తప్పులు మాట్లాడానేమోనని భయం" అన్నాడు సూర్యం.

"తప్పులేమిటి – గొడార్డ్‌ని మీరు అర్థంచేసుకున్న తీరు వివరిస్తున్నారు. ఒకవేళ నేను దానితో ఏకీభవించకపోతే మీరు చెప్పింది తప్పయినట్లేనా? ఒక విషయాన్ని ఎన్నికోణాల నుంచో, ఎన్ని రకాలుగానో అర్థంచేసుకోవచ్చు. ఒక విషయానికి ఒక కోణమే వుంటుందనీ, అదే సరైందనీ, దానికి భిన్నంగా వున్నదంతా తప్పనీ అనుకోవాల్సిన అవసరంలేదు. ముఖ్యంగా కళలవిషయంలో అనేక రకాల ఆలోచనా ధోరణులు రావాలి"

హేమంత్ మాటలను సూర్యం బలపరిచాడు.

"గొడార్డ్‌ని మీరింత సీరియస్‌గా పట్టించుకున్నందుకే నాకు చాలా సంతోషంగా వుంది. మీరు మీ చర్చ సాగించండి" అంటూ హేమంత్ ముందుకి వెళ్లాడు.

"హేమంత్ ఎంతమంచి టీచరో అంత మంచి ప్రజాతంత్రవాది కూడా" అన్నాడు సూర్యం.

"ఏం వాదీ?" అంది రేణు ఆశ్చర్యంగా.

"ప్రజాతంత్రవాది" అన్నాడు సూర్యం రేణుకు వినపడలేదేమోనని.

"అంటే –"

"బాగుంది – మీకు తెలుగు కూడా రాదా – డెమోక్రాట్ అన్నమాట. వ్యతిరేక అభిప్రాయాన్ని కూడా గౌరవించేవాడు. ఎదుటివాళ్లమీద బలవంతంగా తన అభిప్రాయాన్ని రుద్దనివాడు. తనకు నచ్చని ఆలోచనలను నిషేధించనివాడు అర్థమైందా?" కోపం నటిస్తూ అడిగాడు.

"నేను ప్రజాస్వామ్యం, ప్రజాతంత్రం ఇవన్ని రాజకీయాలకు సంబంధించినవి అనుకునేదాన్ని. మామూలు జీవితం కూడా ప్రజాస్వామిక పద్ధతుల్లో వుండొచ్చనీ, వుండాలనీ నేనెప్పుడూ ఆలోచించలా" అంది రేణు.

ఇంతలో సినిమా మొదలుపెట్టారు. పారిస్‌లో ఒక ఆదివారం గురించి కథ. నగరాల్లో నాగరికత పెరిగి మనుషులు యాంత్రికంగా తయారవటం, యంత్రాలవల్ల వచ్చే చిక్కులూ, మనుషులమధ్య పెరిగిపోయే దూరం, చివరకు మనుషులు ఈ అతినాగరికతనుండి మహాఅనాగరిక స్థితికి, నరమాంసాన్ని తినేస్థితికి ఎలా వెళ్తారోచెప్పే సినిమా. సినిమాలో కథలేదు. కంటిన్యూటీలేదు. మధ్యమధ్యలో సినిమాకు సంబంధంలేని ఉపన్యాసాలు, వియత్నాం గురించీ, దక్షిణాఫ్రికా గురించీ, మావో సాంస్కృతిక విప్లవం గురించీ ఇస్తుంటారు.

లిఫ్ట్‌కోసం ఒక కారుని ఆపుతారు ఇద్దరు దంపతులు. కారాపిన వ్యక్తి–

"మీరు డెమోక్రసీ సిద్ధాంతాలు సమర్థిస్తారా – నియంతృత్వ విధానాన్ని సమర్థిస్తారా?" అనే సైపు ప్రశ్న అడుగుతాడు.

"నియంతృత్వ విధానాలను సమర్థిస్తానంటాడు" లిఫ్టు అడిగిన వ్యక్తి. అతను

'అలాగైతే నీకు లిఫ్ట్ ఇవ్వనని'' వెళ్ళిపోతాడు. సూర్యం సినిమా అయిపోయిన తర్వాత కూడా అదే తల్చుకుని నవ్వుతున్నాడు.

''ఎందుకలా నవ్వుతున్నారు - నాకా జోక్ ఏమిటో పూర్తిగా అర్థంకాలేదు'' అంది రేణు.

''కాపాడిన అతనికి డెమోక్రటిక్ సిద్ధాంతాలంటే నమ్మకం. ఎక్కాలనుకున్న వ్యక్తికి అంత నమ్మకంలేదు. డెమోక్రసీమీద నమ్మకంవున్నవాడెవడూ అవతలవ్యక్తి నమ్మకాలను బట్టే అతనికి సహాయం చెయ్యడు. అవతలి వ్యక్తి నిజంగా నిస్సహాయస్థితిలో వుంటే అతనికి సహాయం చెయ్యటం వల్ల సమాజానికి నష్టంలేకపోతే అతని నమ్మకాలూ, తన నమ్మకాలూ వేరైనా సహాయం చేస్తాడు. ఇవాళవున్న ప్రాబ్లమ్ అదే — డెమోక్రసీ కోసం పోరాడుతున్న వాళ్ళే ఆ సిద్ధాంతాలకు వ్యతిరేకంగా ఆచరిస్తున్నారు. డెమోక్రసీ కోసం ప్రభుత్వంతో పోట్లాడే క్రమంలో వాళ్ళుకూడా ప్రభుత్వ అణిచివేత పద్ధతుల్ని నేర్చుకుంటున్నారు. సాత్రే అన్నట్టు శత్రువుతో పోట్లాడీ పోట్లాడీ మనకు శత్రువు స్వభావం అలవాటైపోతోంది''

సూర్యం మాటలు రేణుకు పూర్తిగా అర్థంకాలేదు. అలా మాట్లాడుకుంటూ ఇద్దరూ కర్వేరోడ్డు దాకా పోయి నయిన హోటల్లో టీ తాగివచ్చారు.

భోజనం చేసేసరికి మళ్ళీ సినిమా టైమయింది. రేణుకు విపరీతమైన అలసట అనిపించింది. ఈ రొటీన్ మీద మొదటిసారి బాగా విసుగొచ్చింది. ఏ అనుభూతికీ పరిపూర్ణత లేకుండా, దేని గురించీ స్థిమితంగా ఆలోచించుకునే సమయం ఇవ్వకుండా తరుముకెళుతున్నట్టు ఒకదాని వెంట మరొకటి ఇన్ని విషయాలు బుర్రలో కుక్కేస్తే ఎలా- శరీరానికన్నా విశ్రాంతి లేదు. ఉదయం తొమ్మిదినుంచీ రాత్రి ఒంటిగంటవరకూ చదువుతప్ప మరోటి లేకపోతే ఎలా?

సూర్యంతో ఈ మాటే అంటే-

''ఈ ఐదువారాల్లో వాళ్ళు మనల్ని ఒక్కసారి ప్రపంచమంతా గిర్రున తిప్పి చూపిస్తారు. మనం ఆ కాస్త పరిజ్ఞానంతో తర్వాత ఒక్కొక్క విషయమే నేర్చుకోవాలి. ఐదు వారాల్లో ఇన్ని విషయాలు చెబుతున్నందుకు సంతోషించాలి. నిద్రేముంది- ఇంటికెళ్ళాక చేసేదేముంది? మన టీచర్స్ మనకంటే ఎక్కువ కష్టపడుతున్నారు. ఒంటిగంటదాకా మేల్కొని మళ్లీ క్లాస్‌కి ప్రిపేర్ అయి వస్తున్నారు. హేమంత్‌గారు ఒకరోజు ఎంత అలసటగా కనిపిస్తున్నారో చూడటం లేదూ?''

నిజమేనని ఒప్పుకోక తప్పలేదు రేణుకి.

''ఇంకోవారంలో మనిష్టమొచ్చినంతసేపు నిద్రపోవచ్చు... ఓపిక పట్టండి'' అన్నాడు సూర్యం.

వారంలో పూనా వదిలివెళ్లాలని గుర్తొచ్చి భయమేసింది రేణుకి.

థియేటర్ ఎదురుగా వున్న సిమెంట్ బెంచీ మీద కూర్చున్నారు ఇద్దరూ.

ఆ రాత్రి చూడబోయే సినిమా కురసోవా అనే జపాన్ దర్శకుడు తీసిన 'రేష్‌మోన్' సినిమా. ఆ సినిమాలో ఒక హత్యజరుగుతుంది. ఒక వీరుడు భార్యతో కలిసి అరణ్యమార్గం గుండా ప్రయాణం చేస్తుంటాడు. అతనికి ఒక బందిపోటు దొంగ ఎదురవుతాడు. ఆ భర్తను కట్టేసి ఆ భార్యను రేప్‌చేస్తాడు. తర్వాత ఆ వీరుడు చచ్చిపడివుంటాడు. అతను ఎలా చచ్చిపోయాడన్నది ప్రశ్న-

సినిమా అసలు ఈ కథతో ప్రారంభంకాదు.

రేష్‌మోన్ గేటు దగ్గర ఒక పూజారి, ఒక కట్టెలు కొట్టుకునే అతను, ఒక బాటసారీ మాట్లాడుకుంటారు. మానవుల ప్రవర్తన గురించీ, మనుషులను ఎలా అర్థంచేసుకోవాలి ఎలా విశ్వసించాలి అన్న విషయం గురించీ మాట్లాడుకుంటారు.

కట్టెలు కొట్టుకునేవాడు అరణ్యంలో తాను చూసిన దృశ్యాన్ని గురించీ, శవంగురించీ చెబుతాడు. పూజారి కూడా ఆ విషయం న్యాయస్థానంలో విచారణ జరుగుతుందని చెప్పి, వీరుడూ అతని భార్యా షికారుకు వెళ్లటం గురించి తనకు తెలిసింది తాను చెబుతాడు. న్యాయస్థానపు సీను మొదలవుతుంది. ముందు దొంగ తాను చేసిన నేరం గురించి మాట్లాడతాడు. దొంగ చెప్పినదేమిటంటే-

ఆ స్త్రీని చూడగానే అతనికి కోరిక కలిగింది. ఆ భర్తను చంపకుండానే తన కోరిక తీర్చుకోవా




ప్రపంచములో ఒంగోలు జాతి ఎద్దుకు పెట్టింది పేరు



నాగార్జునసిమెంటు లా ఆ జాతే వేరు

MAM 111

లని, అతన్ని కట్టేస్తాడు. తర్వాత ఆ స్త్రీ భర్త గురించి పడే ఆందోళన చూసి అతనికి అసూయకలిగి ఆ భర్తని అవమానిస్తాడు. దాంతో ఆమె తిరగబడి పోట్లాడుతుంది. దొంగ ఆమెను ఓడిస్తాడు. కానీ ఆమె ధైర్యానికి మెచ్చుకుని దగ్గరగా తీసుకుని ముద్దుపెట్టుకుంటాడు. దాంతో ఆమెకు కూడా కోరిక కలిగి అతనికి సహకరిస్తుంది. దాంతో ఆ భర్తను చంపకుండానే అతని కోరిక తీరుతుంది.

వెంటనే అతను వెళ్ళిపోబోతాడు. ఆ స్త్రీ అతన్ని ఆపి మీ ఇద్దరిలో ఎవరో ఒకరు చావాలి. మీ ఇద్దరికీ నాకు జరిగిన అవమానం తెలుసు. అది నేను భరించలేను. మీలో ఎవరు ఇంకొకరిని చంపగలిగితే నేనతనికి చెందుతాను అంటుంది.

ఇద్దరూ ఒప్పుకుంటారు. దొంగ వీరుడి కట్లు విప్పి కత్తి అందిస్తాడు.

ఇద్దరూ చేసుకునే యుద్ధంలో దొంగ వీరుణ్ని చంపేస్తాడు. ఇదంతా కోర్టులో చెబుతూ ఆ దొంగ 23 సార్లు తనతో కత్తిని కలిపిన వీరుణ్ని మెచ్చుకుంటాడు. ఆ స్త్రీ అంటే తనకు పెద్ద ఆసక్తిలేదని ఆమె స్వభావం మాత్రమే తనకు ఆసక్తి కలిగించిందనీ అందుకే వీరుడిని చంపినా ఆమెను ఒదిలేసి వచ్చాననీ చెబుతాడు. తాను దొంగిలించిన వస్తువులన్నీ ఇచ్చేస్తాడు.

మళ్ళీ రేష్‌మోన్ గేటుదగ్గరకు వస్తాం. కట్టెలు కొట్టేవాడు ఆ దొంగ చెప్పిందీ ఆవిడ చెప్పిందీ అంతా అబద్ధమేనంటాడు. పూజారి ఆ స్త్రీని చూస్తుంటే చాలా జాలేస్తుందంటాడు. దాంతో ఆస్త్రీ న్యాయస్థానంలో చెప్పిన కథ మొదలవుతుంది. ఆ స్త్రీ దొంగ భర్తను కట్టేసి తనను రేప్‌చేశాడని. తర్వాత తన భర్త దగ్గరకు వెళితే అతను చాలా ద్వేషంతో చూశాడని, తాను అతని కట్లు కత్తితోకోసి అలా ద్వేషంగా చూడవద్దని ప్రార్థించాననీ చెబుతుంది.

ఆ భర్త ఈవిడ ప్రార్థనలు వినలేదు. ఈవిడ చేతిలో కత్తితో భర్తకు దగ్గరగా అడుగులేస్తూ వస్తుంది. తర్వాత ఆవిడకు స్పృహపోతుంది. స్పృహవచ్చేసరికి ఆ కత్తి అతని గుండెల్లో దిగబడివుంటుంది. ఆ తర్వాత ఆమె ఆత్మహత్యచేసుకోబోతూ పట్టుబడింది.

ఈమె ఈ కథ చెప్పాక మళ్ళీ గేటు దగ్గర సంభాషణ మొదలవుతుంది. బాటసారి "ఆడవాళ్ళు ఏడుపుతో మన హృదయాలు కరిగించి తప్పుదోవ పట్టిస్తారు. వాళ్ళని వాళ్ళు ఫూల్స్ చేసుకుంటారు" అంటాడు.

కట్టెలు కొట్టేవాడు చచ్చిపోయిన వీరుడు చెప్పింది కూడా అబద్ధమేనంటాడు.

చచ్చిపోయినవాళ్ళు అబద్ధం చెప్పలేరంటాడు పూజారి. బాటసారి "ఆఁ... అబద్ధాలు చెప్పని వాళ్ళెవరు ఈరోజుల్లో- అందరూ అబద్ధాలకోర్లే" అంటాడు.

చచ్చిపోయిన వీరుడి ఆత్మను రప్పిస్తే అతను తన కథ చెబుతాడు.

దొంగ రేప్ చేసిన తర్వాత తన భార్య అతనివైపు చాలా ప్రేమగా చూసిందనీ, అంత ప్రేమగా తమ వివాహజీవితంలో ఎప్పుడూ తనవైపు చూడలేదనీ చెబుతాడు.

తన భార్య ఆ దొంగతో వెళ్ళటానికి సిద్ధమై తనని చంపెయ్యమనీ, అతను బతికున్నంత వరకూ తాను దొంగతో రాలేననీ చెప్పింది. ఈ మాటలకు దొంగ కూడా ఆశ్చర్యపోయాడు. అతనికి వీరుడి మీద సానుభూతి కలిగింది. వీరుడి భార్యను కిందపడేసి "ఈమెను ఏం చెయ్యమంటావు - చంపనా ఒద్దా" అని వీరుణ్ని అడుగుతాడు.

ఈ మాటలకు వీరుడు దొంగని క్షమిస్తాడు.

అతని భార్య పరిగెత్తి పారిపోతుంది. దొంగ వెంటబడినా దొరకదు. వీరుడినే వెతుక్కోమని చెప్పి వెళ్లిపోతాడు. వీరుడు కొంతసేపు దుఃఖించి కత్తితో పొడుచుకుని చచ్చిపోతాడు. ఆ కత్తి అప్పటిదాకా భార్య చేతిలో వున్నదే- వీరుడి ఆత్మ చెప్పిన కథ తర్వాత మళ్ళీ గేటు దగ్గర వ్యక్తుల సంభాషణ మొదలవుతుంది.

"ఆ వీరుడు చచ్చిపోయింది ఆమె చేతిలో వున్న కత్తి వల్లకాదు ఇంకో కత్తివల్ల" అంటాడు కట్టెలుకొట్టేవాడు.

"నువ్వంతా చూశావు గదా- నిజం ఎందుకు చెప్పవూ?" అంటాడు బాటసారి.

"నేను లేనిపోని చిక్కుల్లోపడతానుగదా" అంటాడు కట్టెలుకొట్టేవాడు.

"వాళ్ళకు చెప్పకపోతే చెప్పకపోయావు. జరి




గిందేమిటో మాకన్నా చెప్పు'' అని బలవంతంచేస్తాడు బాటసారి. కట్టెలు కొట్టేవాడు చెబుతాడు.

''దొంగ ఆ స్త్రీని రేప్‌చేసిన తర్వాత ఆవిడతో తాను జీవితాంతం ఆమెతో వుంటాననీ, తన పద్ధతులన్నీ మార్చుకుంటాననీ దానికి ఒప్పుకోకపోతే ఆమెను వెంటనే చంపేస్తాననీ చెబుతాడు.

''ఆమె— ఆ విషయం నిర్ణయించాల్సిందీ తేల్చుకోవాల్సిందీ మగవాళ్ళేనని తాను కాదనీ సమాధానం చెబుతుంది.

''దొంగ వీరుడితో యుద్ధానికి సిద్ధమై అతని కట్లు విప్పుతాడు. కానీ వీరుడు ఆ పతనమైపోయిన స్త్రీకోసం తన జీవితాన్ని పణంగా పెట్టదల్చుకోలేదని— ఈ దరిద్రురాలికంటే తాను తన గుర్రానికి ఎక్కువ విలువిస్తాననీ అంటాడు.

''ఆ స్త్రీ ఆ మాటలకు నిర్విణ్ణురాలవుతుంది.

''దొంగకికూడా ఇప్పుడామె మీద ఆసక్తిపోయింది. ఆమెను వదిలిపెట్టి వెళ్ళటానికి సిద్ధమవుతాడు. ఆమె ఏడుస్తుంది. వీరుడు ''ఏడవకు. నీదొంగ ఏడుపులకు ఎవరూ లొంగరు'' అని కసురుతాడు.

దొంగ ''పాపం ఆడవాళ్ళు ఏం చెయ్యలేక ఏడుస్తారు - ఏడవనీ'' అని వెక్కిరింతతోకూడిన జాలి ప్రదర్శిస్తాడు. అప్పుడామె నవ్వుతుంది. ఇద్దరినీ చూస్తుంది.

భర్తతో ''నువ్వు మగాడివైతే నీ భార్యను అవమానించినవాడిని చంపకుండా ఒదులుతావా?'' అంటుంది. దొంగతో ''నువ్వూ మగాడివి కాదు. మగాడివైతే నా భర్తనోడించి నన్ను నీదాన్ని చేసుకునేవాడివి'' అంటుంది.

ఈ మాటలతో క్షణంక్రితం తమకు అక్కర్లేదనుకున్న స్త్రీకోసం ఇద్దరూ యుద్ధం మొదలెడతారు. దొంగ యుద్ధంలో గెలిచి వీరుడిని చంపేస్తాడు. దొంగ ఆ స్త్రీని రమ్మంటే ఆమె రాదు. దొంగ ఆమెను చంపబోతే పరిగెత్తి పారిపోతుంది''

కట్టెలు కొట్టేవాడు ఈ కథ చెప్పిన తర్వాత బాటసారి అంటాడు - ''ఈ కథల్లో ఒక్కదానికి కూడా అర్థంలేదు. నేను ఏ కథా నమ్మను'' అని.

అంతలో చిన్నపిల్లవాడి ఏడుపు వినిపిస్తుంది. బాటసారి ఆ పిల్లవాడిని చూసి వాడి బట్టలు తీసుకుని వెళ్ళబోతాడు. అడ్డగించిన వాళ్ళకు స్వార్థంలేకుండా ఎవరూ వుండడు - అని సమాధానం చెబుతాడు.

కట్టెలు కొట్టేవాడు ఆ పిల్లాడిని పెంచుకుంటానని చెబుతాడు.

పూజారి ''ఇపుడు నాకు మానవత్వం మీద నమ్మకం కలుగుతోంది'' అంటాడు.

సినిమా పూర్తయింది.

అందరూ ఆశ్చర్యంతో, చెప్పలేని అనుభూతితో బైటికివచ్చారు. ఎవరు చెప్పింది నిజం?

దొంగ చెప్పిందా? స్త్రీ చెప్పిందా? వీరుడు చెప్పిందా? కట్టెలుకొట్టేవాడు చెప్పిందా?

జరిగిన ఒక విషయాన్ని నలుగురూ నాలుగురకాలుగా ఎందుకు చెప్పారు?

అట్లా చెప్పటంవల్ల వాళ్ళకొచ్చేదేమిటి? వాళ్ళ మనసుల్లోని ఆలోచనలేమిటి? మనుములు ఒక విషయాన్ని తమకనుకూలంగా ఎలా మలుచుకుంటారు! కొన్నాళ్ళకు తాము కల్పించుకున్న అబద్ధాన్నే నిజమని తామే నమ్మే స్థితికి ఎలావస్తారు?

ఏది నిజం... ఏది అబద్ధం?

ఈ నిజానిజాల అన్వేషణవల్ల సాధించేదేమిటి? ఈ ప్రశ్నలతో అందరి తలలూ తిరిగిపోయాయి.

''ఏది సత్యం... ఏది అసత్యం

ఓ మహాత్మా ఓ మహర్షీ''

అన్నాడు సూర్యం.

''ఎంత గొప్పగా తీశాడు కురసావా. ఎంత కొత్తపద్ధతి, ఎంత కొత్త ఆలోచన! అసలు ఒక విషయాన్ని ఇలా నాలుగుకోణాలనుంచి చెప్పవచ్చని తట్టదే ఎవరికీ—'' రేణుకి కురసావా మీద అపరిమితమైన భక్తిప్రపత్తులు కలిగాయి.

''ఒకే... గుడ్‌నైట్'' అంటూ రేణు భుజంమీద చిన్నగాకొట్టి— అలా ఆమెను తాకకుండా వుండలేనందుకు తనను తాను తిట్టుకుంటూ తన గదివైపు నడిచాడు సూర్యం.



గమనా రేణూ చాలాసేపు సినిమా గురించి మాట్లాడుకున్నారు.




"ఇవాళ మళ్ళీ పవర్ లేదు... బహుశా క్లాసు జరగదు... హడావుడి పడకు"

తొమ్మిదింటికి లేచి కంగారుపడుతున్న రేణుతో గమన చెప్పింది.

రేణు తాపీగా స్నానంచేసి వచ్చినా పవర్ రాలేదు.

"మళ్ళీ కాసేపు పడుకుంటాను" అని మంచంమీద వాలింది.

ఉమ లైబ్రరీకి వెళ్తానంటూ వెళ్ళింది. గమనకూడా తన మంచంమీద కూచుని చాలాసేపు ఆలోచించి రేణును చూస్తూ అన్నది--

"నేనొక విషయం మాట్లాడతాను. ఏమీ అనుకోవుగా"?

రేణు ఆశ్చర్యంతో కళ్ళు విప్పింది.

"ఏ విషయం - ఏమనుకుంటాను?"

"సూర్యంతో నీ స్నేహం గురించి. అది వొట్టి స్నేహమేనా? నాకలా అన్పించటంలేదు. ముఖ్యంగా సూర్యం వైపునుంచే నాకా సందేహం కలిగింది. అతని కళ్ళెప్పుడూ నీతో ఏదో చెబుతున్నట్టే వుంటాయి—"

రేణు ముఖం పాలిపోయింది. మాట్లాడకుండా తిరగని ఫాన్ వంక చూస్తూ పడుకుంది.

"నాకు నీ విషయంలో కాస్త సందేహమైనా ఎందుకొచ్చిందంటే— వచ్చిన మొదటిరోజుల్లో రవిగురించి చెప్పేదానివి, రవి ఉత్తరాల కోసం ఎదురుచూసేదానివి, రాకపోయినా వచ్చినా ఏడ్చేదానివి - క్రమంగా అదంతా తగ్గింది. ఉత్తరాలూ రావటంలేదు. నువ్వూ ఎదురుచూడటం లేదు. ఏం జరిగింది? ఏదో జరిగిందనిపిస్తోంది—" ఆలోచనగా అంది గమన.

"ఏం జరిగివుంటుందనుకుంటున్నావు?" రేణు అడిగింది.

"రవికీ - నీకూ మధ్య ఏవో గొడవలొచ్చాయనీ, అందుకే నువ్వతనికి దూరంగా వచ్చావనీ అనిపిస్తోంది. అతని ఉత్తరాలవల్ల మీమధ్య బంధం తెగిందని నీకు స్పష్టమయిందేమో - అందువల్లే నువ్వూ అతనికి రాయకుండా వున్నావనిపించింది... అందుకే సూర్యానికి దగ్గరవుతున్నావనిపించింది— అరే— రేణూ— ఎందుకలా? నేను బాధపెట్టానా? ఇందులో బాధపడటానికేముంది? భార్యాభర్తల మధ్య గొడవలు రాక ఎవరికొస్తాయి? అలాంటప్పుడు ధైర్యంగావుండాలిగానీ - అసలు మీమధ్య గొడవలెందుకొచ్చాయి—"

ఏడుస్తున్న రేణును ఓదారుస్తోంది గమన.

"మామధ్య గొడవలు రాలేదు" వెక్కిళ్ళ మధ్యలోంచి అతికష్టంమీద చెప్పింది.

"రాకపోతే మంచిదేగదా - ఎందుకలా ఏడుస్తావు? నేను అపార్థంచేసుకున్నాను. సారీ... నన్ను క్షమించు. రవిని కూడా క్షమాపణ అడుగుతాను—" గమన రేణును మామూలు మనిషిని చెయ్యాలని అంది.

"రవి లేడు చచ్చిపోయాడు".

రేణు లేచి కూర్చుంది.

గమన బిత్తరపోయింది.

"రవి చచ్చిపోయి సంవత్సరం అయింది. రవిని మర్చిపోలేకా, రవి చచ్చిపోయాడనే విషయాన్ని నమ్మలేకా నమ్మని విషయాన్ని చెప్పుకోలేకా చచ్చిపోతున్నాను" రెండు చేతుల్లో ముఖం దాచుకుంది.

రేణుమీద జాలితో గమన కరిగిపోయింది. దగ్గరకు వెళ్ళి రేణు తలను గుండెలకు హత్తుకుంది.

"ఏడవకు రేణూ- నీబాధ తెలియక చాలా నొప్పించివుంటాను. సారీ- నిజంగా సారీ" అంటూ క్షమాపణ చెప్పుకుంటుంటే వారించింది.

"తప్పునాది... విషయం దాచి ఆ భ్రమలో

అబద్ధంలో బతకాలని ఆశపడ్డాను. అది కుదర లేదు. సూర్యం కుదరనివ్వలేదు- నువ్వేంచే స్తావు'' కళ్ళు తుడుచుకుంది.

''సూర్యానికి ఈ విషయం తెలుసా?''

''తెలుసు- హిరోషిమా సినిమా చూసినరోజు నేను బ్రేక్ అయి చెప్పేశాను''

గమన ఆలోచనలో పడింది.

''సూర్యం నిన్ను ప్రేమిస్తున్నాడేమోనని నాకు అనుమానం'' మళ్ళీ రేణును నొప్పిస్తు న్నాననుకుంటూనే అడిగింది.

''అనుమానం లేదు. ప్రేమిస్తున్నాననే అంటున్నాడు''

నీరసంగా నవ్వి పడుకుంది రేణు.

''నీతో చెప్పాడా?'' ఆశ్చర్యపడింది గమన.

రేణు ఔనన్నట్లు తలాడించింది.

''మరి- నువ్వేమన్నావు... తిట్టలేదుగదా?''

''తిట్టటం దేనికి- నాకతనంటే గౌర వంవుంది. అతని ప్రేమను అంగీకరించలేను. అదివేరే సంగతి- నామీద జాలితో, సానుభూ తితో వుండి నన్ను ప్రేమిస్తున్నానన్న వ్యక్తిని తిట్టటం దేనికి''

''అతని ప్రేమని ఎందుకంగీకరించలేవు?''

గమన ఒద్దనుకుంటూనే అడిగింది.

''నీకు తెలియదు గమనా- నేను చెప్పలేను. రవిని నేను మర్చిపోలేను''

బాధతో రేణుముఖం ముడుచుకుపో యింది.

''మే ఐ కమిన్'' సూర్యం వాకిలి దగ్గరని ల్చుని వున్నాడు.

రేణు, గమనా వులిక్కిపడి లేచారు. గమన రండి రండంటూ సూర్యాన్ని ఆహ్వానిస్తే రేణు ఏడ్చిన ముఖాన్ని కడుక్కోవటం కోసం బాత్ రూంకి నడిచింది.

''ఇప్పుడే రేణు తన గురించీ- మీ గురించీ చెప్పింది. బాగా బాధపడుతోంది ఓదార్చండి. బెస్టాఫ్ లక్'' అంటూ బైటికి వెళ్ళబోయింది.

''ఏంటి- ఏం చెప్పింది. నన్ను కంగారుపెట్టి మీరు వెళ్తున్నారేంటి?''

సూర్యం కంగారు పడ్డాడు.

''రేణు చాలా మంచమ్మాయి. మీ నిర్ణయం మార్చుకోకండి. రేణు ప్రేమ లేకుండా బతకలే దు. తన స్వభావం నాకు బాగా అర్థమయింది. మీరు రేణును మార్చగలరు... మార్చాలి''

రేణు వస్తుంటే మాటలు ఆపేసింది.

సూర్యం అయోమయం నుంచి తేరుకోక ముందే గమన బైటికి వెళ్ళింది.

గమన కావాలనే తమను ఏకాంతంలో వుంచి వెళ్ళిందనే ఊహతో రేణు ముఖం ఎరుపెక్కింది. ఏడ్చినట్లున్న రేణు ముఖం క్రమంగా ఎరుపెక్కటాన్ని చిత్రంగా చూశాడు సూర్యం.

రేణు ఏం మాట్లాడాలో తెలియక జడ విప్పి దువ్వెనతో దువ్వుకోవటం మొదలెట్టింది.

''రెండుగంటలవరకూ పవర్‌రాదట. పుస్త కాల షాపుకి వెళదాం మీరూ వస్తారేమో కను క్కుందామని ఇటు వచ్చాను. వస్తారా?''

సూర్యం ముందు తేరుకుని అడిగాడు-

రేణు వస్తానన్నట్టు తలవూపి గబగబా జడ అల్లుకుంది. ఇద్దరూ బైటికి నడిచారు.

పూనాలో వున్న నాలుగైదు పెద్దషాపులూ తిరిగారు.

రేణుకు మంచి పుస్తకాలు చూపించి ఆ పుస్తకం గురించీ, రచయిత గురించీ, అతని ఇతర పుస్తకాల గురించీ చెప్పేవాడు సూర్యం.

రేణు ఆ పుస్తకం కొంటానంటే

''ఎందుకు- నా దగ్గరవుంది నేనిస్తాను. చదువుదురుగాని- హైదరాబాదు వచ్చి మరీ ఇస్తాను'' అనేవాడు.

''మీరు చదవని పుస్తకాలు ఏమన్నావున్నా యా?'' ఆశ్చర్యంగా అడిగింది రేణు.

''ఆ... ఇక్కడే వుందొకటి- కొనిస్తారా?'' అంటూ ఓ పుస్తకం తీశాడు.

''వన్ హండ్రెడ్ ఇయర్స్ ఆఫ్ సాలిట్యూడ్'' అనే పుస్తకం.

''గాబ్రియల్ గార్షియా మార్క్వెజ్- ఈ రచ యిత పేరు. నేనెప్పుడూ వినలేదు- సరే, నేనే కొనిస్తా'' అంటూ ఆ పుస్తకం తీసుకుంది.

''మీకోసం నేనీ పుస్తకం కొంటున్నాను'' అంటూ బాబ్‌డిలాన్ కవితల పుస్తకం కొన్నాడు సూర్యం. పుస్తక ప్రపంచంలో పడి ఇద్దరూ

తమతమ సంకోచాలు మరిచి దగ్గరయ్యారు.

రెండు గంటలకంతా క్లాసుకి హాజరయ్యారు.

రేణు రెండవ వరసలో మంజరి పక్కన కుర్చీ ఖాళీవుంటే వెళ్ళికూచుంది.

సూర్యం వెనక వరసకి వెళ్ళికూచున్నాడు.

ఏనిమేషన్ సినిమాల గురించి క్లాసు. పెద్ద ఇంటరెస్టింగ్‌గా లేదు.

గమన ఆలస్యంగా వచ్చి వెనక వరసలోకి వచ్చింది. సూర్యం పక్కనున్న కుర్చీలో కూచుంది.

భుజం మీద ఏదో గుచ్చుకోవటంతో పక్కకు తిరిగి చూశాడు.

గమన పెన్సిల్‌తో పొడుస్తోంది.

ఏంటన్నట్టు చూస్తే తన నోట్సుకేసి చూపింది.

"రేణు ఏమంటుంది?" అని రాసివుంది.

"ఏవిషయం?" తన నోట్సులో రాశాడు సూర్యం.

"మీ ప్రేమ విషయం?" గమన రాసింది.

"మీతో ఏంచెప్పింది?"

"రవిని మర్చిపోలేనని చెప్తుండగా మీరొచ్చారు. తర్వాత మీతో ఏమందోనని-"

"ఆ విషయం మాట్లాడలేదు. అంతకు ముందు నాతో కూడా అలాగే అంది. నాకు ఆశలేదు ఆమె ఒప్పుకుంటుందని" అది చదివి సూర్యం ముఖంలో నిరాశచూసి జాలిపడింది గమన.

"నిరాశ పడకండి... రేణుకు మీరంటే చాలా ఇష్టం. నాకు తెలుసు ఇప్పటి తన స్థితిలో అలాగే అంటుంది. తనను మార్చాలి గానీ మీరు నిరాశపడితే ఎలా" గమన రాసింది చదివి సూర్యం ముఖం వికసించింది. గమనంటే చాలా ఆత్మీయంగా అనిపించి కాసేపు ఆలోచించి తనూ రాశాడు. గమన పాఠం వింటున్నట్టు వుంటే తనూ పెన్సిల్‌తో గమన చేతిమీద పొడిచాడు.

"కుమార్ ఏమంటున్నాడు?" అన్న ప్రశ్న చదివి గమన నవ్వు ఆపుకోటానికి చాలా కష్టపడింది.

"బదులు తీర్చుకుందామనుకుంటున్నారా- మా స్నేహం ఇంకా అందాకా రాలేదు. ఊరికే కబుర్లు చెప్పుకుంటూ ఒకరినొకరు గమనించుకుంటున్నాం" అని రాసింది.

"హేమంత్‌గారే అన్ని క్లాసులూ తీసుకుంటే బాగుంటుంది. ఈ కొత్తకొత్తవాళ్లు కొత్త విషయాలు చెబుతామని వచ్చి మనకా విషయాలు తెలియకుండా చేస్తున్నారు" అని గమన రాసింది చదివి-

"ఈ క్లాస్ అవగానే కౌల్‌గారి క్లాసుంది. నాకూ చాలా ఆశలున్నాయి ఆక్లాసుమీద" అని రాస్తుండగానే పాఠం అయిపోయింది.

అప్పటిదాకా ముందు వరసలో కూచుని శ్రద్ధగా పాఠంవిన్న హేమంత్ లేచి కౌల్‌గారిని పరిచయంచేసి మళ్లీ తన సీట్లో కూచున్నాడు. కౌల్‌గారు చాలా మొహమాటంగా- తనకు పాఠం చెప్పటం అంతగా రాదంటూ మొదలుపెట్టి "సినిమాకు ఒక కొత్త భాషనూ, కొత్త వ్యక్తీకరణ పద్ధతిని సృష్టించుకోవాల్సిన అవసరం ఉందన్నారు.

"సాంఘిక సమస్యలన్నీ సినిమాని తినేస్తున్నాయని- సాంఘిక సమస్యలు సినిమాలోకి కొత్త పద్ధతిలో రావాల"నీ అన్నారు-

రకరకాలుగా సినిమాని మార్చాలని చెబుతూ ఆయన క్లాసునంతా క్రమంగా తనస్థాయికి తీసుకెళ్లారు. అది ఇంకొక లోకం. మేధో ప్రపంచం. కళకు సంబంధించిన మేధస్సు అది.

"మనం సినిమాలో చూపిస్తున్న విషయం ఎంత ముఖ్యమో చూపించని విషయం కూడా అంతే ముఖ్యం అని మర్చిపోకూడదు-" అన్నారాయన. అందరికీ ముందు ఆశ్చర్యం- తర్వాత ఆయన వివరించింది విని అర్థం చేసుకుంటే ఆనందం.

"ఒక షాట్‌లో మనకు కనిపిస్తున్న దాని ద్వారా కనిపించనిదేదో మనకు అర్థంకావాలి. ఒక విషయాన్ని చెప్పి మనం ప్రేక్షకులకు అర్థం చేయించినట్లే ఇంకో విషయాన్ని చెప్పకుండా అర్థం చేయించాలి. ఉదాహరణకు మనం సంగీతంలో స - గ అని ఆలాపించామనుకోండి. అక్కడ లేని 'రి' మనకు తన ఉనికిని తెలియజేస్తూనే ఉంటుంది. స నుంచి గ కు వెళ్ళటం- మధ్యలో 'రి' ఉంటే ఒకర




కంగా లేకపోతే ఇంకొకరకంగా ఉంటుంది. ఆ 'రి' ప్రదేశంలోకి నువ్వు వెళతావుగాని ఆ ప్రదేశాన్ని తాకవు... అక్కడ ఆగవు. అందులో ఉన్న మాధుర్యాన్ని మనం అనుభవించాల్సిందేగాని చెప్పటం కష్టం''

వింటున్న వాళ్ళంతా ఈయన చెబుతున్న విషయం అర్థంచేసుకోటానికి ప్రయత్నిస్తూ ఆ ప్రయత్నంద్వారా వికసిస్తున్న తమ మెదళ్ళను గుర్తిస్తూ మెదడు వికసిస్తున్నప్పుడు కలిగే ఆనందానుభూతిలో మునిగిపోయారు.

తర్వాత ఆయన సంస్కృతంలో సాహిత్య విమర్శకు వెళ్ళి తర్కశాస్త్రంలోని ప్రమాణాలను అభావాలను వివరించాడు. అభావంలో భావాన్ని చూసే సంబంధాలు, పద్ధతులు నాలుగు. కనిపిస్తున్నవాటికి కనిపించని వాటికి మధ్య ప్రాగభావం, అంటే ఒక విషయం మనకు తెలియక ముందే' అది లేదే అని విచారించటం''
క్లాసంతా అదెలా కుదురుతుంది. అదెలా కుదురుతుందని గోల చేశారు. కుదరటం చాలా కష్టం గానీ ఒక ఉదాహరణ ఆధునికులు ఇస్తున్నారు.

''శిశువు గర్భంలో ఉన్నపుడే తల్లి చనుబాలను పొందలేదనుకోవటం''

''మైగాడ్... అది సాధ్యమేనా'' విద్యార్థులు ఉత్సాహం పట్టలేకపోతున్నారు. సాధ్యాసాధ్యాలు కాదు ''మీకు ప్రాగభావం అంటే బాగా అర్థం కావటానికి ఒక ఉదాహరణ చెప్పాను.

''ఎందుకు- మీకు అర్థమయ్యే ఉదాహరణ, అంగీకరించే ఉదాహరణ చెప్పనా.

''ప్రియురాలు కనబడక ముందే, ఆమె ఎవరో తెలియకముందే ప్రియుడు ఆమెను మిస్ అవుతుంటాడు. ఆమె 'లేని' స్థితిని ఆమె యాబ్సెన్స్‌ని బాగా అనుభవిస్తాడు ఆమె కనపడేవరకూ అతని స్థితి, అతని తపన ప్రాగభావం అనుకోండి'' క్లాసంతా నవ్వులు.

''ప్రియురాలి కోసం ప్రియుడే వెతకాలా. ప్రియుడి కోసం ప్రియురాలు వెతికినట్లు చెప్పరేం'' రజని పెద్ద అభ్యంతరం లేవదీసింది.

''ఓ... ఇక్కడ కూడా ఉమెన్స్ లిబ్ ఉందా- చాలా జాగ్రత్తగా ఉండాలన్నమాట'' అంటూ భయం నటించాడాయన.

క్లాసంతా మళ్ళీ నవ్వులు. టైమ్ ఆరయింది. సినిమా అయిదున్నరకు ప్రారంభం కావాల్సి ఉంది. ఎవరికీ కదలాలనిపించటం లేదు

రమేష్, హేమంత్‌లు టైమ్ గుర్తుచేస్తే మిగిలిన అభావాల గురించి చెప్పాల్సిందేనని విద్యార్థులు గోలచేశారు. కౌల్‌గారు విధ్వంసాభావం అంటే నాశనమైన దానిలోంచి ముందున్న స్థితిని చూడటం- అంటూ పగిలిన గ్లాసు ముక్కల్లోంచి చక్కగా విస్కీ నింపి ఉన్న గ్లాసును చూడటం అని చెబితే అందరూ నవ్వులూ, కేకలు. అలాగే నవ్విస్తూ ఆయన అన్యోన్యాభావాన్నీ అత్యంతాభావాన్నీ కూడా వివరించి క్లాసు ముగించారు.

ఆ తర్వాత రెండు మంచి సినిమాలు చూసినా విద్యార్థులకు కౌల్‌గారు ఎక్కించిన విజ్ఞానపు మత్తు దిగలా.

రేణూ, గమనారాత్రి ఒంటిగంటకు సినిమా నుంచి వచ్చి కౌల్‌గారు చెప్పిన విషయాల గురించి మాట్లాడుకుంటుంటే ఆయన వరండాలో నడుస్తూవచ్చారు. వీళ్ళిద్దరూ నమ్మలేనట్లు చూస్తుంటే ఆయన పక్కగదిలోకి వెళ్ళారు. ఆ గది ఫైనల్ పరీక్షలు రాసి డిప్లొమా ఫిలిం తీస్తున్న మంజిల్ అనే అమ్మాయిది.

తర్వాత పది నిముషాలలో సన్నగా మొదలైన రాగం అలలు అలలుగా పెరిగి ఆ కారిడార్ అంతా వ్యాపించింది.

ఆ వెనక మంజిల్ గాబోలు మరింత మధురంగా ఆలాపన మొదలు పెట్టింది. పాటలేదు- ఒట్టి రాగాలాపనే. అతి గంభీరమైన అతి మృదువైన రెండు కంఠస్వరాలు తమ గాంభీర్యంతో, మాధుర్యంతో ఆ నిశ్శబ్ద రాత్రిని చుట్టేశాయి. తీగలు తీగలుగా సంగీతం ఆ గదులన్నిటినీ చుట్టేసింది.

గమనా, రేణులిద్దరూ మాటలు ఆపి తమ మంచాలమీద పడుకుని వినసాగారు.

ఆ సంగీతాలాపనలో ఏదో ఆర్తి, ఏదో అన్వేషణ, అర్థంకాని ఆవేదన, ఆపలేని ఆనందం! ఆ సంగీతం తమలో కలిగిస్తున్న అనుభూతిని అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తూ నిద్రలోకి జారిపోయారు.

మర్నాడు గమన మంజిల్‌ని రాత్రి



సంగీతం గురించి అడిగితే ఆమె అసలు విషయం చెప్పింది. ఆమె డిప్లొమా సినిమాకి సంగీతం సమకూర్చే పనిలో కౌల్‌గారి సాయం తీసుకుంది. ఆమె తీసిన సినిమా చూసి కౌల్‌గారు ఒక రాగాలాపన నేపథ్యంలో ఉంటే బాగుంటుందని సూచించారు. దాన్ని పాడించి రికార్డ్ చేశారు. అది సరిపోతుందా లేదా అన్న విషయం చూడాలనీ, యివాళంతా అదేపని అనీ చెప్పింది.

కౌల్‌గారికి ఒక్క క్లాసే ఇవ్వటం అన్యాయ మనీ ఆకాష్‌లాంటివాళ్ళకు మూడు క్లాసులిచ్చి కౌల్‌గారికి ఒక్కటేఇస్తే ఎలాగనీ అందరూ అసంతృప్తి చెందారు.

ఆరోజు బెనర్జీగారనే కొత్త లెక్చరర్ వస్తారు. కౌల్‌గారివి విని మనం ఇంకొకరితో తృప్తిప డలేం అనుకున్నారందరూ. ఆయనమీద ఆశ లేమీ పెట్టుకోలేదు. గమనైతే క్లాసు ఎగ్గొడదామా అని ఆలోచించింది. రేణు బలవంతాన క్లాసుకి లాక్కొచ్చింది. తీరా క్లాసుకొస్తే బాంబేనుంచి బెనర్జీగారింకా రాలేదనీ ఏక్షణంలోనైనా రావ చ్చనీ, కారులో అక్కణ్ణించి బయల్దేరినట్లు వర్తమానం వచ్చిందనీ, కాసేపు ఓపికపట్టమనీ హేమంత్ - రమేష్‌లు చెప్పారు.

గమన ఈసారి రేణూను లాక్కెళ్ళి లైబ్రరీ ముందున్న తోటదగ్గర కూచోబెట్టింది.

"నీతో సీరియస్‌గా మాట్లాడాలి - పిచ్చి పిచ్చి వేషాలెయ్యక మర్యాదగా సమాధానాలి వ్వు" అని బెదిరించింది.

గమన మాట్లాడదల్చుకునేదేమిటో రేణూకు తెలిసిపోయింది. మాట్లాడకుండా కూచుంది.

"చెప్పు- సూర్యం ప్రేమనంగీకరించటానికి నీకేమిటి అభ్యంతరం?"

"చెప్పానుగా గమనా- నన్నెందుకు వేధి స్తావు. నేను రవిని మర్చిపోలేను".

"రవిని మర్చిపొమ్మని ఎవరన్నారు - సూ ర్యం అన్నాడా?"

"సూర్యం అలా అంటాడా?"

"మరి- రవిని మర్చిపోవటం ఎందుకు - నువ్వూ, సూర్యం కలిసి రవిని తలుచుకోండి".

"గమనా- నీకర్థం కాదు - అదంతా కుదరని విషయం"

"అదే - ఎందుకు కుదరదో నేను తేల్చుకోవా లనుకుంటున్నా- భర్త చచ్చిపోతే ఇక ఆ జీవితం అలా వాడిపోవాల్సిందేనా- ఇన్నిరోజు లు గడిచినా, ఇంత అభివృద్ధిని సాధించినా వితంతు వివాహం మాత్రం కుదరదా?"

"కొందరికి కుదరవచ్చేమో. నా విషయం నేను చెబుతున్నాను - నేను కూడా నీలాగా వాదించినదాన్నే. మా తెలుగుదేశంలో వీరేశ లింగంగారని గొప్ప సంస్కర్తఉన్నారు. ఆయన వితంతువివాహాలకోసం పడ్డ కష్టాలు చదివి ఆయన్ని గౌరవించి, ప్రేమించినదాన్నే- కానీ నా విషయం దగ్గరికొచ్చేసరికి నేను ఆవిషయా న్ని మామూలుగా తీసుకోలేకపోతున్నాను. ఎక్క డో ఏదో అడ్డం పడుతోంది. కొన్ని ఇనప తెరలేవో నన్ను బలంగా నిరోధిస్తున్నాయి. నాకు ఈ విషయం గురించి ఒక సిద్ధాంతంగా ఏ అభ్యంతరాలూ లేవు. నా స్థానంలో ఉన్న ఎవరికైనా నేనదే సలహా ఇస్తా- కానీ నేనాచ రించాలనేసరికి నాకు ఏదో తెలియని భయం - సంకోచం. రవి గురించి నీకు తెలిస్తే, నా బాధ అర్థమయ్యేదేమో. రవి ఎంత మంచివాడో, నన్నెంత ప్రేమించేవాడో నీకు తెలియదు గమనా. ఆ ప్రేమను పొందాక దానితోతృప్తి పడక ఇంకో ప్రేమకోసం వెళ్లటం అన్యాయమ నిపిస్తోంది".

"సరిగ్గా నా అభ్యంతరం కూడా అక్కడే ఉంది"

రేణూ మాటలను ఆపేసింది గమన.

"ఎక్కడ?"

"రవి ప్రేమను పొందటంవల్ల నీకు ప్రే మలో ఉన్న మాధుర్యం, ప్రేమకున్న శక్తి తెలి శాయి. ప్రేమ విలువ తెలిసింది- ఇవన్నీ తెలిసీ నువ్వు ప్రేమ లేకుండా ఉండలేవు. అసలు ప్రేమంటే తెలియకపోతే జీవిత మంతా ఒంటరిగా ఉండటం కష్టం కాదేమో గాని ఒకసారి దాన్ని గురించి తెలిశాక దాన్ని పొందకుండా నిస్సారంగా జీవితాన్ని ఎలాగడు పుతావు? అది నరకం కదూ- ఆ ఒంటరితనా న్ని నువ్వు భరించలేవని నాకనిపిస్తోంది"

రేణు ఏంమాట్లాడాలో తెలియక మౌనంగా కూచుంది.

"సూర్యం చాలా మంచిమనిషి. అతనితో




నేను మాట్లాడింది చాలా తక్కువసార్లే అయినా ఒక మగాడితో మాట్లాడుతున్నట్టు ఎప్పుడూ అనిపించలా. ఒక మనిషితో మాట్లాడుతున్నట్టే ఉంది. చాలా సంస్కారవంతుడనిపించింది. నువ్వు నూర్యాన్ని పోగొట్టుకుంటావేమోనని నాకు భయంగా ఉంది".

క్లాసంతా లైబ్రరీవైపే తరలి రావటంతో వీళ్ళిద్దరూ లేచి నుంచున్నారు.

"ఇవాళ క్లాసు ఇక్కడ థియేటర్‌లో తీసుకుంటారట" అని మంజరి చెబితే అందరితో పాటు క్లాసుకి నడిచారు.

అది ఎ.సి. రూం. ఎవరూ సిగరెట్ కాల్చవద్దని రమేష్ చెబితే -

రజనీ, బీనాలు మరికొందరు మగవాళ్ళూ - "మైగాడ్- మన రూంకి మనం పోదాం" అని గొడవచేశారు.

బెనర్జీగారిని హేమంత్ పరిచయంచేశారు.

ఆయన నల్లగా, పొట్టిగా, అతి మామూలుగా ఉన్నారు. ముందురోజు ఆజానుబాహువైన కౌల్‌గారినీ, ఆయన పాఠాన్నీ తల్చుకుని ఇప్పుడీబెనర్జీగారిని చూసి అందరూ నీరసపడ్డారు.

తప్పదన్నట్టు కూర్చున్నారు. ఒక్కళ్ళూ నోట్సులు తెరవలేదు. పెన్నులు తియ్యలేదు.

బెనర్జీగారు పాఠం మొదలుపెట్టారు. రంగస్థలానికీ, సినిమాకూ ఉన్న సంబంధాన్ని గురించి ఆయన పాఠం. పంతొమ్మిదో శతాబ్దపు చివరి భాగం నుంచీ ఆయన తన పరిధిలోకి తెచ్చుకున్నారు. పెయింటింగ్‌లో వచ్చిన ఇంప్రెషనిజం, సాహిత్యంలో వచ్చిన నేచురలిజం గురించి చెప్పారు. మనిషి ప్రకృతిలో సత్యంలో ఒక భాగం మాత్రమే. ఆ ప్రకృతితో సత్యంతో మనిషి చెయ్యగలిగిందేమీలేదు అని పెట్టుబడీదారి సంస్కృతి రావటానికి దోహదం చేసిన సిద్ధాంతం వివరించాడు.

మార్క్స్, ఫ్రాయిడ్ సిద్ధాంతాల ప్రభావం కళలమీదపడిన విధానం వివరించాడు.

మొదటి ప్రపంచ యుద్ధంలో బాంబింగ్‌వల్లా, యుద్ధం చేసే పద్ధతుల్లో వచ్చిన మార్పువల్లా మానవ స్వభావంలో వచ్చిన మార్పులను ఆయన చెబుతుంటే విద్యార్థులకు వాళ్ళెప్పుడు నోట్సులు తెరిచారో పెన్నులు తీశారో వాళ్ళకే

తెలియదు. మొదటిప్రపంచ యుద్ధానికి ముందు యుద్ధం చేసేవాళ్ళకు తమ శత్రువెవ రో తెలుసు. కళ్ళముందు కనిపించేవాడు- తామెవరిని చంపుతున్నారో వాళ్ళకు తెలుసు. మొదటి ప్రపంచ యుద్ధంలో ఆ విషయం తెలియదు. శత్రువు ఇప్పుడు ఫేస్‌లెస్, ము ఖంలేని వాడయ్యాడు. దానితో మానవత్వంలో వచ్చిన మార్పు చాలా పెద్దది.

మానవత్వం తనలో కొంత భాగాన్ని కోల్పో యింది. ట్రెంచ్‌ల్లో ఉంటి యుద్ధం చెయ్యటం కూడా అప్పుడే మొదలయింది. ట్రెంచ్‌లో ఉన్నప్పుడు మనిషి నిటారుగా నిలబడలేడు. వంగి జంతువులలాగానూ, పురుగులలాగానో నడ వాలి, పాకాలి. వెన్నెముక లేనట్లు ఉండాలి. మనిషి ఇప్పుడు "ఎంత్రోపస్ ఎరెక్టస్" కా కుండా పోయాడు. మనిషి లక్షణాలన్నీ ఒక్కొ క్కటే నశించే స్థితి వచ్చింది.

ఇలా మొదలైన ఆ ప్రవాహం రెండవ ప్రపంచ యుద్ధకాలం దగ్గరకొచ్చి ఆగింది. అప్పటి పెయింటిగ్స్ చూపించటానికి ఆగారు.

చాగాల్, ఆట్టోడిక్స్ వంటి చిత్రకారుల పె యింటింగ్స్ చూపించి వాటి అంతరార్థాలు విప్పి చెప్పారు.

పికాసో గెర్నికా ' ఆయన చూపించి చె బుతుంటే రేణుకు ఒళ్ళంతా పులకరించినట్లని పించింది.

పికాసో ' గెర్నికా ' తాను చూడగలనని గానీ, చూసినా అర్థం చేసుకోగలననిగానీ రేణు కలలో కూడా అనుకోలేదు. అప్రయత్నంగా సూర్యంవంక చూస్తే అతను తన్మయత్వంతో ఆ చిత్రాని చూసి ఇంకా దేనికోసమో వెతుకుతు న్నాడు. గంటలు నిమిషాల్లా గడిచి క్లాసు ముగిసింది.

ఈ నాలుగు రోజులూ బెనర్జీగారి క్లాసు లుంటాయనుకుంటే అందరికీ చాలా సంతో షంగా అనిపించింది. చివరి నాలుగురోజులూ ఒక్కక్షణం ఊపిరాడకుండా పనిపెట్టారు.

అంతర్జాతీయ సినిమా చరిత్ర పూర్తి చె య్యాలని హేమంత్ లంచ్‌టైంలో గంటా, సాయంత్రం సినిమాకు ముందిచ్చే అరగంట విరామం తీసుకుని క్లాసు చెప్పేవారు.

బెనర్జీగారి క్లాసులో టైంఅయిపోయినా ఎవ రికీ లేవబుద్ధి అయ్యేది కాదు.

ఉదయం తొమ్మిదికి క్లాసుకొస్తే రాత్రి ఒంటి గంటదాకా ఇంకో విషయం ఆలోచించే అవ కాశం లేకుండా ప్రోగ్రాం ఉండేది.

చివరిరోజు సర్టిఫికెట్లు ఇవ్వటానికి శశిక పూర్‌ని పిల్చి ఫంక్షన్ ఏర్పాటుచేస్తున్నామని హేమంత్-రమేష్‌లు చెప్పారు. చివరిరోజుల్లో ఒకవంక ఊపిరాడకుండా క్లాసులు, ఇంకోవైపు ముంచుకొస్తున్న ప్రయాణం. ఈ స్నేహాలకు వియోగం కలుగుతోందే అన్న దిగులూ.

వీటితో అందరూ ఎలాగో వున్నారు.

సూర్యం- రేణూ వారంముందే హైదరాబాద్‌కి టిక్కెట్లు రిజర్వ్‌చేయించుకున్నారు.

హైదరాబాద్‌లో ఒకరోజుండి వాళ్ళత్తయ్యను చూసి మర్నాడు విజయవాడ వెళ్తానన్నాడు సూర్యం.

తెల్లవారితే అది పూనాలో ఆఖరిరోజు. ఆరోజు సెకండ్ షో మానేసి రేణుతో మాట్లాడ దామనుకున్నాడు సూర్యం. తాను మళ్ళీ ఆ విషయం ప్రస్తావించనన్నాడనే విషయం గుర్తొ చ్చి కాస్త సంకోచపడ్డా ఇవాళ తప్పితే మళ్ళీ అవకాశం దొరకదేమోననే భయంతో ఆ నిర్ణయం తీసుకున్నాడు.

తీరా సెకండ్‌షో అంతకుముందు ప్రక టించిన సినిమాకాదనీ 'డబల్ సూయిసైడ్' అనే జపాన్ సినిమా అని చెప్పగానే హతాశుడ య్యాడు.

ఆ సినిమా చాలా గొప్ప- సినిమా అని విని వున్నాడు. అది తను మిస్‌కావటం, రేణుచూ సే అవకాశాన్ని పోగొట్టటం ఇష్టంలేకపో యింది.

"ఈ సినిమా నా జీవితాన్నే మార్చేసిందే మోనని భయంగా వుంది" అన్నాడు థియే టర్‌లో రేణుపక్కన కూర్చుని.

"ఎందుకలా?" రేణు నవ్వింది.

"సెకండ్‌షో" చూడకుండా మీతో కలిసి అడవిలో తిరుగుతూ మాట్లాడాలనుకున్నాను. ఇంతకుముందు చెప్పినట్లు ఆ హాలీవుడ్ సినిమా అయితే అలాగే చేసేవాడిని. కానీ ఈ సినిమా మిస్‌కావటం, మీరు చూసే అవకాశా న్ని పోగొట్టటం ఇష్టంలేక వచ్చి కూర్చున్నా

ను''

నిట్టూర్చాడు సూర్యం.

రేణు నవ్వి వూరుకుంది.

"నేనేం మాట్లాడాలనుకున్నానో మీరు ఊహించగలరు. ఆ విషయం ఆలోచిస్తారుగదూ –"

రేణు చేతిని తన చేతిలోకి తీసుకుని ప్రేమగా నొక్కాడు.

ఆత్మీయమైన ఆ స్పర్శ రేణుకు హాయిగా అన్పించింది. నెమ్మదిగా చెయ్యి విడిపించుకుని-

"ఈ సినిమా అంత గొప్పదా – డైరెక్టరెవరూ?" అని అడిగింది.

"షినోడా అని – నేనూ వినటమేగాని అతని సినిమాలేవీ చూడలేదు –"

సినిమా మొదలయింది.

కథ మామూలు కథే. ప్రేమకూ బాధ్యతకూ మధ్య వచ్చే వైరుధ్యాన్ని గురించి.

భార్యా, ప్రియురాలు – వీళ్ళమధ్య నలిగే భర్త.

భర్తా, అతని ప్రియురాలు – వీరిమధ్య నలిగే భార్యా, ప్రియుడూ- అతని భార్యా – వీరిమధ్య నలిగే వేశ్య. ఒకవైపు మహా విశృంఖలమైన సెక్సునీ, ఇంకోవైపు అతి కఠినమైన సంప్రదాయిక నీతులనీ చూపించటంలో దర్శకుడు గొప్ప ప్రతిభ కనబరిచాడు.

ప్రియురాలి ప్రేమలోని ఆవేశాన్నీ –

భార్య ప్రేమలోని ధర్మబద్ధమైన శాంతాన్నీ –

ఈ రెంటికీమధ్య చిక్కుకున్న అతని ఘర్షణనీ, బలహీనతనూ కళ్ళనీళ్ళు తెప్పించేలా చిత్రించాడు. బరువెక్కిన మనసులతో బైటికివచ్చారు.

"కర్వే రోడ్డుదాకా వెళ్ళే ఓపికుందా?" సూర్యం అడిగాడు.

"లేదు – చాలా అలసటగా వుంది" అంటూ తన హాస్టల్‌వైపు నడిచింది రేణు. రాత్రంతా ఉమా, గమనా చెప్పే కబుర్లువింటూ కూచుంది రేణు.

ఉమ తల్లిదండ్రులిద్దరూ చనిపోయారు. ఇద్దరన్నలు పెళ్ళిళ్ళుచేసుకుని స్థిరపడ్డారు. ఇద్దరు చెల్లెళ్ళు తనలాగే మంచి ఉద్యోగాలు చేస్తున్నారు. ముగ్గురికీ పెళ్ళిళ్ళుకావాలి. అన్నలు పట్టించుకోరు. తమకు ఏం చెయ్యాలో తెలియదు.

"హర్ష మా రెండో చెల్లెలికి సరిపోతాడని పించి అతన్ని పరిచయం చేసుకుందామనుకున్నాను. లక్నోలో మా ఇంటికి ఆహ్వానిద్దామనీ, మా చెల్లెల్ని చూపిద్దామనీ అనుకున్నాను. కానీ అతను నాతో మాట్లాడటమే మానేశాడు. తప్పించుకుని తిరుగుతున్నాడు"

ఉమ మాటలు వింటుంటే రేణుకు జాలేసింది. ఉమని అపార్థంచేసుకున్నందుకు సిగ్గేసింది. గమన మాత్రం "ఉమా – మీరు మీ పద్ధతులు మార్చుకోవాలి. మీ మాటలతో అవతలివాళ్ళను విసిగిస్తారు. వాళ్ళు మాట్లాడే అవకాశం ఇవ్వకుండా మీరే మాట్లాడతారు. మీరు నిశ్శబ్దంగా వుండటం నేర్చుకుంటేగాని మీకు మంచిస్నేహితులు దొరకరు"

అని నిర్మొహమాటంగా తన అభిప్రాయాన్ని చెప్పేసింది. ఉమ మాట్లాడకుండా దిగులుగా కూర్చుంది.

తెల్లవారుఝామువరకూ అలాగే కబుర్లుచెప్పుకుంటూ మేలుకుని వున్నారు.

★ ★ ★

ఉదయంనుంచీ అమ్మాయిల హాస్టలంతా కలకలం... కలవరం. ఎవరే చీరెలు కట్టుకోవాలి, ఎలా ముడివేసుకోవాలి- అని చర్చలు. నచ్చిన డ్రెస్ ఎవరి దగ్గరున్నా సంకోచించకుండా అడిగితీసుకుంటున్నారు.

గమన ఇన్నిరోజులూ జీన్సే వేసుకుంది. ఆ రోజు తాను తెచ్చుకున్న ఒక్క చీరా కట్టుకోటానికి సిద్ధపడింది.

రేణు గమనకు సహాయంచేసింది.

గమన రేణు పెట్టెంతా గాలించి ఎర్రటి సిల్కుచీర తీసి కట్టుకోమని పట్టుబట్టింది. రేణు జుట్టుపైకి దువ్వి అందంగా ముడివేసింది. ఆ ముడి పక్కగా తెల్లటిగులాబీతెచ్చి పెట్టింది. తాను ఎర్రని గులాబీ పెట్టుకుంది.

"ఎందుకీ హడావుడి – అలంకరణలు" అని రేణు అంటే-

"మళ్ళీ మనం ఎప్పటికి కలుస్తామో – ఈ

ఒక్కరోజుకీ నాకిష్టమొచ్చినట్లు వుందాం. ఇవాళ ఫంక్షన్‌గదా – ఫంక్షన్‌రోజు కాస్త శుభ్రంగా తయారైతే ఏమవుతుంది?'' అని విసుక్కుంది.

మెయిన్ థియేటర్‌లోనే ఫంక్షన్.

గమన చేసిన ముస్తాబుతో కొత్తగా కనిపిస్తున్న రేణును ఆశ్చర్యంగా చూశాడు సూర్యం.

సూర్యాన్ని చూసి తన అలంకరణని అతనెక్కడ అపార్థంచేసుకుంటాడోనని సిగ్గుపడింది రేణు. శశికపూర్ వచ్చారు.

హేమంత్ సభ ప్రారంభించారు.

రజనీ, బీనా, హర్ష, రాకేష్- ఇంకా కొందరు తమ అనుభవాల గురించి మాట్లాడారు.

అందరూ ఇది తమ జీవితాలలో మర్చిపోలేని అందమైన కల అని అంగీకరించారు.

శశికపూర్ ఒక్కొక్కరికే సర్టిఫికెట్ ఇస్తున్నారు. సినీనటి గీత స్టేజిమీదకు సర్టిఫికెట్ కోసం వెళ్లి చెయ్యి చాపగానే శశికపూర్ చేతిని వెనక్కి తీసుకున్నాడు. గీత చేతులు దించితే మళ్లీ ఇవ్వబోతున్నట్లు సర్టిఫికెట్ ముందుకి చాపాడు. ఆమె తీసుకోబోతే మళ్లీ వెనక్కు తీసుకున్నాడు. ఇలా నాలుగైదుసార్లు చేశాక గీత "ఏంటి ... నా సర్టిఫికెట్ ఇవ్వరా?'' అని అడిగింది నవ్వుల మధ్యలోంచి.

"నువ్వొక ముద్దు ఇస్తే నేను సర్టిఫికెట్ ఇస్తాన''ని బేరం పెట్టారు శశికపూర్.

గీత నవ్వి శశికపూర్ చెంపమీద ముద్దుపెట్టింది. అందరూ చప్పట్లు కొట్టి నవ్వుతూ కేకలేశారు. మళ్లీ మిగిలినవాళ్లకు సర్టిఫికెట్లు ఇస్తున్నారు. రాకేష్ పేరు పిలవగానే అతను వెళ్లాడు. శశికపూర్ సర్టిఫికెట్ ఇవ్వబోతే తీసుకోలేదు. శశికపూర్ గీతతో ఆడిన ఆట రాకేష్ శశికపూర్‌తో ఆడటం మొదలెట్టాడు.

"సర్టిఫికెట్ వద్దా ... తీసుకోవా?'' అన్నారు శశికపూర్ ఆశ్చర్యంగా.

"మీరు ముద్దుపెట్టుకుంటే తీసుకుంటాన''ని రాకేష్ చెప్పేసరికి థియేటర్ మారుమోగేలా చప్పట్లు, అరుపులు, నవ్వులు.

"నీకు చెంప ఎక్కడుందయ్యా - ముద్దుపెట్టటానికి? అంతా గడ్డమేగదా'' అంటూ రాకేష్ నుదుటిమీద ముద్దుపెట్టారు శశికపూర్.

నవ్వి నవ్వి అందరికీ ఆయాసం వచ్చేసింది. సర్టిఫికెట్లు తీసుకుని బైటపడ్డారు. కొందరు వెంటనే వెళ్లి పోతున్నారు. కొందరు ఆరోజు వుంటున్నారు. ఉండేవాళ్లకోసం ఆ రోజు మెయిన్ థియేటర్‌లో మధ్యాహ్నంనుంచీ రాత్రిదాకా వరసగా సినిమాలున్నాయి.

రేణూ - సూర్యంలు ఎక్కాల్సిన రైలు నాలుగుగంటలకు, నాలుగుగంటల టైముంది- చెయ్యాల్సిన పనులు బోలెడున్నాయి. సామాన్లు సర్దుకోవాలి; టీచర్లందరికీ చెప్పాలి.

రామచంద్రరావుగారికీ, అన్నపూర్ణగారికీ కనిపించి రావాలి. గమనతో నాలుగు ముక్కలు మాట్లాడాలి.

ఊపిరాడనట్లనిపించి ముందు గదికివెళ్లి సామాను సర్దటం మొదలెట్టింది.

ఉమ ఆరోజు వుంటోంది - థియేటర్‌లోనే వుంది. గమన రజనీ, బీనాలకు చెప్పటానికి వెళ్లింది. మాధవి రేణూకి చెప్పి వెళ్దామని వచ్చింది.

"రేణూ ... మళ్లీ నా రొటీన్ జీవితంలోకి వెళ్తున్నాను. ఏమీ ఇష్టంలేదుగానీ తప్పదు-''

దిగులుగా వుంది మాధవి.

"మీరు ఇంటినుంచి బైటికి రావటానికి ప్రయత్నించండి. ఉద్యోగమనేకాదు ఏదో ఒక పనిలోపడండి. ఒంటరితనాన్నుంచి బైటపడండి''

మాధవికి ధైర్యం చెప్పింది రేణు. సామాను సర్దుకునే సరికి సూర్యం వచ్చాడు. భోజనం చేసి టీచర్లందరికీ చెబుదామని వెళ్లారు. హేమంత్ మీద గౌరవం తప్ప రేణూ ఆయనతో ఎప్పుడూ మాట్లాడలేదు. క్లాసులో అందరూ ఏదో ఒకరకంగా హేమంత్‌తో మాట్లాడారు రేణూలాంటి ఒకరిద్దరు తప్ప. మొదటిసారి హేమంత్‌గారి దగ్గరకు వెళ్లి చాలా మొహమాటపడుతూ చెప్పింది రేణు-

"నాకు మీ టీచింగ్ చాలా ఇష్టమండీ. మీ అంత మంచి టీచర్‌ని నేనింతవరకూ చూడలేదు''

హేమంత్ నవ్వుతూ "మంచి టీచర్‌ని గుర్తించి అభిమానించే విద్యార్థులంటే నాకూ




ఇష్టమే'' అన్నారు.

ఆయనతో సాయంత్రం నాలుగు గంటలకు వెళ్తున్నామని చెప్పివచ్చారు.

ఇంకా రమేష్‌గారితో, నాయర్‌గారితో కూడా చెప్పాలని వాళ్లకోసం వెతికితే వాళ్లొకపట్టాన దొరకలేదు.

చివరికి మళ్లీ ముగ్గురూ ఒకచోట దొరికారు. వెళ్తున్నామని చెబుతూ సూర్యం ''ఈసారి తెలుగు సినిమా గురించి ఒక క్లాసు ఏర్పాటు చేయండి'' అనడిగాడు.

''తప్పకుండా - మీరే తీసుకోండి ఆ క్లాసు'' అన్నారు వాళ్లు నవ్వుతూ.

ఆత్మీయంగా వీడ్కోలు ఇచ్చారు.

అన్నపూర్ణగారింటికి వెళితే ఆవిడలేరు. ఇంటికి తాళంపెట్టివుంది.

ఏం చెయ్యాలో అర్థంకాలేదు. అన్నపూర్ణగారిని కలవకుండా, నోరారా తెలుగులో వెళ్లొస్తామండీ అని ఆవిడతో చెప్పకుండా పూనానుంచి బైటపడటం అన్యాయమనిపించింది.

కానీ చెయ్యగలిగింది లేదు.

ఆమె చూపే ఆప్యాయతకు కృతజ్ఞతలు తెలుపుతూ చిన్న ఉత్తరం మంచి తెలుగులో రాసి తలుపు సందులోపెట్టి వచ్చేశారు.

గమనను కలవాలని రేణు హడావుడిపడుతోంది. రెండున్నర అవనే అయింది. గంటలో స్టేషన్‌కి బైలుదేరాలి.

గమన గదిలోలేదు. థియేటర్‌లోలేదు. లైబ్రరీలోలేదు. స్విమ్మింగ్‌పూల్ దగ్గరలేదు. ఆర్కైవ్స్‌కివెళ్ళి వుండొచ్చనే ఆలోచన వచ్చేసరికి మూడయింది. ఆర్కైవ్స్‌కి వెళ్ళటానికి బయలుదేరితే గేటులో ఎదురయింది గమన. ఆర్కైవ్స్ లైబ్రరీలో తెచ్చిన పుస్తకాలు ఇచ్చెయ్యటానికి వెళ్ళాననీ చెప్పింది.

ఇద్దరూ గదికి నడిచారు.

ఇద్దరికీ దిగులుగావుంది. అయిదువారాల్లో అభివృద్ధిచెందిన ఈ స్నేహబంధం ఇద్దరికీ విచిత్రంగా వుంది. ఒకరంటే ఒకరికి ఇష్టం కలగటం, ఇద్దరి జీవితవిధానాలూ, ఆలోచనలూ వేరైనా ఆ కాస్త ఎడాన్ని కాపాడుకుంటూనే దగ్గరవటం.

ఎన్ని అనుభూతులో కలిసి పంచుకోవటం—

ఒకరి కష్టాన్ని ఒకరు సానుభూతితో వినటం-

ఇవన్నీ అయిదువారాల్లోనే –

''ఈ రూంలోకి నువ్వుకాక ఇంకెవరన్నా వస్తే మనిద్దరిమధ్యా ఇంత స్నేహం కుదిరేదికాదేమో! జీవితం ఎంత యాక్సిడెంట్ అనిపిస్తోంది'' అంది రేణు.

''ఔను – మార్క్‌ట్వైన్ అన్నట్లు జీవితం యాక్సిడెంట్లమయమే. అయితే వాటిలో కొన్ని బాధాకరమైనవి, కొన్ని అందమైనవి-మంచివి. బాధను కలిగించే యాక్సిడెంట్లను మర్చిపోయి అందమైనవాటిని జీవితంలో నిలుపుకోవాలి... నిలుపుకోవటానికి ప్రయత్నించాలి. అపుడే జీవితం బాగుంటుంది'' అంది గమన సీరియస్‌గా.

గమన మాటల్లో అర్థాన్ని వెదుకుతూ ఆలోచనలోపడింది రేణు.

''రేణూ... నేను సూటిగా స్పష్టంగా చెబుతున్నాను. నాది తొందరపాటే కావచ్చు. నువ్వు నిదానంగానే ఆలోచించుకో. సూర్యం ప్రేమను నిరాకరించటం చాలా తెలివితక్కువతనం. సూర్యం ప్రేమను నిరాకరించటమంటే జీవితాన్ని నిరాకరించటమే. జీవశక్తినీ, జీవితేచ్ఛనీ నిరాకరించటమే.

నీకు జీవితం అక్కర్లేదనుకుంటావో, కావాలనుకుంటావో నీ ఇష్టం. అన్నీ తెలిసీ పిచ్చి పిచ్చి సంకోచాలతో ప్రేమను దూరంచేసుకోకు'' గమన చెబుతుంటే, తన గురించీ, తన జీవితాన్ని గురించీ అంతగా ఆలోచిస్తున్న గమన మీద ప్రేమతో రేణు గుండె నిండిపోయింది.

''ఎందుకమ్మా... నా జీవితం గురించి అంత ఆలోచిస్తున్నావు?'' అంది.

''ఆలోచించకుండా వుండలేను. నువ్వు నాకు ప్రియమైన స్నేహితురాలివయ్యాక నీ గురించి ఆలోచించకుండా ఎలా వుంటాను?''

''మరి కుమార్ సంగతేమిటి?'' రేణు నవ్వుతూ అడిగింది.

''ఏమీ తేలలేదు. అతనిలో కొన్ని మంచి లక్షణాలున్నాయి గానీ అవి నాకు సరిపోతాయా లేదా అన్నది నాకింకా తేలలేదు. అలాగే నా గురించీ అతనికి పూర్తిగా అంతుబట్టినట్టు

లేదు. అయితే ఇద్దరం మంచి స్నేహితులమయ్యాం. ఈ స్నేహం ప్రేమలోకి దారితీస్తుందనే ఆశవుంది'' అంది గమన.

''కుమార్‌ని ప్రేమిస్తున్నట్లు నాకెప్పుడు రాస్తావా అని ఎదురుచూస్తాను'' అంది రేణు.

''సూర్యం ప్రేమని అంగీకరించానని ఎప్పుడు రాస్తావా అని నేనూ ఎదురుచూస్తాను'' అంది గమన.

''బాగానేవుంది మన ప్రేమగోల''

అని ఇద్దరూ కన్నీళ్ళలోంచి నవ్వుకున్నారు.

సూర్యం ఆటో రెడిగా వుందంటూ వచ్చాడు. గమన నుంచీ, ఫిలిం ఇన్‌స్టిట్యూట్ నుంచీ దూరంగా వస్తుంటే ప్రియాతిప్రియమైన ప్రదేశాన్ని ఒదిలిపోతున్నట్టనిపించింది.

బాబుల్ మోరా అని గమన పాడిన గీతం చెవులలో మారుమోగింది.

ట్రెయిన్‌లో కూర్చుని హేమంత్ గురించీ రమేష్‌గురించీ, కౌల్- బెనర్జీలగురించీ, గమన గురించీ, ఉమ గురించీ, అరవింద్ - హర్షల గురించీ మాట్లాడుకున్నారు. పూనా కబుర్లు చెప్పుకుంటేగాని పూనాకు దూరంగావెళ్ళిపోతున్నామనే దిగులుతగ్గటంలేదు.

పది/గంటలకు పడుకోకతప్పలేదు. కింద బెర్త్ వాళ్ళు తాము పడుకోవాలనటంతో ఇద్దరూ పైకెక్కక తప్పలేదు.

రేణుకు పడుకోగానే నిద్రపట్టింది – ఇన్నాళ్ళనుండీ నిద్ర కరువైందేమో కళ్ళు మూసుకోగానే నిద్రపట్టింది. ప్రశాంతంగా నిద్రపోతున్న రేణునుచూస్తూ చాలాసేపు మేలుకునివున్నాడు సూర్యం.

మర్నాడు ఇద్దరికీ మెలకువ వచ్చేసరికి బేగంపేట స్టేషన్‌రానే వచ్చింది.

నాంపల్లి స్టేషన్‌కోసం ఎదురుచూస్తూ అందరూ సామాన్లు సర్దుకు కూచున్నారు.

ట్రెయిన్ ఆగింది.

సూర్యం సాయంతో పెట్టె దించింది రేణు. అంతలో పోర్టర్రాస్తే అతనికి అప్పగించింది.

''మీ ఇంటికి వెళ్ళిపోతున్నారా? ''

సూర్యం ఎంత కంట్రోలుచేసుకుందామనుకున్నా ఆగకుండా ఏదో దీనత్వం ముఖమంతా పాకింది.

''ముందు శిరీష దగ్గరికి వెళ్తాను. రెండురోజులు తన దగ్గరుంటాను. ఈ లోపల అమ్మకు కబురుచేస్తే అమ్మ వస్తుంది. అప్పుడు మా ఇంటికి వెళ్తాను'' అంది పోర్టర్ వెనకాల నడుస్తూ.

సూర్యానికి కోపంవచ్చింది.

ఇంత కఠినమైన మనసా రేణుది. తన బాధ అసలు గుర్తించనట్టూ, పట్టనట్టూ తన దారిన తాను వెళ్ళిపోతోంది.

తన బాధనూ, కోపాన్నీ నిగ్రహించుకుని

ఆటో మాట్లాడటానికి వెళ్తూ అడిగాడు–

''ఎక్కడ మీ శిరీషగారిల్లు. ఎక్కడికని మాట్లాడను ఆటో?''

''మలక్‌పేట – మున్సిపల్ కాలనీ''

సూర్యం ఆటో మాట్లాడాడు. పెట్టె అందులో పెట్టించాడు.

రేణూ ఆటోలో ఎక్కి కూర్చుంది.

''వెళ్తున్నారన్న మాట'' ఆటోలోకి తొంగిచూస్తూ అన్నాడు.

''ఊఁ – వెళ్తున్నా'' అంది రేణూ నవ్వుతూ –

సూర్యం కోపాన్ని అణుచుకుంటూ–

''మరి నే వుంటాను'' అన్నాడు.

''ఉన్నార్లే రండి – ఎంతసేపు ఆటో ఆగుతుంది – ఎందుకలా నుంచుంటారు'' ఆటోలో ఓపక్కకి జరిగి సూర్యాన్ని ఆహ్వానిస్తున్నట్లు అన్నది రేణు. సూర్యం ఒక్క నిమిషం బిత్తరపోయాడు.

''ఏమంటున్నారు...?'' అని అడిగాడు ఆనందంతో నిండుతానంటున్న మనసుని వారిస్తూ.

''రమ్మంటున్నాను... ఆటో ఎక్కండి. శిరీష దగ్గరికి ఇద్దరం కలిసివెళితే సంతోషిస్తుంది''

సూర్యం చెయ్యిపట్టుకుని ఆటోలోకి లాగింది. ఆటో ఆగకుండా పోతోంది రకరకాల వాహనాల్ని తప్పించుకుంటూ. రేణు చేతిలో సూర్యంచెయ్యి. ఆశ్చర్యానందాలతో ఉక్కిరిబిక్కిరవుతున్న సూర్యాన్ని వినోదంగా చూస్తూ కూర్చుంది రేణు.










ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.

★ ''చతుర''లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. ''చతుర''లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువగాకుండా ఉండాలి. వ్రాతప్రతిలో వారి వారి దస్తూరినిబట్టి,ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం ''చతుర'' కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికగాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటు తగుపోస్టేజీని జతపరచాలి. వ్రాత ప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్

# చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482.




నిన్న...

"ఏమిటండీ అలా చూస్తున్నారు? కొత్తవ్యక్తినేమీ కాదుగా! వెళ్లి మొహం కడుక్కుని రండి... కాఫీ ఇస్తాను" అంటూ భర్త చేతిలోని మల్లెపూల పొట్లాన్ని అందుకుని పూలను తల్లో తురుముకుందామె. కూనిరాగాలు తీస్తూ అద్దం ముందు నిల్చొని వివిధ భంగిమల్లో తన్ను తాను చూసుకుని మురిసిపోయింది. ఇంతలో అతను రానేవచ్చాడు. ఆ సాయంత్రం సరదాగా గడిచిపోయింది.

నేడు...

"మరో మాటన్నావో మర్యాదదక్కదు- జాగ్రత్త" అంటూ ఆమె చెంప ఛెళ్లుమనిపించి "ఇంకెప్పుడూ ఇలాంటి వాగుడు వాగకు" అంటూ అక్కడినుండి వెళ్లిపోయాడు.

నవ్వుల నదిలో పువ్వుల పడవలా సాగిపోతున్న వారి వైవాహిక జీవనగమనంలో సుడిగుండాలెలా ఎదురయ్యాయి? ఓ స్వార్థపరుని కక్ష వీరినెలా విడదీసి రకరకాల శిక్షలకి గురిచేసింది?

ముద్దంశెట్టి హనుమంతరావు తాజా నవల 'కక్ష'

**నవంబర్ చతుర లో చదవండి**

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd No. H/HD/402